# అమ్మే బ్రహ్మ

(జిల్లెళ్ళమూడి 'అమ్మ' చరితామృత విశ్లేషణ)



వడ్డాది సత్యనారాయణమూర్తి

# అమ్మే బ్రహ్మ

(జిల్లెళ్ళమూడి 'అమ్మ' చరితామృత విశ్లేషణ)

వడ్డాది సత్యనారాయణమూర్తి

సాహితి

**అమ్మే బ్రహ్మ**

(జిల్లెళ్ళమూడి 'అమ్మ' చరితామృత విశ్లేషణ)

**వద్దాది సత్యనారాయణమూర్తి**

బ్లాక్ A-1, శ్రీ హైమా నిలయం

జిల్లెళ్ళమూడి - 522 113

బాపట్ల మండలం, గుంటూరు జిల్లా.

ఫోన్ : **9703416276**

ముద్రణ : అక్టోబర్, 2015

వెల : రూ. **90/-**

కవర్ డిజైన్ : జి.సత్యానంద్

ప్రచురణ కర్తలు :

**సాహితి ప్రచురణలు**

29-13-53, కాళేశ్వరరావు రోడ్డు,

సూర్యారావుపేట, విజయవాడ -520 002.

ఫోన్: 0866 - 2436642/43, 8121098500

**e-mail : sahithi.vja@gmail.com**

# అంకితం

"నేను అమ్మను. మీరు బిడ్డలు.
నేనే మిమ్మల్నందర్నీ కని, మీ తల్లులకు
పెంపుడునిచ్చాను." అన్న జగన్మాత "అమ్మ"కు

– వద్దాది సత్యనారాయణమూర్తి

పూరింటిలో అమ్మ



"నాన్నా! బాగున్నావా? అన్నం తిని పో!"

అమ్మ కుటుంబం :

ఎడమ నుంచి కుడికి : పైన కుర్చీలలో

సర్వశ్రీ 1) నాన్నగారు (అమ్మ భర్త), కనకమ్మగారు (అమ్మ అత్తగారు), అమ్మ,

క్రింద కూర్చున్న వారు :

సర్వశ్రీ : రవీంద్రరావుగారు (అమ్మ చిన్న కుమారుడు), కీ॥శే॥ హైమావతీదేవి (అమ్మ కుమార్తె), కీ॥శే॥ సుబ్బారావుగారు (అమ్మ పెద్ద కుమారుడు)



సామాన్య గృహిణిగా ఆదిపరాశక్తి

# విషయసూచిక

## అం ఆ

# అమ్మే బ్రహ్మ



శ్రీ వడ్డాది సత్యనారాయణమూర్తిగారు వృత్తి రీత్యా ఏయే పదవులు అలంకరించినా ప్రవృత్తిరీత్యా మంచి రచయిత. ఆధ్యాత్మిక చింతన గలవారు. వారితో నా పరిచయం గడచిన రెండు మూడు సంవత్సరాలే అయినా ఎన్నో ఏళ్ళ బంధం వున్న వ్యక్తిలా జిల్లెళ్ళమూడిలో అందరింటి వాడుగా మసలుతున్నారు.

వారు చేసిన రచనలు యెన్నో బహుళ ప్రజాదరణ పొందినవి. (ఉదా : ధ్యానసాగరం, మరో ఆదిశంకరులు రావాలి, శ్రీ శ్రీపాదగీతామృతం).

జిల్లెళ్ళమూడి చేరిన అతని కాలంలోనే 'అమ్మ' అనుగ్రహంతో అనేక అనుభూతులను పొందినవారు. అమ్మ పట్ల అపారమయిన భక్తి విశ్వాసాలతో మానసిక సాన్నిహిత్యాన్ని కలిగి, అమ్మ సాహిత్యాన్ని, ముఖ్యంగా అమ్మ జీవిత చరిత్ర అయిన "అమ్మ జీవిత మహోదధి"ని అధ్యయనం చేసారు.

ఆ క్రమంలో వారి మదిలో మెదిలి, వారి కలం నుండి జాలు వారిన అక్షరాంజలియే ఈ గ్రంథం. ఈ గ్రంథం చదివిన వారికి, 'అమ్మ'ను భౌతికంగా వారు దర్శించలేదంటే ఆశ్చర్యం కలుగక మానదు.

అయితే వారి అధ్యయనం, ఆసక్తి, 'అమ్మ' పట్ల వారికిగల సమర్పణ భావం స్పష్టమవుతుంది. 'అమ్మ'ను వారు భౌతికంగా దర్శించకపోయినా, 'అమ్మ' అనుగ్రహ వీక్షణం వారి పట్ల సంపూర్ణంగా ప్రసరించిందని అనిపిస్తుంది.

అమ్మ మాటలు – "నేను నేనైన నేను", "ఈ సృష్టి నాది – అనాది" అన్న మాటలకు అద్దంపడుతూ ఈ గ్రంథం 'అమ్మే బ్రహ్మ'ను రూపొందించారు.

'అమ్మ' ప్రేమతత్త్వం – పశుపక్ష్యాదులకే కాదు, క్రిమికీటకాదులకే కాదు, సర్వ వ్యాపకమయిందని చెప్పిన సంఘటనలు ఇందులో చోటు చేసుకున్నవి.

'అమ్మ' ఆలయ ప్రవేశం చేసిన తరువాత వచ్చిన వారికి, క్రొత్తవారికి, అమ్మ సమగ్ర అవతార తత్త్వాన్ని అనేక రసవత్తర సంఘటనల ద్వారా అందించిన సత్యనారాయణ మూర్తిగారు ధన్యులు.

ఈ ఒక్క గ్రంథాన్ని చదివిన వారికి 'అమ్మ' సంపూర్ణ తత్త్వాన్ని అధ్యయనం చేసిన స్ఫూర్తినివ్వగలదని విశ్వసిస్తున్నాను.

**బ్రహ్మాండం రవీంద్రరావు**, జిల్లెళ్ళమూడి
శ్రీ విశ్వజననీ పరిషత్ పాట్రన్
(అమ్మ చిన్నకుమారులు)



# ముందుమాట

సోదరులు శ్రీ సత్యనారాయణ మూర్తిగారు తమ పదవీ విరమణానంతరం విశ్రాంత సమయంలో జిల్లెళ్ళమూడి విచ్చేసి ఈ ప్రాంతాన్ని తమ కనువుగా భావించి ఇక్కడే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

నాకు తెలిసినంతవరకూ వారి ప్రాథమిక సాధన దత్తపరంపరలోను, ధ్యాన మార్గంలోను ఇమిడి వున్నది. దానిలో వారు విశేషమైన రచనలు కూడా కొనసాగించారు. ప్రావీణ్యం, అనుభవం పొందారు.

అయితే జిల్లెళ్ళమూడి వచ్చిన తదుపరి అమ్మచేత కూడా మిక్కిలిగా ప్రభావితు లైనారు. భగవంతుడు అందరిలోను, అన్నిటిలోను, అంతటా వున్నా, ఒక్కొక్కచోట రూపధారణ చేసి, కాల పరిస్థితుల ననుసరించి, భూమిమీద అవతరిస్తాడు. ఈ క్షేత్రంలో అట్టి దైవం సంపూర్ణమైన మాతృత్వ అవతారంగా ఆవిర్భవించాడు.

మాతృత్వంలోనే దివ్యత్వం, దైవత్వం పొందుపరచబడినది. అట్టి దైవస్వరూపమే మాతృశ్రీ అనసూయాదేవి. జనబాహుళ్యం ఆమెను 'జిల్లెళ్ళమూడి అమ్మ'గా స్మరిస్తారు. సనాతనులు జిల్లెళ్ళమూడి అమ్మనే శ్రీ రాజరాజేశ్వరి పరిపూర్ణ స్వరూపం భువిలోకి వచ్చినట్టుగా భావించి పూజిస్తారు. అమ్మ మాత్రం "నేను అమ్మను. మీరు బిడ్డలు." "నేనే మిమ్ముల నందరినీ కని మీ తల్లులకు పెంపుడు కిచ్చాను" ఇదీ అమ్మ మాటలోని తీయని అమ్మదనం!

దైవము మానవరూపం ధరించినపుడు రూపానికి కాల పరిమితి వుంటుంది. ఆ విధంగానే అమ్మ, 28 మార్చి, 1923, ఆశ్లేష శుద్ధ ఏకాదశి ఘడియల్లో రూపధారణ చేసి, 12, జూన్, 1985లో తమ దివ్యదేహాన్ని భక్తులకు క్షేమ, స్థైర్య, అభయ, ఆయురారోగ్యాలను అనుగ్రహించుటకై అనసూయేశ్వరాలయంలో ప్రతిష్ఠింపజేసింది.

అమ్మ రూపం పరిమితమైనప్పటికీ, కాలానికి కట్టుబడని అమ్మ మాతృత్వం, దివ్యత్వం దైవత్వం అపరిమితం! అనంతం!

అమ్మ తన పవిత్ర దేహధారణలోనే "తల్లి అంటే తొలి", "అమ్మ అంటే అంతులేనిది, అడ్డులేనిది, అంతటా నిండివున్నది" అని ప్రకటించారు. యావత్ మానవళికి, చరాచర జీవరాశులకీ, సంపూర్ణ సృష్టికి తన మాతృత్వపు ప్రేమ, కరుణ, రక్షణ హామీ యిచ్చారు. అమ్మ మాతృత్వం సర్వాన్ని ఆవరించింది. జడం, అజడానికి కూడా. అమ్మ దృష్టిలో జడం అనే భూమిక లేదు. అంతా జీవత్వం, చైతన్యమే. శాస్త్రం కూడా దీనిని ధృవపరచింది.

అమ్మ విశేష మాతృత్వం విస్తృతమై, విస్తారమై, జగత్తులోని, సృష్టిలోని సర్వాన్ని జడాన్ని అజడాన్ని కూడా ఆవరించి వుంది.

అమ్మ జీవిత మహోదధిలో సర్వజీవరాశులు తరంగాలై, అంటే యావత్ సృష్టి అమ్మలోనే ఉద్భవించి, అమ్మచే పోషింపబడి, అమ్మలోనే లయమవుతుంది. అందుకే అమ్మ "ఈ సృష్టి నాది అనాది" అని నిర్ద్వందంగా ప్రకటించింది. సాధారణంగా చెప్పాలంటే సర్వ సృష్టి అమ్మలోనే నిబిడీకృతమై వున్నది.

అట్టి దివ్య మాతృత్వ స్వరూపాన్ని, విశేషణాన్ని, లక్షణాలను ప్రస్తావిస్తూ సుమారు వందకు పైగా గ్రంథాలు వివిధ భాషల్లో, విభిన్న కోణాలలో వెలువడినవి. ప్రతి సాధకుడు, శోధకుడు, భక్తులు అమ్మ ప్రియతమ బిడ్డలుగా భావించబడ్డా వారి వారి కోణాలలో అమ్మను దర్శించారు. ఈ భిన్నత్వంలోని ఏకత్వమే అమ్మ మాతృత్వం.

అన్ని గ్రంథాలలోకి అతిప్రాముఖ్యమైనది, అమ్మ ముఖతా వెలువడినది, ప్రమాణముగా భావింపబడినది అమ్మ స్వీయ చరిత్ర "అమ్మ జీవిత మహోదధి". ఇది అమ్మ ముఖతా వెలువడితే సోదరుడు శ్రీ యార్లగడ్డ భాస్కరరావు అన్నయ్యచే వ్రాయింపబడినది. రెండవది "అమ్మ వాక్యాలు". ఇది అమ్మ మాట్లాడిన అక్షర సత్యాలు, సూక్తులు, మార్గదర్శకాలు. తతిమా రచనలన్నీ వారి వారి అవగాహనలు, వివరణలు.

శ్రీ మూర్తిగారు "అమ్మ జీవిత మహోదధి" గ్రంథాన్ని అధ్యయనం చేయటం, దానిని నిశితంగా పరిశీలించి, తాము వ్రాసిన "అమ్మే బ్రహ్మ" అనుగ్రంథంలో వివరించటం ఎంతో ముదావహం. నిజానికి అమ్మ తన శైశవం నుంచే ఎన్నో మహిమలు మహత్యాలు ప్రదర్శించారు. అయితే వేటికీ కూడా తన కర్తృత్వాన్ని ఆపాదించలేదు. మీదు మిక్కిలి "మరుగే నా విధానం" అని ప్రకటించారు. పైగా "ప్రకృతిని మించిన మహిమలు లేవు. వేరేవీ ప్రకృతికి సాటిరావ"ని వినయంగా వెలిబుచ్చారు. మానవాళికి హితోపదేశంగా "మంచిని మించిన మహిమలు లేవు" అని ఉద్బోధించారు.

అమ్మ మన్నవలో జన్మించినా, తన జీవితకాలం యావత్తూ శైశవం, బాల్యం, కౌమారంలో మన్నవ తదితర గ్రామాలయందుగల తమ బిడ్డలకు మాతృత్వప్రేమను, ఆదరణనూ మహిమాన్వితంగా ప్రదర్శించారు. తదుపరి, వివాహానంతరం జిల్లెళ్ళమూడి విచ్చేసి, గృహస్థాశ్రమం స్వీకరించి, తమ అపురూప మాతృత్వ వాత్సల్యాన్ని వర్షిస్తూ, అతి విశిష్టమైన కాలాతీతమైన, తమ అవతార విశేషాలను, మహిమలను బిడ్డలకు ప్రదర్శించి తన అవతారప్రకటన చేశారు.

అన్ని సమయాలలోను, అందరి భక్తులను జాతి, కుల, మత, ప్రాంత, భాష, లింగ బేధ రహితంగా తన బిడ్డలుగానే భావించారు. గోరుముద్దలు పెట్టి లాలించారు. వెన్నుతట్టి బుజ్జగించి జీవిత పథంలో నడిపించారు. అట్టి వారందరూ కూడా అమ్మలో అద్భుతాలను,

# ఎవరీ అమ్మ ?



సృష్టికి మూలమైన దివ్యమాతృప్రేమ మూర్తీభవించి కరచరణాది అవయవములతో "అమ్మ"గా జిల్లెళ్ళమూడిలో అవతరించింది.

అమ్మను "అమ్మా!" అని పిలవటంలో ఒక దివ్యానుభూతి కలుగుతుంది. సామాన్య మానవులే కాదు, సాధుపుంగవులు, సన్యాసులు సహితం "అమ్మా! అనే పిలుపులోని కమ్మదనాన్ని అనుభవించారు. అమ్మ పలకటింపులోని ప్రేమామృతాన్ని ఆస్వాదించారు. ఆ ప్రేమమూర్తి పాలనలో పరవశించారు. ఎందరో మేధావులు, ఆస్థికులు, నాస్థికులు, శాస్త్రజ్ఞులు, రాజకీయవేత్తలు, విదేశీ యాత్రికులు తమతమ పదవులను మరచిపోయి అమ్మ చల్లని ఒడిలో సేదదీరినవారే. వారందరికీ అమ్మలో దివ్య మాతృప్రేమే గోచరించింది.

అమ్మలో ప్రకటితమయ్యే మాతృత్వం మానవులకే పరిమితం కాదు. ఈ సృష్టిలో గల సకల జీవరాశులు అమ్మ ప్రేమను పొంది ఆనందించిన ధన్యజీవులే! అమ్మ సకల జీవకోటిని ప్రేమించటంలో ఆశ్చర్యం లేదు. అమ్మది సహజ ప్రేమ. అవ్యాజకరుణ. అమ్మప్రేమకు ఆనకట్టలు లేవు. అమ్మ దృష్టికి అడ్డుగోడలు లేవు.

పశుపక్ష్యాదులు సహితం అమ్మలోని దైవత్వాన్ని గుర్తించి, అమ్మను విడిచి వుండలేక అమ్మ సామీప్యాన్ని కోరుకోవటం, అమ్మ ప్రేమకోసం ఆరాటపడటం, హద్దులు లేని అమ్మ ప్రేమకు నిదర్శనం.

అమ్మ అంటే జిల్లెళ్ళమూడిలో నాలుగు గోడల మధ్య కూచున్న 'అమ్మ' అనేకాదు. దేనికైతే ఆది, అంతము లేదో, ఏది సర్వానికీ ఆధారమో అదే అమ్మ.

ఇకపోతే- గ్రంథకర్తను గురించి రెండుమాటలు.

సోదరుడు వడ్డాది సత్యనారాయణమూర్తిగారు 1997లో ఇరిగేషను డిపార్టుమెంట్‌లో సూపరింటెండెంట్‌గా రిటైర్ అయిన తరువాత శేష జీవితం ఏదో ఒక పుణ్యక్షేత్రంలో ఆధ్యాత్మిక సాధన చేసుకుంటూ కాలం గడపాలని గుంటూరు జిల్లా అమరావతి క్షేత్రానికి చేరారు.

అక్కడ యోగాశ్రమంలో యోగాసనాలు, ఒక బౌద్ధ భిక్షువుద్వారా అక్కడి పెద్దలతో కలసి ధ్యానసాధనలో శిక్షణను పొంది, అందులోగల మెళుకువలను తెలిసికొని, సాధనను

కొనసాగిస్తూ, సద్గ్రంథ పఠనం గావిస్తూ సత్సంగములలో పాల్గొంటూ వుండేవారు. ఇక్కడ జిల్లెళ్ళమూడిలో కూడా అదే మార్గంలో పయనిస్తున్నారు.

వీరు మొట్టమొదటిసారిగా 15.2.2010లో జిల్లెళ్ళమూడికి వచ్చినపుడు, అమ్మ భక్తుడైన డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారిచే రచింపబడిన "అమ్మ- మహర్షి" (రమణ మహర్షి) అనే గ్రంథాన్ని చదివి అమ్మ యెడల ప్రభావితులై ఇది తన ధ్యానసాధనకు అనుకూలమైన క్షేత్రమని భావించి తిరిగి 2012 మే నెలలో జిల్లెళ్ళమూడికి వచ్చి, సుమారు నెలరోజులు ఇక్కడ వుండి ఇక్కడ జరుగుతున్న ఆధ్యాత్మిక కార్యక్రమములలో, సత్సంగములలో పాల్గొని అమ్మను గురించిన గ్రంథపఠనము ద్వారా అమ్మ ప్రబోధకులపట్ల ఆకర్షితుడై, జిల్లెళ్ళమూడిలో స్థిర నివాస మేర్పరచుకొనుటకు 15.8.2012 తేదీన సతీ సమేతంగా ఇక్కడకు వచ్చి వానప్రస్థ జీవితం గడుపుతూ, ఇక్కడ గల సేవా కార్యక్రమములలో, నామ సంకీర్తనలలో పాల్గొంటూ వారి శేష జీవితాన్ని ధన్యం చేసుకుంటున్నారు.

వీరు 2012 మే నెలలో ఇక్కడకు వచ్చినప్పటినుండి నాకు మంచి మిత్రులు. పదిమందికీ ఉపయోగపడాలనే తపన గలవారు. యోగసాధకుడు. పైగా మంచి రచయిత.

ఇక్కడకు వచ్చే, ఇక్కడ నివాసముంటున్న అనేకమంది అమ్మ భక్తుల అనుభవాలను తెలుసుకుని, అమ్మను గురించి అనేకమంది భక్తులు వ్రాసిన గ్రంథములను, ముఖ్యముగా అమ్మ స్వీయ చరిత్ర అయిన "అమ్మ జీవిత మహోదధి"ని చదివి, అమ్మ పరతత్త్వాన్ని అవగాహన చేసుకుని, తాను అనుభవించే ఆనందాన్ని అమ్మను గురించి తెలియని, ఆమెను గురించి తెలుసుకోవాలనుకే వారికి తెలియజేయాలనే తపనతో "అమ్మే బ్రహ్మ" అనే గ్రంథరచన కుపక్రమించారు.

ఇక, ఈ గ్రంథాన్ని గురించి రెండు మాటలు చెప్పవలసి వస్తే-

అమ్మ పుట్టుకతోనే అంటే- ఈ భూమి మీద పడగానే మంత్రసాని నాగమ్మకు అనేక దివ్య దర్శనాలివ్వడంతో బాటు, అనేక ప్రాణులకు ముక్తిని ప్రసాదించి తన అవతార రహస్యాలను తెలియజేసింది.

అమ్మకు 19 మాసముల వయసులో శాంభవీ ముద్రను వేసి, పుట్టుకతోనే తనకున్న యోగానుభవాన్ని తెలియజేసింది.

తనకు అపకారం చేసిన జాలరిని రక్షించి, మూర్తీభవించిన తన మాతృప్రేమను తెలియజేసింది.

అవినీతికి పాల్పడుతున్న మస్తాన్, అంకదాసులనే పోలీసులకు జ్ఞానోపదేశం చేసి కర్తవ్యనిష్ఠను బోధించి, వారిని తన భక్తులుగా చేసికొన్నది.

"అనేకంగా కనిపిస్తుంది- ఒకటిగా అనిపిస్తుంది!!" అమ్మ చెప్పిన ఇదేమాటను అనుభవపూర్వకంగా అమ్మ తన ఐదు సంవత్సరముల వయసులోనే "అనేకంగా కనిపించే ఈ చరాచర జగత్తంతా ఒకటిగానే అనిపిస్తుంది" అనే అద్వైత సిద్ధాంతానికి పరాకాష్టగా ప్రయోగాత్మకమైన తన అనుభవాన్ని తెలియజేసింది.

అమ్మ చిన్నతనంలో అమ్మబట్టలు ఉతికే ఆధ్యాత్మిక సాధకురాలైన చాకలి బుచ్చమ్మ అమ్మ దుస్తులలోనుండి, ఆ దుస్తులను ఉతికే చెరువు నుండి సుగంధ పరిమళాలు వ్యాపించడం గమనించినది. అమ్మ ఆమెకు అనేక దివ్యదర్శనాలు యిచ్చి, జ్ఞానోపదేశం చేసింది.

కాసు రాధాకృష్ణరెడ్డి అనే అంధుడైన భక్తునికి కొన్ని నెలలపాటు చూపును ప్రసాదించి- "అమ్మా! నిన్ను చూచిన కళ్ళతో ఈ ప్రపంచాన్ని చూడలేనన్న" అతని కోరికపై తిరిగి అతని చూపును ఉపసంహరించి, అతనికి అనేక దివ్య దర్శనాలను యిచ్చి ఈ సృష్టిపై తనకున్న ఆధిపత్యాన్ని చాటుకుంది.

విదేశీ భక్తుడైన గార్డన్ వెస్టర్‌లండ్ ఆరోగ్యాన్ని ఎలా కాపాడిందీ, అమ్మను ఎన్నడూ దర్శించని అతనికి తన సగుణ, నిర్గుణ రూపాన్ని ఎలా ఎరుక పరచిందీ తెలియచేస్తూ, ఆ మేరకు ఆయన ఈ గ్రంథ రచయితకు వ్రాసిన లేఖను కూడా ఇందులో పొందుపరచి, చక్కని విశ్లేషణను దానిపై అందించారు రచయిత.

ఇటువంటి అనేక సంఘటనలను చక్కని విశ్లేషణతో అందించిన సోదరులు శ్రీ వడ్డాది సత్యనారాయణమూర్తి గారికి ఆత్మీయతాపూరకమైన అభినందనలు.

ఈ గ్రంథం సాధకులకు, జిజ్ఞాసువులకు, యోగాభ్యాసులకు చాలా ప్రయోజన కరమైనది. ఈ గ్రంథం చదువుతున్నంతసేపూ అమ్మ, అమ్మ తత్త్వం, అమ్మయొక్క నిజరూపం, మనసునిండా మెదులుతూ వుంటుంది.

ఈ గ్రంథరచనలో ఆయనకు ప్రేరణ యిచ్చిన అమ్మకు సాష్టాంగ నమస్కారములు అర్పిస్తూ, ఇంకా అనేక గ్రంథాలు వారి ద్వారా వెలువరింపబడాలనీ, వారిపై, వారి కుటుంబ సభ్యులపై అమ్మ యొక్క కరుణారస దృక్కులు సదా ప్రసరింపబడాలనీ కోరుతున్నాను.

ఇట్లు
ఆత్మీయ సోదరుడు
**టి.టి. అప్పారావు**
(మాజీ వైస్ ప్రెసిడెంట్
ఓరియంటల్ కాలేజి, జిల్లెళ్ళమూడి)

# నా విన్నపం

"నేను 'అమ్మే బ్రహ్మ' అని "జిల్లెళ్ళమూడి అమ్మ' మీద ఒక విశ్లేషణా గ్రంథాన్ని వ్రాస్తున్నాను. కనుక 'అమ్మ' మీద మీ అభిప్రాయాన్ని తెలుపవలసినది" అని ఇ మెయిల్‌లో అడిగిన వెంటనే మరునాడే ఇ మెయిల్ చేస్తూ అమ్మ 'బ్రహ్మ' మాత్రమే కాదు– 'బ్రహ్మము' (సర్వాంతర్యామి) కూడా" అని బదులిచ్చారాయన.

ఆయన ఎవరో కాదు. అమ్మ దేహధారిణిగా వుండగా ఒక్కసారి కూడా వచ్చి ఆమెను చూడని, ఖండాంతరాలలో వున్న "గార్డన్ వెస్టర్‌లండ్' అనే అమెరికన్ భక్తుడు.

రమణ మహర్షి అనుయాయులు వ్రాసిన "ది మౌంటెయిన్ పాత్" అనే ఆంగ్ల త్రైమాసిక పత్రిక (~~జులై – సెప్టెంబర్ 2012~~) లో అమ్మను గురించి మొదటిసారిగా చదివి, ఆమె ఏమిటో తెలుసుకుని అమ్మపట్ల విశేషంగా ప్రభావితుడై, అమ్మను తన గుండెలలో నిలుపుకొని కొలుచుకున్న ఏకలవ్య భక్తుడు. అమ్మ కూడా కేవలం స్మరణ మాత్రం చేత ఖండాంతరాలలో వున్న ఆయనను అనుక్షణం కనిపెట్టుకుని వుండి, ఆయనకు అనేక కష్టనష్టాలలో తన అదృశ్యహస్తాన్ని అందించి, తాను 'బ్రహ్మ'యే కాదు, బ్రహ్మము"నని కూడా తెలియజేసింది. ఆ వివరాలు 'అమ్మ విదేశీ భక్తులు' అనే అధ్యాయంలో చదివి తెలుసుకోండి.

నాకు కూడా అమ్మను గురించి మొదటగా గార్డన్ వెస్టర్‌లండ్‌గారికి మల్లే ఏమీ తెలియదు. పైగా నేను మనదేశంలోనే, అదీ ఆంధ్రదేశంలో వుండికూడా 'ఆమె దేహధారిణి'గా ఈ నేలపై తిరుగుతున్నప్పుడు చూచియుండలేదు. అప్పట్లో నాకు తెలిసినదేమిటంటే 'జిల్లెళ్ళమూడి అమ్మ' అంటే, ఆమె వద్దకు వెళ్ళిన వారికి ఆదరంగా ఇంత అన్నం పెడుతుందనే.

నేను ఎన్నోసార్లు చెన్నైలోని మా సోదరుల ఇళ్ళకు వెడుతూ మధ్యలోగల బాపట్ల స్టేషన్‌లో దిగి జిల్లెళ్ళమూడి వెడదామనుకుంటే కుదరలేదు.

నేను రిటైరైన తరువాత అమరావతి నుండి మహానంది వెడదామని బయల్దేరి, రైలు రద్దవడం వల్ల తిరిగి వెనక్కు వెళ్ళలేక ఎప్పుడో వెడదామనుకున్న జిల్లెళ్ళమూడికే రావలసి వచ్చింది. అయితే అమ్మే ఆ విధంగా రప్పించుకున్నదేమోనని ఆ తరువాత అనిపించింది.

రమణ మహర్షి యొక్క అంతర్ముఖ సాధకుడనైన నాకు ఇక్కడకు వచ్చాక గాని తెలియలేదు– అమ్మ కూడా రమణుల వలె అంతర్ముఖి అనీ, ఆత్మస్వరూపమని. అది

కూడా అటు రమణులకు, ఇటు అమ్మకు భక్తుడైన డా॥శ్రీపాద గోపాల కృష్ణమూర్తి గారి ప్రచురితమైన "అమ్మ- మహర్షి" అనే గ్రంథ పఠనం వల్లనే తెలిసింది.

అప్పుడనుకున్నాను- "అరెరె! అమ్మను గురించి ముందుగానే తెలిస్తే, ఇదివరకు తిరువణ్ణామలై వెళ్ళివచ్చినప్పుడు అక్కడనుంచి నేరుగా జిల్లెళ్ళమూడికి వచ్చివుండే వాడినే" అని. అంతేకాదు, అమ్మ దేహధారిణిగా వుండగా వచ్చిచూసే అదృష్టాన్నికూడా పోగొట్టుకున్నానే! ఎన్నిసార్లు వద్దామనుకున్నా ఎందుకు రాలేకపోయాను?" అని బాధగా నన్ను నేనే ప్రశ్నించుకున్నాను.

అలా ఎందుకు రాలేకపోయానో రెండేళ్ళ తర్వాత 2012 మే నెలలో ధ్యానసాధన కొరకు హైదరాబాదు నుండి జిల్లెళ్ళమూడి వచ్చి నెలరోజులపాటు ఇక్కడ వుండి, ఇక్కడి పెద్దలు చెప్పిన విషయాలు, అమ్మను గురించి వ్రాసిన గ్రంథాలు చదివిన తరువాతగాని తెలియలేదు.

బహుశా వాటిల్లో "అమ్మ- అమ్మవాక్యాలు" అనే గ్రంథంలో ననుకుంటా "ఎన్నిసార్లు జిల్లెళ్ళమూడికి వచ్చి నిన్ను దర్శించుకుందామనుకున్నా రాలేకపోయానమ్మా!" అని ఎట్టకేలకు జిల్లెళ్ళమూడికి వచ్చి అమ్మముందువాపోయిన ఒక భక్తునితో "నువ్విక్కడకు రావాలనుకున్నా నేననుకోవాలిగా నాన్నా!" అందట అమ్మ. అంతేకాదు, "నేను తలచుకోకపోతే ఏడవ మైలు (బాపట్ల నుండి పెదనందిపాడు పోయే రోడ్డులో జిల్లెళ్ళమూడి గ్రామానికి చీలిపోయే బాట దగ్గర) దాటి ఎవరూ ఇక్కడకు రాలేరు" అన్నదట కూడా.

అప్పుడుగాని తెలిసింది కాదు - అమ్మ సర్వాంతర్యామి అనీ, తన దగ్గరకు వచ్చిన వారి గురించే కాదు, వద్దామనుకున్నా రాలేని వారిని గురించి కూడా ఆమెకు తెలుసునని, దాని కనుగుణంగానే వారిపట్ల ఆమె ప్రవర్తిస్తుందనీ.

అటువంటి శక్తి, పరాత్పరి అయిన ఒక్క ఆదిపరాశక్తికే వున్నది. దానికి ఉదాహరణ పైన పేర్కొన్న అమెరికా నివాసి గార్డన్ వెస్టర్‌లండే. తరువాత నేను లేక నావంటివారు.

వెస్టర్‌లండ్ అయితే అమ్మను గురించి కేవలం ఒక పుస్తకంలో చదివినంత మాత్రానే ఆమె పట్ల ప్రభావితుడై, ఆమెకు సర్వస్య శరణాగతుడైనాడు. మరి నావంటివారు ఆమెను గురించి విని ఇక్కడకు వద్దామనుకుంటూనే ప్రయాణాన్ని వాయిదా వేసేవారు.

అందుకే అమ్మకూడా నావంటివారి పట్ల ఉదాసీనంగా వుండేదేమో! ఇక తరుణం వచ్చినప్పుడు ఇక్కడకు వచ్చే అర్హత నావంటివారికి వున్నదనుకున్నప్పుడు మాత్రమే ఇక్కడకు రప్పించిందేమో ననిపించింది.

ఎందుకంటే, అమ్మను ఆత్మస్వరూపిణిగా భావించి ఆమెను గురించి అప్పట్లో నేను వ్రాసిన "శ్రీ శ్రీపాద గీతామృతం", "ధ్యానసాగరం" రెండవభాగం గ్రంథాలలో ప్రస్తావించడాన్ని బట్టే అమెకూడా నాగురించి ఆలోచించి, నన్నిక్కడకు రప్పించుకున్నదని నా ప్రగాఢ భావన.

భగవంతుడెప్పుడూ అంతే! తనవంక అక్కరతో తొంగి చూచేవారినే పాదాక్రాంతులైన వారినే, వంగి, లేవదీసి అక్కున చేర్చుకుంటాడు. ఇక్కడ నాకు జరిగిందీ అదే.

ఇదంతా జరిగింది పైన పేర్కొన్నట్టుగా నా నెల రోజుల సాధనలో నేను అమ్మను గురించిన గ్రంథాలు చదివి, ఇక్కడ ఆశ్రమంలో అమ్మతో ప్రత్యాక్షానుభవం కలిగిన భక్తులతో జరిపిన సత్సంగాల వలన, అమ్మను కేవలం ఒక సామాన్య గృహిణి వలెగాక ఆమె సాక్షాత్తూ ఆదిపరాశక్తి యని గ్రహించి, ఆమెలో శ్రీ అనసూయమాతకుగల అసామాన్య మహిమాన్వితాన్ని, శ్రీ రాజరాజేశ్వరికిగల అపార కరుణను కనుగొని, ఆమెకు ప్రణమిల్లటం వల్లనే.

అందుకే అమ్మలోగల అనసూయత్వాన్ని, రాజరాజేశ్వరి తత్త్వాన్ని విశదీకరిస్తూ, విశ్లేషిస్తూ, ఈ "అమ్మే బ్రహ్మ" అనే గ్రంథరచన కుపక్రమించాను.

అనుకున్నానే గానీ ఎలా రాయాలో తెలిసింది కాదు. ఎలా, ఎక్కడనుంచి మొదలుపెట్టాలో తెలిసింది కాదు. దానికీ అమ్మనే వేడుకున్నాను. అప్పుడు అమ్మ "పిచ్చికన్నా!" అని నవ్వుకుని, వెంటనే వచ్చి నా చేయిపట్టుకుని అక్షరమక్షరం నా చేత వ్రాయించింది. దాని ఫలితమే ఈ చిన్ని గ్రంథం.

ఇక అమ్మలోగల అనసూయత్వ, రాజరాజేశ్వరి తత్త్వంగురించి చెప్పాలంటే ఈ చరాచర జగత్తులో గల ఒక్క మానవాళినే కాదు, ప్రతీ చెట్టూ, పుట్టా, క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు మొదలైనవాటిని కూడా తన బిడ్డలుగానే భావించిన మాతృమూర్తి ఆమె.

అందుకే ఒక ముస్లిం భక్తుడు అమ్మను "జయహోమాతా! శ్రీ అనసూయా! రాజరాజేశ్వరి! శ్రీ పరాత్పరి!" అని శ్లాఘించాడు. అదే శ్లాఘను ఒక హిందువు అయితే "జయహే!" అని మొదలుపెట్టేవాడు. ఆ భక్తుడు ముస్లిం కాబట్టి "అల్లాహో!" అనే క్రమంలో "జయహో!" అని మొదలుపెట్టాడు.

అయితే అమ్మకు కుల, మత, వర్గ, వర్ణ విబేధాలు లేవుకాబట్టి ఆ ముస్లిం భక్తుని నామసంకీర్తననే తన నామ సంకీర్తనగా చేసుకున్నది ఆ అనసూయమాత! రాజరాజేశ్వరి! శ్రీ పరాత్పరి!

ఇలా– తల్లి గర్భంనుండి భూమ్మీద పడుతూనే తానేమిటో తెల్పిన అమ్మను గురించి చెబుతూ పోతే చాలా వున్నది. దానిని గురించి, ఈ గ్రంథానికి ముందు మాటను వ్రాసిన శ్రీయుతులు డా. దినకర్, టి.టి. అప్పారావు, బ్రహ్మాండం రవీంద్రరావు (అమ్మ చిన్న కుమారుడు) గారలు తమ ముందుమాటల్లో చక్కగా విశదీకరించారు.

వారిని గురించి పరిచయ వాక్యాలు కొన్ని.

వారిలో శ్రీ ఎమ్. దినకర్‌గారు– శ్రీ విశ్వజననీ పరిషత్ పూర్వాధ్యక్షులు. ప్రస్తుతం ఈ పరిషత్ యొక్క స్టీరింగ్ కమిటీ మెంబరు. వారు ఎమ్.ఎ. (అప్లైడ్ ఎకనామిక్స్) చదివిన విద్యాధికులేకాదు, తెలుగులో కూడా పాండిత్య ప్రాభవం కలిగిన ఉభయ భాషా ప్రవీణులు. వారు అనేక ఉన్నతోద్యోగములను చేసి, చివరగా జిల్లెళ్ళమూడిలో స్థిరపడి, అమ్మ సేవలో తరిస్తున్న మహనీయులు. వారు అమ్మచే నడుపబడిన "మాతృశ్రీ" పత్రికకు సంపాదకత్వమును నెరపుటయేగాక, ఆంగ్లభాషా ప్రవీణులైనందున ఆంగ్లములో వారు అమ్మపై Sojourn (A spiritual Odessey), Ammaness అను గ్రంథములు వ్రాసి, తద్వారా అమ్మ తత్త్వమును, అమ్మయొక్క అమ్మదనమును భక్తజనావళికి అందజేసారు. వారికి నా కృతజ్ఞతలు.

ఇక రెండవ వారైన శ్రీ టి.టి. అప్పారావుగారు అమ్మతో చిరకాల అనుబంధమును కలిగినవారు. వారు ఏలూరులో వ్యాపారము చేస్తూ అమ్మపట్ల విశేషంగా అకర్షితులై చేస్తున్న వ్యాపారమును కూడా వదులుకుని (ఎందువల్లనంటే వ్యాపారములో వాడవలసిన అబద్ధముల పట్ల విముఖులై) జిల్లెళ్ళమూడికి వచ్చి అమ్మసేవలో స్థిరపడిన వారు. అంతేకాదు, వారు యోగసాధనలో నిష్ణాతులు. కుండలినీ సాధకులు. పైగా లలితోపాసకులు. వారు లలితా సహస్రనామమును అభినయ పూర్వకముగా చదువుతూ వుంటే, సాక్షాత్తూ శ్రీలలితాదేవి వచ్చి వారిముందు నిలిచిందా? అన్న అనుభూతిని పొందుతాము. వారుకూడా అమ్మపైన "అమ్మ అందించిన ఆత్మానుభవము" (ఇది ఆంగ్లంలోకి అనువదింపబడినది). "అమ్మ అమ్మే" (ఇదికూడా ఆంగ్లంలోకి అనువదింపబడుతున్నది) అనుగ్రంథములను వ్రాసియున్నారు.

వారికి కూడా నా కృతజ్ఞతలు!

ఇకపోతే– ఈ గ్రంథానికి ముందుమాట వ్రాసిన మూడవ వ్యక్తి, సాక్షాత్తూ అమ్మగర్భంలో నవమాసాలు వుండి అమ్మ రక్తమాంసాలతో రూపుదిద్దుకున్న అమ్మ చిన్నకుమారులు, శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావుగారు. ఇక్కడంతా వీరిని చిన్నా పెద్దా తేడా లేకుండా "రవి అన్నయ్య' అని పిలుస్తాం. వీరు S.B.I. లో మేనేజరుగా చేసి రిటైర్

అయ్యారు. ఈ విశ్వజననీ పరిషత్‌కు వీరు పాట్రన్. అమ్మ దర్శనానికి, స్పర్శకు నోచుకోని నా బోటి అభాగ్యులకు వీరి దర్శన, స్పర్శలే అపురూప అనుభవాలు! వారిని అమ్మ "తీపిగుర్తు'గా మేం భావించుకుంటాం. అయినా వారు చాలా నిగర్వి! ఇక్కడ జరిగే పూజలు ఉత్సవాలలో మేమంతా ముందు కూర్చుంటే వారు మాత్రం మాకు వెనుకగా ఒక మూలన నిశ్శబ్దంగా కూర్చుంటారు. నిర్వాహకులు పిలిస్తేనే ముందుకు వస్తారు. ఈ లోపున మేమెవరమైనా ముందుకు రమ్మని పిలిచినా రాకుండా "అమ్మకు నేనెంతో, మీరూ అంతే" ననే అమ్మతత్త్వాన్ని పుణికి పుచ్చుకున్న నిరాడంబరులు.

పదికాలాలపాటు వారిసేవలు అటు అమ్మకు, వారి దిశా నిర్దేశాలు ఇటు మాకు అందించే మహత్తర అవకాశం కలిగించమని అమ్మను మనసారా కోరుకుంటున్నాను.

ఎన్ని పనులున్నా, అడగగానే ఈ గ్రంథం వ్రాతప్రతిని చదివి ముందుమాటను వ్రాసినందుకు వారికి నా ప్రత్యేకమైన కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను.

ఇకపోతే- అమ్మను గురించి తెలియనివారి కొరకు వ్రాసిన అమ్మయొక్క ఈ పరిచయ విశ్లేషణా గ్రంథం వ్రాయటానికి మూలం అమ్మ స్వయంగా చెబుతూ సోదరులు శ్రీ యార్లగడ్డ భాస్కరరావు గారిచే వ్రాయించిన ఆమె స్వీయచరిత్ర "అమ్మ జీవిత మహోదధి". అందులో అమ్మ ఈ భూమ్మీద పడినప్పటి నుండి ఆమె వివాహమయ్యేంత వరకూ గల విషయములున్నవి.

మిగతా విషయాలు అంటే అమ్మ వివాహం తరువాత నాన్నగారితో కలసి, జిల్లెళ్ళమూడికి రావటం, ఇక్కడ తదితర చోట్ల అమ్మ చూపిన మహిమలు, అవతార కార్యక్రమాలు వగైరాలకు పలువురు అమ్మ బిడ్డలు వ్రాసిన ఈ క్రింది గ్రంథాలు ఆధారం.

1. శ్రీవారి చరణ సన్నిధి- 1,2 భాగాలు. రచన: శ్రీమతి బ్రహ్మాండం వసుంధర. ప్రచురణ- శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి.

2. మహోపదేశం - "-డిటో-, డిటో-"

3. లోక బాంధవి (అనుభవాల వల్లరి)- రచన: శ్రీ మన్నవ దత్తాత్రేయశర్మ. ప్రచురణ- విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి.

4. అమ్మ అమ్మే- రచన: శ్రీ టి.టి.అప్పారావు. ప్రచురణ- విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి.

5. అనుభవసారము (లోచూపు). రచన: మన్నవ బుచ్చిరాజుశర్మ (రాజుబావ) ప్రచురణ- విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి.

6. మహస్సు- నవంబర్ 2011. అమ్మతత్త్వచింతన సదస్సు ప్రత్యేక సంచిక. ప్రచురణ- దర్శనమ్, సికింద్రాబాద్.

7. మాతృశ్రీ తత్త్వసౌరభమ్- రచన: బి.యల్. సుగుణ, ప్రిన్సిపాల్, మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల, జిల్లెళ్ళమూడి.

8. పూర్వగాథాలహరి- రచన: ఎస్.వి.ఎన్. శ్రీ విక్టరీ పబ్లిషర్స్, విజయవాడ.

9. శ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం- సంస్కృత రచన: శ్రీ శంకరభట్టు. తెనుగు అనువాదం- శ్రీ మల్లాది గోవిందదీక్షితులు. ప్రచురణ: శ్రీ శ్రీపాదశ్రీవల్లభ మహాసంస్థానం, పిఠాపురం (తూ.గో.జిల్లా)

10. విశ్వజనని- రచన: శ్రీ రిచర్డ్ షిఫ్‌మన్. (U.S.) మూలగ్రంథం- శ్రీ రిచర్డ్ గారిచేతనే రచింపబడిన మదర్ ఆఫ్ ఆల్. తెనుగుసేత: క్రీ.శే. శ్రీ తంగిరాల కేశవశర్మ. ప్రచురణ : శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి.

ఆయా రచయితలకు, ప్రచురణకర్తలకు నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

చివరిగా పాఠకలోకానికి నా విన్నపములు. ఇందులో తప్పులేమైనా వుంటే అవి నావి. ఒప్పులన్నీ 'అమ్మ'వి, ఆయా గ్రంథ రచయితలవి.

నమస్తే!

భవదీయుడు

**వద్దాది సత్యనారాయణమూర్తి**

జిల్లెళ్ళమూడి

వడ్డాది సత్యనారాయణగారి
ఇతర రచనలు




₹ : 100/-




₹ : 75/-




₹ : 50/-

# అమ్మే బ్రహ్మ

(జిల్లెళ్ళమూడి 'అమ్మ' చరితామృత విశ్లేషణ)

## ప్రస్తావన

**అవును... అమ్మ నిజంగా బ్రహ్మయే!**

అసలు బ్రహ్మ అంటే ఎవరు? సృష్టి, స్థితి, లయ కారకులలో ఒకరయిన సృష్టికర్త చతుర్ముఖ బ్రహ్మ అనా? కాదు.

ఆ బ్రహ్మ ఎలా జన్మించాడని ఎవరైనా అడిగితే... వెంటనే ఆయన విష్ణువు నాభిలోనుండి జన్మించాడని మనకు తెలిసిన విషయం చెబుతాం.

అయితే దేవీ భాగవతంలో దానికొక కథనం వున్నది.

"మొదట మహావిష్ణువు ఒక అరటి ఆకుపై ఓ శిశువుగా పరుండి ఆలోచిస్తున్నాడు. నేనెవరు? ఎవరు నన్ను సృష్టించారు? ఎందుకు సృష్టించారు? నా కార్యక్రమ మేమిటి? ఎక్కడ చెయ్యాలి?"

అని బాల విష్ణువు ఈ విధంగా ఆలోచిస్తూంటే...

అప్పుడొక ఆకాశవాణి గొంతు వినిపించింది. మహావిష్ణువు ఆ పలుకులను విన్నాడుగాని అది ఎవరి ధ్వనియో తెలియలేదు. అయితే అప్పుడొక మహాదేవి నాలుగు చేతులతో చేతిలో ఆయుధాలతో, అనంత శక్తులతో ప్రత్యక్షం కాగా మహావిష్ణువు ఆశ్చర్యచకితుడైనాడు.

అప్పుడా శక్తి ఇలా పలికింది.

"ఓ విష్ణు! ఇందులో ఆశ్చర్యపోవడానికేముంది? ప్రతిసారి ఈ లోకం సృష్టింపబడి, మనుగడ సాగించి, వినాశనం అవుతుంది. నీవు ఆ సృష్టి, స్థితి, లయలకు కారణమైన మహాశక్తికి జన్మించావు. మహాశక్తి గుణరహితమైనది. మనమంతా ఏవో గుణాలున్న వారిమే. నీ ముఖ్య సుగుణం సత్యం. నీ నాభి నుండి బ్రహ్మ ఉద్భవిస్తాడు. అతడు రజోగుణవంతుడు. అంటే క్రియ, కోర్కె, కదలిక గలవాడు. అతని నుదుటి నుండి

రుద్రుడావిర్భవిస్తాడు. అతడు అంధకారానికి గుర్తు. బ్రహ్మ తన తపశ్శక్తితో రక్తపురంగులో సృష్టి చేయగా నీవు దాన్ని రక్షిస్తుంటావు. రుద్రుడు కల్పాంతంలో నాశనం చేస్తాడు" అన్నది.

అట్లే విష్ణువు నాభినుండి బ్రహ్మ జన్మించి, మహా విష్ణువు జగదాంబల ముందు తపస్సు చేయగా వారు అతనికి వరాల నిచ్చారు. ఆ తర్వాత బ్రహ్మ సృష్టిని ప్రారంభించాడు. అతని మనసు నుండి సప్త ఋషులు, ప్రజాపతులు, వారి నుండి కదిలే కదలని వస్తుజాలమంతా సృష్టింపబడింది. (పే. 337 & 338- పూర్వగాథాలహరి)

అయితే బ్రహ్మ ఆవిర్భావానికి వామన పురాణంలో ఇంకొక కథనం కూడా వున్నది.

"కాలానికి ఎంతోముందు లోకమంతా సముద్రంగా వున్నప్పుడు జీవజాలపు శక్తి అంతా ఓ గుడ్డుగా మారింది. అందులో బ్రహ్మ కొన్నియుగాలు నిద్రలో వున్నాడు. దేవతా శక్తి ఆ గుడ్డును ముక్కలు చెయ్యగా 'ఓం'కార నాదం వెలువడింది. దాని మొదటి శబ్దం 'భూ', రెండవది 'భువ', మూడవది 'స్వహ'. అంటే భూర్భువస్వహ. అప్పుడు ఆ గుడ్డు మధ్యనుండి 'బ్రహ్మ' ఉద్భవించాడు." (పే. 338- పూర్వ గాథాలహరి.)

భక్త పాఠకులారా! తెలిసిందిగా. మొదటగా పేర్కొన్న దేవీభాగవతాన్ననుసరించి ఈ సమస్త చరాచర ప్రాణికోటి, బ్రహ్మమానసము నుండి ఉద్భవించిన సప్తర్షులు, ప్రజాపతులనుండి ఉద్భవించినది కాబట్టి, మానవులతో సహా ఈ సమస్తమూ బ్రహ్మమే' అని మనం భావించాలి. అంతేకాని 'బ్రహ్మ' అంటే పురాణాలలో వర్ణించిన "చతుర్ముఖ బ్రహ్మ" కాదు.

ఇక రెండవ కారణంగా పేర్కొన్న బ్రహ్మ ఆవిర్భావ విషయాన్ని పాశ్చాత్య పరిశోధకులు కూడా నిర్ధారించారు. ఈ సమస్త భూమండలం కొన్ని లక్షల సంవత్సరాల క్రిందట ఏర్పడిన ఒక మహావిస్ఫోటనం వల్ల సముద్ర గర్భంనుండి వెలికి వచ్చిందని, ఆ విస్ఫోటనం కూడా అంతరిక్షం నుండి దూసుకు వచ్చిన ఇంకొక గ్రహం, నీటిచే ఆవరింపబడి వున్న మన భూమండలాన్ని దృఢంగా ఢీకొనటం వల్ల ఏర్పడిందని పాశ్చాత్యులు నిర్ధారించారు. దానినే Big Bang 'మహా విస్ఫోటనము'గా వర్ణించారు.

ఆ విధంగా పై కథనాల వల్ల తప్ప ఆదీ అంతమూ తెలియని ఈ సమస్త సృష్టినీ బ్రహ్మ స్వరూపంగా మనం భావించాలి.

'అమ్మ' చెప్పిందీ అదే. ఈ సమస్త సృష్టీ బ్రహ్మస్వరూపమేనని. అంటే కనుపించేదంతా అదేనని. అంతమూ ఆదీ లేనిదని, తెలియనిదని. అంతేకాదు- 'ఈ సృష్టి నాది. అనాది". అని సగర్వంగా ప్రకటించిందా మహాతల్లి! అందుకనే ఈ సమస్త సృష్టినీ, దాని ఉనికినీ మనం 'అమ్మ'యనే భావించాలి.

ఇక రెండవ కథనం- వామన పురాణాన్ననుసరించి ఈ లోకంలో గల జీవజాలపు శక్తి అంతా సముద్ర మధ్యంలో తేలే గుడ్డుగా మారగా, అందులోనే అంటే- ఆ గుడ్డులోనే బ్రహ్మ సుషుప్తావస్థలో వున్నాడని తేలింది.

ఇక్కడ 'గుడ్డు' అంటే 'అండము' అని అర్థం. ఆ అండంలోనే గాయత్రి మంత్ర శబ్దాక్షరాలైన ఓం, భూః, భువ, స్వహలతో కూడిన బ్రహ్మ వున్నాడు కాబట్టి అది బ్రహ్మాండం అయింది.

మరి, కాకతాళీయమో, ఉద్దేశ పూర్వకమో తెలియదు... ఆ బ్రహ్మాండం పేరు గల వంశమే అమ్మ మెట్టినిల్లు యినది!!

దేవతాశక్తిగా చెప్పబడే పరాశక్తి ఆ అండమును బ్రద్దలు చేయగా గాయత్రి శబ్దాక్షరాలతో సహా దానినుండి ఉద్భవించాడు- బ్రహ్మదేవుడు.

దీనిని బట్టి అర్థమయిందేమిటంటే, ఈ సృష్టికి మూలం విష్ణు, బ్రహ్మల కన్నా ముందుగా ఉద్భవించినది ఆదిపరాశక్తి!

ఎలానంటే- ఆమె బ్రద్దలు చేసిన అండంలోనించే కదా బ్రహ్మతో సహా ప్రణవాది శబ్దాలూ, అక్షము (భూమండలం) మొదలు అంతరిక్షములోని సూర్యచంద్రాది నవగ్రహములు ఉద్భవించినవి!

అదుగో- ఆదిపరాశక్తిగా పిలువబడే ఆ పరాత్పరియే, రాజరాజేశ్వరియే, అనసూయమ్మగా పిలువబడే మన జిల్లెళ్ళమూడి అమ్మ!

అందుకే పైన చెప్పినట్లుగా- "ఈ సృష్టి అనాది. నాది" అని అమ్మ స్వయంగా, విస్పష్టంగా ప్రకటించింది.

అయితే ఆమెతో ఏ మాత్రం పరిచయం లేని నాబోటి సామాన్యవ్యక్తులకు, ఆమె కేవలం జిల్లెళ్ళమూడికి ఆమె దర్శనార్థం వెళ్ళిన వారిని ఆదరించి ఇంత అన్నం పెట్టే "అమ్మ"గా మాత్రమే తెలుసు.

కాని, బ్రహ్మముఖం నుండి వెలువడిన వేదాలకు మాతృక అయిన ఆమె కేవలం వేదమాత అని ఆమెతో ఒక్కసారి పరిచయం కలిగినవారికి తెలిసిన విషయం.

ఆమె తీయని పలుకులన్నీ ఆ వేదామృత సారమే!

ఆ సారమునే మరింత సూక్ష్మీకరించి "అం ఆ" అనే మహామంత్రంగా రూపొందించి మనకు ప్రసాదించిన మాతృమూర్తి మన జిల్లెళ్ళమూడి అనసూయమ్మ!

"అం ఆ" అంటే అంతమూ, ఆదీ లేనిదని అర్థం.

అలా అంతమూ ఆదీ లేనిది ఏది?

ఈ సమస్త విశ్వాన్ని ఆవరించుకుని అణువణువునా నిండివున్న బ్రహ్మస్వరూపమైన బ్రహ్మము!

ఇక్కడ బ్రహ్మ అంటే చతుర్ముఖ బ్రహ్మ అనికాదు, అని మరొకసారి మనం చెప్పుకోవాలి.

ఆయన ఆత్మ! మహాత్మ! పరమాత్మ!

ప్రతీ రాయి రప్ప, చెట్టు పుట్ట, అంబుధి అంబరం, పర్వతం పరమాణువు, వీటిలో పిపీలకాది మానవ పర్యంతం నివసించే సమస్త జీవకోటి బ్రహ్మస్వరూపమే! ఆత్మ అనబడే అపరబ్రహ్మ స్వరూపమే!

బడిలోచేరి "అఆ"లు కూడా నేర్వని ఆమె, "అంతమూ ఆదీ" లేనిదనే వేదసారమును 'అం ఆ' అనబడే రెండక్షర సుమ సముదాయములో ఏర్చి కూర్చి మనకు అందించడం అనేది సామాన్య విషయంకాదు.

అంతేకాదు, అటువంటి అంతమూ, ఆదీ లేని 'అనాది' అయిన ఈ చరాచర జగత్తును సృష్టించడమే కాదు, దానిని 'అనాది, నాది' అని తన బిడ్డగా భావించి, లాలించి, నిండు మాతృత్వాన్ని అందించిన మాతృమూర్తి ఆమె!

అటువంటి మూర్తీభవించిన మాతృమూర్తికి ప్రతీక అయిన శ్రీ రాజరాజేశ్వరీదేవికి ప్రతిరూపమే మన 'జిల్లెళ్ళమూడి అమ్మ'గా పిలువబడే మన తల్లి అనసూయమ్మ!

అందుకే ఆమెను–

"జయహో మాతా! శ్రీ అనసూయా!

రాజరాజేశ్వరి! శ్రీ పరాత్పరి!"

అనే అఖండ నామార్చనతో కొలిచి తరిస్తున్నారు ఆమె భక్తులు. కాదు కాదు ఆమె బిడ్డలు!

అమ్మను శ్రీ రాజరాజేశ్వరిగా తలుచుకుని సేవించే మనం, ముందుగా ఆ రాజరాజేశ్వరి స్వభావ మెటువంటిదో తెలుసుకుందాం.

తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో నివసించిన శ్రీ ఘండికోట అప్పలరాజుశర్మ, సుమతీ మహారాణుల పుణ్యదంపతులకు క్రీ.శ. 1320లో శ్రీ గణేశ చతుర్థి పర్వదినాన జ్యోతి రూపంలో అవతరించారు శ్రీ శ్రీపాదవల్లభులవారు. వారు మరెవరో కాదు. అవధూత చింతనులు, సాక్షాత్తు శ్రీ అనసూయ అత్రి కుమారులైన శ్రీ శ్రీ దత్తాత్రేయుల వారే!

ఇక్కడ అవధూత అంటే 'దిగంబర సన్యాసి' అని అర్థం వుంది. 'దిగంబరుడు' అంటే దిక్కులను వస్త్రములుగా చేసికొన్నవాడు, శివుడు అనికూడా అర్థం.

అప్పటి సమాజంలో ప్రబలిన ఛాందస వాదాన్ని, మూఢనమ్మకాలను, కుల మత పోరాటాలనూ రూపుమాపి, హిందూమతాన్ని ఇతర మతముల బారినుండి రక్షించి, దానికి ఒక దిశా నిర్దేశాన్ని రూపొందించుటకై మానవ రూపంలో "సంభవించిన" త్రిమూర్త్యాంశకులు- శ్రీ శ్రీపాదశ్రీవల్లభులు!

వారు, వారి శిష్యులు, భక్తులు చెప్పగా కన్నడ దేశస్థుడైన సంస్కృత పండితులు, మరియు శ్రీపాదుల వారి పరమభక్తులైన శ్రీ శంకరభట్టుల వారిచే వ్రాయబడిన 'శ్రీ శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం' గ్రంథంలోని 40వ అధ్యాయం (పే.292)లో శ్రీ రాజరాజేశ్వరీదేవిని గురించి, ఆమె ప్రగాఢ భక్తుడైన శ్రీ భాస్కరశాస్త్రి- శ్రీ శంకరభట్టు, ధర్మగుప్తులకు ఈ విధంగా వివరించి యున్నారు.

"నాయనలారా! శ్రీ రాజరాజేశ్వరీ చైతన్యము ఆలోచించే మన మనస్సునకు, ఇచ్ఛకు పైన వున్న విశాలమైన సీమలో ఆసీనురాలై వుండును. ఆమె చేయు శుద్ధి కార్యక్రమము ఏమనగా మనము ఆలోచించే మనస్సు సాధారణముగా మేధాశక్తిగా మారిపోవుచుండును. ఆ మనస్సు ఆ విధముగా కాకుండా వివేకముగా మారుటకు ఆ మహాతల్లి మనకు సహకరించును. మనకున్న ఇచ్ఛ సంకుచిత పరిధులను విడనాడి చక్కటి విస్తృతి కలుగునట్లు ఆమె అనుగ్రహించును. సాధారణముగా శక్తి, వివేకము ఒకచోట కలిసివుండవు. కాని, రాజరాజేశ్వరి అనుగ్రహము కలిగిన యెడల శక్తి, వివేకము మనలో కలసి వుండును. దివ్యచైతన్యముతో అనేక అనంతము లుండును. వాటికి మన మనస్సు తెరచుకొనునట్లు ఆమె చేయును. విశ్వములో విశాల భావములు వృద్ధి పొందుటకు ఆమె మనకు సహకరించును. అత్యద్భుతమైన దివ్య జ్ఞానము కలుగవలెనన్ననూ, శాశ్వతమైన దివ్యమాతృశక్తులు మనలోనూ, విశ్వములోను ఆవిర్భవింపవలెనన్ననూ, స్థిర ప్రశాంతితో మహత్తర కార్యములను సాధింపవలెనన్ననూ, ఆమె అనుగ్రహము అత్యంత ఆవశ్యకము. రాజరాజేశ్వరీదేవి అనంతమైన వివేకమునకు ప్రతీక. ఆమె తెలుసుకొనవలెనని సంకల్పించిన ఆమెకు తెలియనిది ఏమీ వుండదు. సర్వ విషయములను, సర్వ జీవులను వాటి స్వభావములనూ, వాటిని కదలించే శక్తులనూ, ఈ ప్రపంచము యొక్క ధర్మమును, దానికి సంబంధించిన యోగ్యమైన సమయమును ఆమె గ్రహించగలదు. ఆమెకు పక్షపాతబుద్ధి ఎంతమాత్రమునూ లేదు. ఆమెకు ఎవరిపట్ల అభిమానముగాని ద్వేషము గాని వుండదు. సాధనాబలము వలన భవిష్యత్ దర్శనమును సంపాదించుకొన్న వారిని ఆమె విశ్వాస పాత్రులుగా పరిగణించి తన అంతరంగికులుగా స్వీకరించును.

ఈ రాజరాజేశ్వరీ శక్తిని రూపొందించుకున్న సాధకులు తమ వివేక బలంతో విరోధశక్తులను నిర్మూలించుకోగలుగుతారు. ఆమె వారికి ఎటువంటి ఫలితాన్ని ఇవ్వాలో

అటువంటి ఫలితాన్ని ఇస్తుంది. ఆమె విశ్వంలో దేనితోనూ సంబంధం పెట్టుకోకుండా అంటే అసంగత్వాన్ని కలిగి వుంటుంది. ఆమె ప్రతివారితోను, వారి ప్రకృతిని బట్టి, అవసరాన్ని బట్టి, సామర్థ్యాన్ని బట్టి వ్యవహరించ గలుగుతుంది. రాజరాజేశ్వరీదేవి తన యిచ్ఛను ఎవరి మీదనూ బలవంతంగా విధించదు. పరిణామానికి సమ్మతించిన వారిని వారికి తగ్గట్టుగా ముందుకు నడిపిస్తుంది.

అజ్ఞానులను వారి అజ్ఞాన మార్గంలోనే పోనిస్తుంది. అటువంటివారు పెంచి పోషించుకుంటున్న స్వతంత్ర్యాన్ని ఆమె మన్నిస్తుంది. వారు బాగుపడినా చెడిపోయినా ఆమె పట్టించుకోదు. ఆమె కరుణ అంతులేనిది. తరిగిపోనిది. ఆమె దృష్టిలో అందరూ తన బిడ్డలే. అసురులనూ, రాక్షసులనూ, పిశాచాలనూ సహితము ఆమె తన బిడ్డలుగానే పరిగణిస్తుంది. మానవుల దయలాగ ఆమె దయ గుడ్డిదికాదు. ఆమెకు ఎంత దయ వున్నా వివేకమును మాత్రము కోల్పోదు. పరమాత్మ ఆజ్ఞాపించిన మార్గంనుండి ఆమె ఏమాత్రమూ వైదొలగదు. ఆమె ప్రయోగించే శక్తికి జ్ఞానమే కేంద్రము. అందుచేత మనము ఆమె అనుగ్రహాన్ని పొందితే సత్యం బయటకు రప్పింపబడి మనకు జ్ఞానబోధ కలుగుతుంది. ఆమెశక్తిని మనం పొందాలంటే కర్తవ్య దీక్షను, సత్యశోధనను ఎడతెగకుండా అవలంబించాలి. అప్పుడే మనము ఆమెచే అనుగ్రహింపబడతాము."

భక్త పాఠకులారా! తెలిసింది గదా... మన జిల్లెళ్ళమూడి అమ్మ లక్షణాలన్నీ నూటికి నూరుపాళ్ళు ఆ మాటకు వస్తే నూటపదిపాళ్ళు పైన పేర్కొన్న శ్రీ రాజరాజేశ్వరీదేవి లక్షణాలేనని.

మొదటినుండీ అమ్మ వద్ద గడిపిన వారికి, ఆమె సేవలో తరించినవారికీ పైన పేర్కొన్న శ్రీ రాజరాజేశ్వరీదేవి లక్షణాలు అమ్మ లక్షణాలు ఒకటేనని తెలుసు.

అయితే 'అమ్మ' అంటే ఏమిటో తెలియని నాబోటి వారు, నాకు వలెనే ఆమెను అసలు ఇంతవరకూ చూడనివారు, శ్రీ రాజరాజేశ్వరీదేవి లక్షణాలన్నీ అమ్మ పుణికి పుచ్చుకున్నదని గ్రహించి, అటువంటివారు, వివిధ అమ్మ భక్త రచయిత, రచయిత్రులు వ్రాసిన అమ్మ జీవిత చరిత్రనూ, ముఖ్యంగా అమ్మే స్వయంగా భాస్కరన్నయ్యకు చెప్పి వ్రాయించిన "అమ్మ జీవిత మహోదధి" ని చదివి నూటికి నూరుపాళ్ళు అమ్మ శ్రీ రాజరాజేశ్వరీదేవి అవతారమేనని గ్రహించాలి.

ఉదాహరణకు శ్రీ రాజరాజేశ్వరీదేవి– "అసురులనూ, పిశాచాలనూ సహితము తన బిడ్డలుగానే పరిగణిస్తుందని పైన చదువుకున్నాముగదా.

ఒక దీపావళి పర్వదినాన ఆశ్రమంలోని భక్తులు కొందరు మిఠాయిలు పంచుతూ అమ్మకు కూడా ఇవ్వబోతే–

"ఎందుకర్రా ఈ మిఠాయిలు?" అని అమ్మ అడిగిందట.

దానికి వారు "ఈరోజు నరకుడు చనిపోయినందుకు చేసుకుంటున్న పండగ కదమ్మా! అందుకే ఈ స్వీట్లు" అన్నారట.

అందుకు అమ్మ బాధపడుతూ-

"ఏమో! నరకుడు పోయినందుకు మీకు సంతోషంగా వున్నదేమోగాని, నా బిడ్డల్లో ఒక బిడ్డ పోయినందుకు నాకుమాత్రం బాధగా వుంది" అన్నదట.

ఇంకొక సందర్భంలో ఒకానొక అర్థరాత్రి ఆశ్రమం మీదపడి, ఆశ్రమాన్ని ధ్వంసం చేసి భక్తులను హింసించి దొరికిన కాడికి దోచుకుపోయిన నక్సలైట్లను పోలీసువారు పట్టుకుని విచారణ నిమిత్తం ఆశ్రమానికి తీసుకువస్తే-

"విచారణలన్నీ తర్వాత. బిడ్డలు ఎప్పుడనగా అన్నం తిన్నారో ముందు వారికి భోజనం పెట్టండి" అన్నదట.

అంతెందుకు- తన వంటిమీద లేచిన గడ్డను కూడా బిడ్డగానే భావించింది అమ్మ!

మనుషులనే కాదు... కుక్క, కోతి వంటి జంతువులను కూడా అవి వ్యాధిగ్రస్తమయి నపుడు వాటికి స్వయంగా తన చేతులతో శుశ్రూష చేసి వాటికి సేద తీర్చేదట.

చివరికి, తన వంటిమీద వ్రాలిన ఈగలను, తన మీద వ్రాలి కుడుతున్న దోమలను, చేరి కుడుతున్న చీమలను సైతం అమ్మ తన శరీరం మీదనుంచి తొలగించేది కాదట. ఆ శరీరం తనది కాదన్నట్లు నిర్లిప్తంగా వుండిపోయేదట.

ఇంతకీ విషయమేమంటే, పైన శ్రీపాద శ్రీవల్లభుల చరిత్రనుండి పేర్కొన్న శ్రీ రాజరాజేశ్వరీదేవి లక్షణాలన్నీ అమ్మ భక్తులకు, రాజరాజేశ్వరీదేవిని పోలిన అమ్మ లక్షణాలన్నీ నా బోటి నూతన భక్తులకు తెలియటంకోసం ఇదంతా వ్రాయవలసి వచ్చింది.

అటువంటి అనసూయమ్మ, గుంటూరు జిల్లా పొన్నూరు గ్రామానికి దగ్గరలో గల మన్నవగ్రామంలో, ఆ గ్రామకరణం గారైన శ్రీమన్నవ సీతాపతిశర్మ, రంగమ్మయను పుణ్యదంపతులకు, 28.3.1923 సంవత్సరం అనగా చైత్ర శుద్ధ ఏకాదశి తెల్లవారుఝామున బ్రహ్మీ ముహూర్తంలో 4.30 గంటలకు 'అపరబ్రహ్మ'గా ఈ భువిపై నవతరించినది.

అమ్మ పుట్టుకతోనే చాలా బలహీనంగా పుట్టినది. అమ్మ జీవిత చరిత్ర అయిన "జీవిత మహోదధి"లో వర్ణించిన ప్రకారం- (పే.3- జీవిత మహోదధి)

"చేతులు పెనవేసుకుని తెల్లగా, తెలుపులో గోధుమరంగుగా, పొడవయిన ఆకృతిగా కనబడుతూ (+) క్రాస్‌గా ముడుచుకుని కనురెప్పకూడా (సర్వాంగములు) కదలిక లేకుండా,

అరమోడ్పు కన్నులతో (చేపనిద్ర మాదిరిగా), యేడ్పు లేకుండా ప్రాణమున్నదా లేదా అనే అనుమానం తోచే విధంగా పుట్టినది."

భక్త పాఠకులారా! ఆ విధంగా భూమిపై బడిన ఆ పసిగుడ్డును చూచి "ఈ పిల్లకూడా పుడుతూనే కన్ను మూసిందా?" అని అందరూ కలవరపడ్డారట. ఎందుకంటే అంతకు ముందు పుట్టిన ముగ్గురు పిల్లలు అల్పాయుష్కులు. (అమ్మ అన్నగారైన రాఘవరావుగారు తప్ప.)

పాపం! వారికేం తెలుసు? పుట్టిన ఈ పసికందు పరమ పావనియైన జగన్మాత యని. ఈ పాప సర్వుల పాపాలనూ హరించే పాపసంహారిణి యని! బురద పూసుకుని వచ్చే బిడ్డలను (భక్తులను) సైతం కడిగి శుభ్రం చేసే మాతృదేవత యని!

అలా ఆనాడు మన్నవ గ్రామంలో మన్నవ వారి వంశాన ఉదయించిన జగన్మాత, జిల్లెళ్ళమూడిలో బ్రహ్మాండం వారి వంశోత్తముడైన శ్రీ నాగేశ్వరుని చేతినందుకుని మెట్టినింట పాదం మోపింది.

మరి, ఆ పాదం మామూలు పాదమా!

బ్రహ్మ కడిగిన పాదం!

ఆ పాదం ఆపాదమస్తకం అమ్మతనాన్ని నింపుకొని, తనకన్నా పెద్దవారిని కూడా కన్నతల్లిలా "ఏం నాన్నా!" అని లాలిస్తూ, ఆకలిగానున్న వారి నోట తన చిరుచేతి అంగుష్టము(బొటనవ్రేలు)తో కమ్మనైన గోరుముద్దలను తినిపించే పరాత్పరి, రాజరాజేశ్వరీదేవియొక్క మృదుపాదకమల ద్వయం!

ముఖ్యంగా మనమిక్కడ పేర్కొనవలసినది...

కమ్మనయిన అమ్మదనం గురించి, అమ్మదయిన కమ్మదనం గురించి. ఎందుకంటే, అమ్మదనానికి, కమ్మదనానికీ చాలా దగ్గర పోలికలున్నాయి కాబట్టి.

ప్రకృతి పరంగా ఆకసంలోని ఇంద్రధనస్సు యొక్క ఆరురంగులూ తెల్లని సూర్యకాంతిలో ఇమిడిపోయినట్లే-

షడ్రుచులలోని తీపి, కారము, పులుపు, చేదు, వగరు, ఉప్పనల రుచులన్నీ కమ్మదనంలో ఇమిడి వున్నవి.

పై రుచులలో దేనికీ చెందని రుచిని చప్పన అంటారు. ఆ చప్పదనానికే పైన పేర్కొన్న ఆరు రుచులనూ తగు పాళ్ళతో చేర్చి తింటే కమ్మగా వుంటుంది- పాల మీగడలా! ఎర్రగా కాచిన పాలతో తోడుపెట్టిన గడ్డపెరుగులా! ఉడికించిన లేదా వేయించిన వేరుశనగ గింజలా! చలికాలంలో వచ్చే కాల్చిన తాటి తేగలా!

ఇలా చెప్పుకొంటూ పోతే చాలా కమ్మదనాలున్నాయి.

అందుకే ఆరు రుచులనూ షట్చక్రాలతో పోలిస్తే, కమ్మదనాన్ని సహస్రారంతో పోల్చవచ్చు!

కళ్ళు మూసుకుని, లోచూపును సహస్రారంలో నిలిపితే వచ్చే హాయి అంతా ఇంతా కాదు.

అటువంటి హాయినిచ్చే కమ్మదనంతో పోల్చదగినదే అమ్మదనం!

మన జిల్లెళ్ళమూడి అమ్మదనం!

అసలు 'అమ్మ' అనే మాటలోనే వున్నది కమ్మదనమంతా!

అందుకే పుట్టిపెరుగుతున్న కొద్దీ ఊసుల వయసు దాటిన బిడ్డ మాట్లాడే మొట్టమొదటి మాట 'అమ్మ'.

ఇక చదువు విషయానికి వస్తే-

ఆ స్వర్ణయుగపు రోజులలో బిడ్డకు అయిదేళ్ళు నిండిన తరువాతనే అక్షరాభ్యాసం జరిగేది. ఎందుకంటే, ఆ వయసులోనే మెదడు పరిపక్వత చెంది, క్రొత్త విషయాలను తనలో నిక్షిప్తం చేసుకుంటుంది కాబట్టి.

బిడ్డ తన అక్షరాభ్యాసం నాడు తనకు మానవజన్మ నిచ్చిన ఈశ్వరుని "ఓం నమః శివాయః" అని ఓనమాలతో, భక్తితో, కృతజ్ఞతాపూర్వకంగా స్తుతించిన తరువాత-

అక్షఱమాలలో అగ్రగామిగా నిలచి, అమ్మ అనే మాటలోని 'అ' అక్షరంతోనే విద్యాభ్యాసానికి శ్రీకారం చుట్టటం జరిగేది.

అలా చుట్టించేది తన ఒళ్ళో కూచోబెట్టుకుని గురువు తరువాత గురువంతటివాడైన కన్నతండ్రి! ఆయననే అచ్చ తెలుగులో 'అయ్య' అంటారు.

ఇక్కడా 'అ' అనేదే మొదటి అక్షరం!

అయితే బిడ్డకు ఆదిగురువు మాత్రం- అమ్మే!

ఊసుల వయసు దాటిన బిడ్డను తన అడ్డాలలో పడుకోబెట్టుకుని-

"అమ్మ" అనమ్మా! 'నాన్న' అనమ్మా! 'అత్త' అనమ్మా! అనే మాటలతో బాటు-

వెన్నెల రాత్రులలో ఆరుబయట బిడ్డను చంకన వేసుకుని గోరుముద్దలు తినిపిస్తూ-

"చందమామ రావే! జాబిల్లి రావే!" అనే పాటలను కూడా నేర్పిస్తుంది కన్నతల్లి!

మరి అవన్నీ ఆటు గురువుగానీ, ఇటు కన్నతండ్రి గానీ చెయ్యలేరుగా!

అలా తల్లి చంకన వుండేకదా ఆకసంలో వెలుగొందే చందమామ కావాలని పేచీ పెట్టింది– బాలరాముడు! అప్పటినుంచే కాబోలు ఆయనకు రామచంద్రుడని పేరు వచ్చింది!

అంతటి అవతార పురుషునికి కూడా తల్లే మొదటి గురువు అయింది మరి!

అందుకనే 'గురుఃబ్రహ్మ, గురుర్విష్ణుః, గురుఃదేవో మహేశ్వరః'కు బదులు–

"మాతఃబ్రహ్మ, మాతఃవిష్ణుః, మాతృదేవో మహేశ్వరః" అని ఆదిగురువైన మాతను సాక్షాత్తు త్రిమూర్తులతో పోల్చుకుంటే సరిపోతుందేమో!

అయితే ఇప్పుడా తల్లులేరీ? ఆ తండ్రులేరీ? అసలు రమణీయమైన ఆ కుటుంబ వ్యవస్థ ఏదీ?

ఆ చదువులు లేవు. ఆ కుటుంబ వ్యవస్థా లేదు. అంతా ఎవరికి వారే యమునా తీరే...

వయసులోనున్న భార్యాభర్తలు ఇరువురూ ధన సంపాదన యావలో పడి తమ వయసునీ, వారి రసాత్మక జీవితాన్నీ ఫణంగా పెట్టి కార్పొరేట్ ఆఫీసులలో, కాల్ సెంటర్లలో రాత్రింబవళ్ళు పడి కొట్టుకుంటూ వుంటే, వారి పిల్లల ఆలనా పాలనా క్రెస్టులు, కెండర్‌గార్డెన్‌లు చూసుకుంటున్నాయి.

ఆ స్థాయి దాటిన పిల్లలు తమ ఆటపాటలనూ, ముద్దుమురిపాలనూ పణంగా పెట్టి, బండెడు పుస్తకాల సంచులను వీపున వేసుకుని కార్పొరేట్ చదువుల్లో పడి, మనదేశీయ విద్యను, సంస్కృతినీ మరచిపోయి విదేశీ విద్యకు, ఆ తరువాత విదేశీ ఉద్యోగాలకు ఎగబడి ఉన్న ఊరినీ, కన్న తల్లిదండ్రులనూ వదలి విదేశాలకు ఎగిరిపోతే–

ఇంట్లో చూసేవారూ, చేసేవారూ లేక వృద్ధులైన తల్లిదండ్రులు వృద్ధాశ్రమాల బారినపడి బిక్కుబిక్కుమంటూ దిక్కులు చూస్తున్నారు.

పోనీ స్వదేశంలో వున్న పిల్లల దగ్గర చేరిన తల్లిదండ్రులు సుఖంగా వున్నారా? అంటే అదీ లేదు. కొడుకూ, కోడలూ, కూతురూ అల్లుడూ ఉద్యోగాలకు, వారి పిల్లలు స్కూళ్ళకు పోతే వారి తలిదండ్రుల పరిస్థితీ అదే.

ఆ బాధను భరించలేక అటువంటి వృద్ధులు వృద్ధాశ్రమాలను ఆశ్రయిస్తున్నారు.

కొండొకచో పిల్లలే వారి తల్లిదండ్రులను చూడక, చూడలేక వృద్ధాశ్రమాలకు తరలిస్తున్నారు. వట్టిపోయిన ఆవులను కబేళాకు తరలించినట్లు!

దీనికంతటికీ కారణం–

ఉపాధి అవకాశాలకై ఏర్పడిన పరిశ్రమలు, వాటితోపాటు ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం.

అది అక్కడితో ఆగిపోలేదు. మనసమాజంలోనే పెను విప్లవాన్ని తీసుకువచ్చింది.

ఉపాధికోసం, లేదా విదేశ వ్యామోహంతో యువత దూరప్రదేశాలకూ, దూర దేశాలకూ పోయి అక్కడి నాగరికతనూ, సంస్కృతినీ తీసుకువచ్చి మనదేశంలో ప్రవేశపెడితే, మన దేశీయ సంస్కృతీ సాంప్రదాయాలూ నామ మాత్రంగానే మిగిలి తమ రూపాలను మార్చుకుంటున్నాయి.

ఒక క్రొత్త వ్యవస్థ, క్రొత్త ఉపాధి అవకాశాలూ రావడం మంచిదే. అయితే, అవి సనాతన వ్యవస్థనూ, సంస్కృతినీ రూపుమాపకూడదు.

అసలు మన సంస్కృతియే కాదు, మన భాష కూడా మారిపోయింది.

ముఖ్యంగా మన తెనుగునాట తెలుగు భాష మాట్లాడటం మరీ నామోషీ అయిపోయింది.

అసలు మన తెలుగు భాషకే గాదు అన్ని భాషలకు మూలం- వేదభాష అయిన సంస్కృతం.

ఇది నేను చెబుతున్నది కాదు. కొంతకాలం క్రిందట ఉత్తర హిందూస్థానం నుంచి వచ్చిన ఒక పండితుడు గుంటూరు సీమకు వచ్చిన సందర్భంలో, మన తెనుగు భాషను విని-

"మీ తెలుగు భాషలో సంస్కృత పదాలు చాలా దొర్లుతున్నాయి. మీ భాషకు మూలం సంస్కృతం అయి వుంటుందని నా అభిప్రాయం" అని ప్రసంగవశాన నాతో అన్నాడు.

అందుకే కాబోలు- 'అమ్మ' మన భాషకు పునాది అయిన సంస్కృత భాష అంటే అభిమానం పెంచుకుని దానిని పునరుద్ధరించడానికి కంకణం కట్టుకున్నది. దానికి ప్రాతిపదికగా ఒక సంస్కృత పాఠశాలనూ, కళాశాలనూ ఈ మారుమూల నున్న జిల్లెళ్ళమూడిలో ప్రారంభించింది.

అవి ఇప్పుడు ఇంతింతై వటుడింతై అన్నట్టుగా ఎదిగి, రాష్ట్రం నలుమూలల నుంచీ వచ్చిన విద్యార్థులకు ఉచిత భోజన వసతి సౌకర్యాలతో, నామమాత్రపు రుసుమును వసూలు చేస్తూ సంస్కృతాంధ్ర భాషలను బోధిస్తూ, రాష్ట్రంలోని సంస్కృత పాఠశాల, కళాశాలలకు తలమానికంగా వున్నవి. ఈ మధ్యనే ఆంగ్లభాషను కూడా బోధిస్తున్నారు.

ఇందులో చదువుకున్న విద్యార్థినీ, విద్యార్థులు నేడు రాష్ట్రంలో గల వివిధ పాఠశాలలు, కళాశాలలలో సంస్కృత, తెలుగు పండితులుగా ఉద్యోగాలు చేస్తూ రాణిస్తున్నారు.

అంతేకాదు- అమ్మ కలలు గన్న వేద పాఠశాల కూడా కొంతకాలం క్రిందట ప్రారంభింపబడి నేడు ప్రగతి మార్గాన నడుస్తున్నది.

ఇదంతా అమ్మ సంకల్పబలం! ఆమె ఆశీర్వాద ఫలం!

ఇంకొక విషయం-

ఈ మధ్య 'వసుధైక కుటుంబం' అనేపేరు ఈ ప్రపంచంలో తరచుగా వినిపిస్తోంది.

అంటే- ఈ 'వసుధ' అంతా ఒక కుటుంబంలా వుండాలని ప్రపంచ నాయకుల భావన.

ఆ భావన మంచిదే కాని, అమలులో దాని బాధ్యతను ఎవరు తీసుకుంటున్నారు? ఎంతమంది ముందుకు వస్తున్నారు? అని ప్రశ్నించుకుంటే జవాబు శూన్యం!

వాస్తవానికి ప్రపంచంలో గల వివిధ దేశాలు ఆ భావనకు విరుద్ధంగానే ప్రవర్తిస్తున్నాయి.

అవి ఒకదానితో నొకటి సిద్ధాంతాల పేరుతో విభేదిస్తూ ఒకదానిపై నొకటి ఆధిపత్యాన్ని పెంపొందించుకునే దిశలో మారణాయుధాలను తయారుచేసుకుని పరస్పరం కయ్యానికి కాలు దువ్వుకుంటున్నాయి.

పోతే, ప్రచారసాధనాలు, రవాణాసౌకర్యాలు మెరుగుపడటంతో ప్రపంచంలో ఒక ప్రదేశం నుండి సమాచారం ఇంకొక ప్రదేశానికి క్షణాలలో దృశ్య, శ్రవణ మాధ్యమాల ద్వారా ప్రసారమవడం, ఇదివరలో రోజుల తరబడి పట్టే ప్రయాణకాలం ఇప్పుడు కొద్ది గంటలలోనే సాగిపోవటం తప్పితే... ప్రపంచ ప్రజలలో పరస్పర భావప్రకటన, ఇచ్చి పుచ్చుకునే ధోరణి అడుగంటి పోయినవి. ఆ రెండూ వుంటేనే "వసుధైక కుటుంబం" అనే మాటకు అర్థం కదా! అసలు ఉమ్మడి కుటుంబాలే లేనపుడు వసుధైక కుటుంబం ఎక్కడ?

అయితే 'జిల్లెళ్ళమూడి అమ్మ' మాత్రం ఈ పరిస్థితిని రూపుమాపే ప్రయత్నంతో ఈ మారుమూల పల్లెలో వసుధైక కుటుంబానికి చక్కని అర్థం చెప్పే విధంగా "అందరిల్లు" అనే గృహసముదాయాన్ని ప్రారంభించింది.

అందులో చేరడానికి కుల మతాలు, పేద ధనిక వర్గాలు అనే అడ్డుగోడలు లేకుండా ఈ వసుధలోని బిడ్డలందరూ తన బిడ్డలేనన్న "అమ్మతనం"తో ముందుకు వచ్చి, అంతస్థులకు అతీతంగా వారినందరినీ ఒకేచోట చేర్చి, వారికీ వారి పిల్లలకూ విద్య, వైద్యంతో బాటుగా 'అన్నపూర్ణాలయం' పేరిట ఒక సామూహిక నిరతాన్నదాన శాలను ప్రారంభించి, అందులో వారికేగాక, బయటినుంచి వచ్చే భక్తులకు సైతం ఆకలే అర్హతగా ఎల్లవేళలా ఉచిత భోజన వసతి సౌకర్యాలను కూడా కల్పించింది.

ఆ 'అందరిల్లు' తమ అందరిదీ అనే భావనతో అందులో చేరిన వారుకూడా తరతమ బేధాలను మరచి ఎవరి శక్త్యానుసారం వారు ఆ యింటి నిర్వహణా బాధ్యతలను చేపట్టి సమర్ధవంతంగా దానిని కొనసాగిస్తున్నారు.

ఆమె ప్రారంభించిన నాటినుంచీ నేటివరకూ ఎందరో దేశ, విదేశీయులు ఈ 'అందరిల్లు'ను చూసి ముగ్ధులై అంతటి మహాసంకల్పానికి పునాది వేసిన "అమ్మ"కు జోహారులర్పిస్తూ, ఆమె భక్తులై తరించి ఈ వసుధైక కుటుంబాన్ని ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దుతూ. అహరహరం దాని అభివృద్ధికి దోహదపడుతూ తరిస్తున్నారు.

ఇంతటి అద్భుత ప్రయోగం మన రాష్ట్ర రాజధానిలోనో, లేదా రాష్ట్రంలో గల ఏ మహానగరంలోనో కాక-

రవాణా సౌకర్యం కూడా సరిగ్గా లేక కేవలం ఆటోలు, రిక్షాలు, బైకులు అవీ అందుబాటులో లేకుంటే కాలినడకయే రవాణా సాధనంగా గల ఈ మారుమూలన బిక్కుబిక్కుమంటూ దిక్కులు చూస్తూన్నట్టుగా వుండే ఈ కుగ్రామం జిల్లెళ్ళమూడిలో జరుగుతున్నదంటే విన్నవారూ, కన్నవారూ ముక్కున వేలు వేసుకోవలసినదే!

ఈ మారుమూలన గల ఈ చిన్న ప్రపంచంలో పైన చెప్పినట్లు ఒక్క ప్రభుత్వ రవాణా సౌకర్యమైన బస్సు తప్ప, ఒక సామాన్య గృహస్థులకు కావలసిన సకల సౌకర్యాలూ, అవసరాలూ అన్నీ వున్నాయి.

డిగ్రీ వరకూ విద్య, ఒక అల్లోపతి, ఒక ప్రభుత్వ హోమియో పతి హాస్పిటల్, అత్యవసర వైద్య రవాణా సౌకర్యమైన అంబులెన్స్, మినరల్ వాటర్ ప్లాంటు, సౌరశక్తితో నడిచే విద్యుత్ దీపాలు, శుభకార్యాల నిర్వహణకు ఒక టి.టి.డి. కళ్యాణమండపం, అపర కర్మల నిర్వహణకు ఒక సుగతిపధం బిల్డింగ్, యజ్ఞ యాగాల క్రతువుల కొరకు ఒక యాగశాల, ఇవన్నీ గాక అమ్మ, నాన్నగారు, హైమల సమాధి ఆలయ మందిరాలతో బాటుగా నవనాగేశ్వర, వినాయక ఆలయాలు, అన్నిటికీ మించి రాత్రింబవళ్ళు అన్నార్తులకు భోజనంపెట్టే అన్నపూర్ణాలయం...

ఇదంతా, వీటన్నింటినీ సాధించినది ఎవరో విజ్ఞాన శాస్త్రజ్ఞులు, లేదా అత్యధిక ధనసంపదను, అది తెచ్చిపెట్టిన మందీమార్బలం కలిగియున్న ఐశ్వర్యవంతులు కాదు.

ఇవన్నీ ఒక సామాన్య గృహిణి, ఒక సామాన్య గ్రామకరణంగారి ఇల్లాలు- అనసూయమ్మ అనబడే నిరక్షరాస్య అయిన ఒక మాతృమూర్తి యొక్క "గుప్పెడు మనసు" లోంచి మొలకెత్తిన 'ఇంటింటా గుప్పెడు బియ్యం' పథకం ద్వారానే ఏర్పడినవి.

భౌతికంగా చూస్తే ఎవరి గుండె పరిమాణమైనా వారి వారి అరచేతి గుప్పెడంత వుంటుంది. కాని, దాని ఆలోచనా పరిధి మాత్రం అనంత దూరాలకు, అందనంత ఎత్తులకు

సాగిపోతుంది. చిన్న గోలీకాయంత మర్రికాయలోని చిటికెడంత విత్తనం మొలకెత్తి మహా వటవృక్షమైన చందాన!

ఇంతకూ అమ్మ సంకల్పించిన "గుప్పెడు బియ్యం" పథకం ఏమిటో తెలుసా? గ్రామంలోని స్త్రీలు ప్రతిరోజూ వారి ఇళ్ళల్లో వంటచేసే ముందు ఒక గుప్పెడు బియ్యాన్ని వేరే తీసి వాటిని ఒకచోట నిల్వచేయటం. అలా పోగైన బియ్యాన్ని అమ్మ సంరక్షణలో వుంచి పనీ, సంపాదన లేని కరువు సమయాల్లో తమ తమ అవసరాలకు తగినన్ని బియ్యాన్ని తీసికొని కడుపు నింపుకొనడం.

అంటే, ఇది ఒక 'సహకార ఆహార నిధి' లాంటిది అన్నమాట. అంతేకాదు, పై పథకం కేవలం కరువు రోజుల్లో పేదల కడుపు నింపడమే కాకుండా 'అందరింటి' ఆదరణలోని ఆలయాల నిర్మాణమునకు కూడా సాయపడినది. అదీ అమ్మచే సృష్టింప బడిన ఈ మర్రి విత్తనం!

మర్రి విత్తనంలోంచి మహీరుహం (మహావృక్షం) ఉద్భవించటం, చిన్న చిన్న నీటిబిందువుల సముదాయమే మహాజలధిగా రూపొందడం మాధవ సృష్టి!

చిన్న చిన్న ఇసుకరేణువులను చేర్చి ఒక మహాసౌధాన్ని నిర్మించటం వంటి నిర్మాణ కార్యక్రమం మానవ సృష్టి!

అయితే ఆ మానవుని మస్తిష్కంలోంచి వచ్చే ఒక చిన్న ఆలోచన ఈ సమస్త లోకాన్ని సుఖదుఃఖాలతో నింపడం అనేది భగవత్సంకల్పం!

కాని, "భగవత్సంకల్పం కాదు, సంకల్పమే భగవంతుడు" అని అమ్మ అన్నదే... అదెలా?

అవును. అమ్మ చెప్పింది నిజమే.

ఆ సంకల్పం అనేది రెండు రూపాలలో మానవుని మస్థిష్కమునందు జనిస్తుంది.

ఒకటి సత్సంకల్పం అయితే, రెండవది దుస్సంకల్పం.

సత్సంకల్పం మానవాళి మనుగడకు, లోక కళ్యాణానికీ దారితీస్తే, దుస్సంకల్పం మానవ క్షయానికీ, లోక వినాశనానికీ దారి తీస్తుంది.

నిజానికి ఆ రెండూ భగవంతుని రెండు పార్శ్వాలు!

భగవంతుడు ఒక నాణెమయితే అవి బొమ్మా, బొరుసూ!

ఎందుకంటే సృష్టి ఎంత ముఖ్యమో లయమూ అంతే. ఆ రెండింటి నడుమ నిలిచేదే స్థితి.

అయితే మానవుని దృష్టిలో సృష్టి, స్థితులు మంచి కార్యములుగాను లయము (నాశనము) చెడు కార్యముగానూ భావించబడితే, భగవంతుని దృష్టిలో మొత్తము మూడూ ఆయన యొక్క విద్యుక్త ధర్మముగా భావింపబడతాయి.

ఎందుకంటే, ఈ 'విశ్వ పరిపాలన' ను సమతూకంలో ఉంచాలంటే ఈ మూడింటినీ ఆయన తన విద్యుక్త ధర్మం క్రిందనే భావించాలి. వాటిని సమదృష్టితోనే చూడాలి.

ఎలానంటే, ఒక పాత్రలో క్రొత్త నీటిని నింపాలంటే పాతనీటిని పారబొయ్యాలి. దానిని (పాత్రను) శుభ్రపరచి తిరిగి క్రొత్తనీటితో నింపాలి.

అంతేగాని, "అయ్యో! పాతనీటిని పారబోస్తే పాపం కదా!" అని భావిస్తే, ఉపయోగించడానికి వీలులేని, కుళ్ళిపోయిన పాతనీరు అలానే వుండిపోతే అనారోగ్యమే కాక కొత్తనీటిని ఉపయోగించడానికి చోటుండదు.

అందుకనే ఈ విశ్వంలో పాతని, కుళ్ళుని పారద్రోలి క్రొత్తదనంతో సృష్టిని నవనవోన్మేషణంగా ఉంచేందుకు ప్రయత్నిస్తాడు భగవంతుడు.

క్రొత్తని సృష్టించడం బ్రహ్మపని అయితే, దానిని ఉపయోగించడం విష్ణువు పని కాగా, ఉపయోగంలో అరిగి, శిథిలమైన వస్తువును తొలగించడం శివుని పని.

అలా తొలగించిన శిథిల వస్తువు స్థానాన్ని తిరిగి క్రొత్త వస్తువుతో భర్తీచేయడం బ్రహ్మపని.

అంటే- ఈ సృష్టికార్యమంతా ఒక చక్రభ్రమణం అన్నమాట!

ఆ చక్రాన్ని అలా త్రిప్పి నడిపించేది ఆ త్రిమూర్తులే.

నిజానికి ఆ ముగ్గురూ ఒకటే. చేసేపనిని బట్టి మానవులలో రైతు, కమ్మరి, కుమ్మరి, వడ్రంగి అనే వృత్తిపరమైన పేర్లు ఏర్పడినట్లే-

ఆయా కార్యాలను నిర్వహించే సమయంలో భగవంతుడు ఆయా నామాలతో పిలువబడుతాడు.

ఆయనకు ఆ పనిలో సాయపడేది ఆ భగవతి!

మళ్ళా వారిద్దరు ఏక శరీరులే!

అలా భావించేందుకు వీలుగానే ఆ ముగ్గురి అంశతో దత్తాత్రేయుని సృష్టి జరిగింది.

శ్రీదత్తాత్రేయునకు ఇంకొక పేరు అనఘుడు. ఆయనకు కార్యనిర్వహణలో సాయపడేదే త్రిమాతల (సరస్వతి, లక్ష్మి, గౌరి) అంశ అయిన అనఘాదేవి!

ఆమెను గురించి శ్రీపాద శ్రీ వల్లభచరితామృతం అనే గ్రంథంలో ఈ విధంగా వర్ణించియున్నారు. (పే. 308- శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం)

"శ్రీ అనఘాదేవి యొక్క రూపము లక్ష్మీదేవి. ఆమెలో రాజరాజేశ్వరీ లక్షణాలు, మహాలక్ష్మి, మహాకాళీ, మహా సరస్వతీ లక్షణాలు నిండుగా వున్నవి. శ్రీ అనఘుని యొక్క రూపము విష్ణువు. ఆయనలో పరమేశ్వరుని లక్షణాలు, త్రిమూర్తుల లక్షణాలు నిండుగా వున్నవి. కావున శ్రీ అనఘాదేవీ సమేత అనఘుని ఆరాధించటం సర్వ శ్రేయోదాయకము. అనఘాష్టమీ వ్రతము దత్తభక్తులు విధిగా ఆచరించవలసిన వ్రతము. ఈ వ్రతమును ఆచరించుట వలన సర్వ శుభములు పొంద వీలగును."

భక్త పాఠకులారా! తెలిసినది కదా...

త్రిమూర్తుల అంశ అయిన శ్రీదత్తాత్రేయులు, ఈ విశ్వము యొక్క సృష్టి, స్థితి, లయములకు మూలకారకులైతే ఆయనకు ఆయా కార్యములలో సహకరించేది త్రిమాతల అంశ అయిన అనఘాదేవి!

మరి అటువంటి దత్తాత్రేయులనే తన బిడ్డగా చేసుకొనిన దెవరు?

అనసూయాదేవి!

అదుగో... ఆ అనసూయాదేవి యొక్క తత్త్వమే మన జిల్లెళ్ళమూడి అనసూయమ్మది. ఆమెకు గల మహిమలే మన అనసూయమాత కూడా కలిగి వున్నది. 'అనసూయ' అని అమ్మకు నామకరణం చేయటం కూడా విచిత్రంగా జరిగినది. ఆ వైనమును ఈ క్రింద చదవండి. (పే.9. జీవిత మహోదధి.)

"అన్ని దానములతో గం.11-50 లకు నవగ్రహజపాలతో శాంతి పూర్తియై నామకరణం నక్షత్రాన్ని బట్టి అశ్లేష గనుక, అమ్మ కరువు గనుక (అంటే- చాలామంది బిడ్డలు పోగా మిగిలింది కనుక) ఆ పేరు బెడితే ఆ కరువు తీరుతుందని అందరూ ఆలోచించి 'అనసూయ' అను నామము తాతగారు, బియ్యమునకు బదులు అనుకోకుండ కుంకుమ పళ్ళెములో వ్రాయుదురు. అందరూ ఒకేసారి అమ్మపేరు అనుకోకుండా "మన అమ్మపేరు అనసూయ" అని పెద్దగా అంటారు. అనటం, తాతగారు వ్రాయటం ఒకేసారి జరుగుతుంది. అమ్మపేరు యెల్లప్పుడూ ఇలాగే ప్రతిధ్వనిస్తే బాగుండునని తాత, అమ్మమ్మ గార్లు ఎవరికి వారు అనుకుంటారు."

భక్త పాఠకులారా! ఆనాటి వారి కోరిక ఈనాడు "జయహో మాతా! శ్రీ అనసూయా!" అని ప్రతిక్షణము నామం పేరిట ప్రతిధ్వనిస్తోంది.

అంతేకాదు, అసూయ లేనిదని అర్థము గల అలనాటి అనసూయ మాత చాల మహిమ గలది. ఆమె మహిమలను గురించిన ఉదంతము పూర్వగాథాలహరి (పే. 15)లో ఈ విధముగా నున్నది.

“అనసూయ : బ్రహ్మ సంతతి. దేవహూతి, కర్ధములకు ఇద్దరు కుమార్తెలు. ఒకరు కళ, రెండు అనసూయ. కళ మరీచిని, అనసూయ అత్రిని వివాహమాడారు.

అనసూయ తపశ్శక్తి: ఒకప్పుడు పది సంవత్సరాలు అనావృష్టి తాండవించెను. గంగానది కూడా ఎండిపోయెను. ఆకలి చావులు ప్రపంచవ్యాప్తమయ్యెను. ఆమె (అనసూయ) తపశ్శక్తితో చెట్లుకాయలు కాచెను. గంగ తిరిగి ప్రవహించెను. అంతేకాక, దేవతల కోరిక మేరకు పదిరోజులు పగటి సమయాన్ని కూడా ఆమె రాత్రులుగా మార్చెను.

ఒకరోజు త్రిమూర్తులు గగన సంచారులై, అత్రి ఆశ్రమము పైనుండి పోవుచుండిరి. గరుడుడు ఆ మార్గమున పోజాలకుండెను. అత్రి మహర్షి భార్య మహా పతివ్రత అగుటచే ఆగిపోయెనని వేరు మార్గమున పోయిరి. తిరిగి వచ్చునప్పుడు ఆమెను పరీక్షింపనెంచి విప్రవేషములు ధరించి ఆశ్రమమునకు బోయిరి. అత్రి మహర్షి వారిని భోజనమునకు ఆహ్వానించగా, మాకొక నిష్ఠ గలదని, నగ్నస్త్రీ వడ్డించినపుడే భుజించెదమని వారు చెప్పిరి. అత్రి అనసూయ వంక చూచెను. అనసూయ ఏమాత్రము సందేహించక, భోజనమునకు కూర్చోమని వారిపై మంత్రజలమును జల్లగా వారు శిశువులుగా మారిపోయిరి. అప్పుడామె వివస్త్రయై వడ్డించి, తిరిగి వస్త్రములను ధరించి వచ్చి, మరల మంత్రజలము జల్లెను. తిరిగి వారు సాధారణ బ్రాహ్మణులైరి. వారు భుజించిన తదుపరి మరల వారిని మంత్రజలముతో శిశువులుగా మార్చి తనవద్ద వుంచుకొనెను. పార్వతి, లక్ష్మి, సరస్వతులు వారిని వెతుక్కుంటూ రాగా, వారికి వారి భర్తల నిచ్చెను. అప్పుడు త్రిమూర్తులు ఆమెకు వరము ప్రసాదించగా ఆమె వారిని తన బిడ్డలుగా జన్మించమని కోరుకొనెను.

భక్త పాఠకులారా! పైన పేర్కొన్న త్రిమూర్తుల అంశయే శ్రీదత్తాత్రేయులు. మన అమ్మ అనసూయమ్మ కేవలం రాజరాజేశ్వరి వలె దయామయి మాత్రమే కాదు, అనసూయ మాతవలె శక్తిమయి కూడా.

అటువంటి శక్తికార్యములను అమ్మ ఏవిధంగా చేసినదో ముందు ముందు తెలుసుకుందాం.

ఇకపోతే, అమ్మ నామంలోని పరాత్పరిని గురించి.

పరాత్పరుడు లేక పరాత్పరి అంటే... శ్రేష్ఠుని కన్నా శ్రేష్ఠమయిన భగవంతుడు. అంటే, త్రిమూర్తి స్వరూపుడు. ఆయన యొక్క శక్తి స్వరూపమే భగవతి అయిన పరాత్పరి! దేవతలకే దేవత అయిన ఆది పరాశక్తి!

ఇప్పటివరకూ మనం అమ్మ నామములైన–

“జయహో మాతా! శ్రీ అనసూయా!

రాజరాజేశ్వరి! శ్రీ పరాత్పరి!"లకు పురాణపరములైన అర్థాలను చెప్పుకొన్నాం గదా!

మరి, ఆ అర్థాలకు అనుగుణంగా ఈ లౌకిక ప్రపంచంలో పైనుదహరించిన "అందరిల్లు" యొక్క సృష్టి, ఆ ఇంటిలో సకల మానవుల లౌకిక జీవనానికి సరిపడే సదుపాయములను ఏర్పరచిన సంకల్పం ఎవరిది?

సంకల్పమే భగవంతుడన్న అమ్మ వాక్యం ప్రకారం ఆ రూపం ధరించి మనమధ్యకు దిగివచ్చిన అండ పిండ బ్రహ్మాండములకు ఊపిరి నిచ్చిన బ్రహ్మాండం అనసూయాదేవిది! 'మన్నవ' వంశపు మణిదీపానిది!

ఆమె యిచ్చిన ఆ వూపిరితోనే ఆమెనుండి వచ్చిన ఆ మణిదీపపు వెలుగులలోనే నేడు మనమంతా హాయిగా, సుఖంగా జీవిస్తున్నాం.

అయితే ఆ వెలుగు ఒక్క జిల్లెళ్ళమూడిలోని అందరింటికే కాదు, అది సర్వ వ్యాపకం.

ఈ భూమ్మీద మనం ఎక్కడ వున్నా అమ్మని తలుచుకుంటూ ఆమె అడుగుజాడల్లో నడిస్తే చాలు–

విశ్వమంతటా వ్యాపించి అదృశ్యరూపంలో నున్న విద్యుత్తు... ఈ లోకంలోని తిమిరాంధకారాన్ని పారద్రోలేందుకు ఒక బల్బులో ప్రవేశించి ఆయా ప్రాంతాలలో వెలుగుల్ని విరజిమ్మినట్టుగా–

ఆ పరబ్రహ్మ 'బ్రహ్మాండం అనసూయమ్మ' అనే బల్బులో ప్రవేశించి మనముందు నిలచి, మనలోని క్షుధార్తిని, వ్యధార్తిని తొలగించి, మన చేయిపట్టి, మనలను పరమ పదసోపానాలపై నడిపిస్తున్నాడు.

అందుకనే, "అమ్మా!" అని మనం ఆర్తిగా పిలిస్తే చాలు "ఏం నాన్నా!" అంటూ అమ్మ 'అపర బ్రహ్మ' యై మనముందుకు వచ్చి, మన చేతినందుకుని, మనలను వెలుగు తీరాలకు నడిపిస్తుంది.

భక్త పాఠకులారా! ప్రారంభంలో మనం బ్రహ్మపుట్టుకను గురించి తెలుసుకున్నాం. ఇప్పుడు ఆ బ్రహ్మకు గల రూపాలను గురించి తెలుసుకుందాం.

"బ్రహ్మ రెండు రూపాలు. పరబ్రహ్మ. అపరబ్రహ్మ. పరబ్రహ్మ స్వరూపం లేనిది. అపర బ్రహ్మ మూర్తిమంతం. ఆ మూర్త బ్రహ్మను పరబ్రహ్మం, పరమాత్మను గురుబ్రహ్మ అంటారు. కన్పించిన విషయాలను అపరబ్రహ్మం అంటారు." (పే. 274–పూర్వగాథాలహరి.)

అయితే, ఇక అమూర్తమంతమైన పరబ్రహ్మను గురించి అగ్నిపురాణం ఈ విధంగా చెబుతున్నది. "పరబ్రహ్మ" విశ్వాత్మ. సృష్టికి మూలం బ్రహ్మ. బ్రహ్మ నుండి ఆకాశం,

ఆకాశం నుండి గాలి, గాలినుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటినుం
అవతరించాయి. (పే. 274- పూర్వగాథాలహరి.)

పాఠక మహాశయులారా! పరబ్రహ్మను 'విశ్వాత్మ' అన్నారు గదా! అంటే, ఈ విశ్వమంతటా నిండి వున్న ఆత్మ. ఆ ఆత్మస్వరూపమే బ్రహ్మ. అది కనుపించని పరబ్రహ్మ. మన ప్రాణం మనకు కనుపిస్తుందా? కనుపించదు. కాని, దాని ఉనికితోనే మనం జీవిస్తున్నాం అన్నది సత్యం. అదే 'బ్రహ్మము' అని పిలువబడుతుంది కూడా.

అయితే మనలను భౌతికంగా, లౌకికంగా ఈ భూమ్మీద జీవింపజేసేది అపరబ్రహ్మ.

ఆ అపరబ్రహ్మమే మన అనసూయమ్మ!

అదేమిటి? అమ్మ స్త్రీ అయితే బ్రహ్మ పురుషుడు కదా అంటారేమో!

స్త్రీ పురుష బేధాలు మానవులకే గాని, భగవంతునికి లేవు. ఆయనే స్త్రీ. ఆయనే పురుషుడు. ఆయనే శివుడు. ఆయనే శక్తి.

అందుకే ఆయనను 'అర్థనారీశ్వరుడు" అన్నారు.

ఇక ప్రకృతిపరంగా చూస్తే కనుపించే ఈ సమస్త ప్రకృతి స్త్రీరూపం. అంటే అపరబ్రహ్మ.

మళ్ళా ఆ మహాశక్తిని సృష్టించేది స్త్రీరూపమైన ఆదిపరాశక్తి!

ఆ విధంగా మానవులతో సహా సమస్త జీవకోటికి ప్రకృతికీ జీవం పోసిన సృష్టికర్త పరబ్రహ్మ అయితే-

ఆ జీవానికి తన గర్భంలో రూపునిచ్చి, రక్తమాంసాదులనిచ్చి, నవమాసాలు మోసిన పిమ్మట ఈ భూమిపైన పడవేసే తల్లి అపరబ్రహ్మ. ఈ విధంగా సృష్టి, స్థితి, లయలు చక్రభ్రమణములు.

దీనిని బట్టే విత్తు ముందా? చెట్టు ముందా? అనే ధర్మసందేహం మానవులలో కలిగింది. దానికే శ్రీపాద శ్రీవల్లభ చరితామృతంలో ఈ క్రింది విధంగా వివరణ ఇచ్చారు శ్రీపాదులు.

"విత్తు ముందా? చెట్టు ముందా? అని కొంతమంది వితండవాదము చేయుదురు. ఈ రెండింటి కంటెనూ ముందున్నవాడు ఒకడున్నాడు. అతడే దైవము. తన సంకల్పమును బట్టి విత్తనమునుండి చెట్టును గాని, చెట్టునుండి విత్తనమును గాని ఆవిర్భవింపజేయగలడు. అమోఘమైన ఆయన సంకల్పము సప్తమహర్షులకు సైతము ఊహింపనలవి గానిది. (పే. 195)

పాఠకమహాశయులారా! దీనిని బట్టి మనకు తెలిసినదేమంటే పదార్థానికి రూపాన్నిచ్చేదీ, ఆ రూపానికి జీవాన్నిచ్చేదీ ఆ బ్రహ్మయే!

అంటే, ఆ పరాపర బ్రహ్మ లిద్దరూ ఇక్కడ తల్లిగా, తండ్రిగా ద్విపాత్రాభినయం చేసి, ఒకరినొకరు సృష్టించుకుని ఒకరి ఉనికికి ఇంకొకరు కారణమైనారన్నమాట.

అందుకే భగవంతునికి లింగబేధం లేదనేది. మన ఊహకోసం, మనం పేరుతో పిలిచి, కొలుచుకునేందుకు వీలుగా స్త్రీ పురుష బేధం కల్పించబడింది.

అదే ప్రకృతీ పురుషుల సమ్మేళనమై, ఆదిపరాశక్తిగా, ఆద్యంతరహితునిగా, అర్థనారీశ్వరునిగా అలరారుతున్నది.

ఈ విషయమునే అంటే, ప్రకృతీ పురుషుల సమ్మేళనమైన అర్థనారీశ్వర తత్త్వమునే "శ్రీపాద శ్రీవల్లభ చరితామృతంలో 24వ అధ్యాయంలో శంకర భట్టునకు ధర్మగుప్తుల వారు ఈ క్రిందివిధముగా వివరించియున్నారు. (పే.233)

"అర్థనారీశ్వర తత్త్వములోని అంతరార్థం ప్రాణులను జీవింపజేసే శక్తి... అనగా ప్రాణశక్తి రెండుగా విభాజితమై ఒకటి స్త్రీలోని అండాశయమునందు "శోణితము"గాను, మరియొకటి పురుషునిలోని "శుక్లము"గాను వుండి యీ రెండింటి కలయిక వల్ల జీవిగా ఏర్పడుతుందని. అయితే సృష్టిలో అమ్మ-నాన్న అను రెండు తత్త్వములు కలసి ఏకాకృతిలో నుండెడి జీవి వానపాము. స్త్రీ పురుషులు ఉభయులలోను స్త్రీ పురుషతత్త్వములు రెండూ వుంటాయని, శరీరంలో కుడిభాగంలో వుండే శక్తిని పురుష శక్తిగాను, ఎడమభాగంలో వుండే శక్తిని స్త్రీ శక్తిగాను గుర్తెరుగవలెను. అదేవిధంగా కుడిభాగంలో ప్రవహించే శ్వాసరూపశక్తిని "పింగళ" నాడిగాను, ఎడమ భాగంలో ప్రవహించే శ్వాస రూపశక్తిని "యిడా" నాడిగాను గుర్తెరుంగవలెను. ప్రాణాయామం చేసేటప్పుడు కుడివైపు శ్వాస పీలిస్తే శరీరంలో వేడి పుడుతుంది. కాబట్టి దానిని "సూర్యనాడి" అన్నారు. ఎడమవైపు శ్వాస పీలిస్తే శరీరం చల్లబడి చలువ చేస్తుంది. కాబట్టి దానిని "చంద్రనాడి" అన్నారు.

కాలపురుషుని శరీరములో రాశిచక్రం నుండి మేషరాశినుండి తులా రాశివరకూ వేడినిచ్చే ఆరుమాసాలు (చైత్రం నుండి భాద్రపదం వరకూ) సూర్యనాడి అనుకుంటే, ఆశ్వయుజము నుండి ఫాల్గుణము (వృశ్చికము నుండి మీనరాశి వరకూ) దాకా వుండే ఆరుమాసాలు చంద్రనాడి. ఈ సూర్యచంద్రుల గతివల్ల పౌర్ణమి అమావాస్యలు ఏర్పడుతున్నాయని మనము గ్రహించవలెను.

యోగి అయినవాడు తన శరీరంలోనే శ్వాసలోని సాధన ద్వారా కాలచక్రములోని సమస్తమునూ సిద్ధింపజేసుకుంటాడు. భూత, భవిష్యత్, వర్తమానాలను సమస్తమునూ గుర్తెరుంగ గలిగిన కాలజ్ఞానాన్ని పొందుతాడు. ఈ కాలచక్రమునే అర్థనారీశ్వర తత్త్వముగా ఎన్నడూ విడదీయరాని జంటగా గుర్తెరుంగవలెను. రాత్రింబవళ్ళు, పౌర్ణమీ అమావాస్యలు వంటి సమస్తమునూ ఒకదాని తరువాత ఒకటి దృశ్యమానమగుచుండును. ఒకటి ఇంకొక

దానికి ఆధారముగా వుండును. రాత్రి లేకుండా పగలుగాని, పగలు లేకుండా రాత్రిగాని ఉండజాలవు. తల్లీతండ్రి అని పిలువబడే అర్థనారీశ్వరులు యీ అనంతసృష్టి యొక్క సంచలనమునకు కారణమగు చున్నారు. శివుడు సంహారకుడనుటలో అంతరార్థం, పాత సృష్టి పోయి, క్రొత్త సృష్టి వచ్చుచున్నదని అర్థం."

పాఠక మహాశయులారా! తెలిసింది గదా!

అమ్మలో సృష్టికర్త బ్రహ్మయే కాదు అండములో నిద్రిస్తున్న ఆ బ్రహ్మను అండ విచ్ఛేదనం చేసి బైటకు రప్పించిన ఆదిపరాశక్తి కూడా నిబిడీకృతమై వున్నది.

పుట్టుకతోనే పూవు పరిమళించినట్లు అమ్మ ఈ భూమిపై పడుతూనే తానేమిటో తనలోగల పరాశక్తి స్వరూపం ఎటువంటిదో ఈ లోకానికి తెలియజేసింది.

అదేమిటో- అమ్మ స్వయంగా చెబుతూ శ్రీయార్లగడ్డ భాస్కరరావుగారిచే వ్రాయించిన తన జీవిత చరిత్ర అయిన 'అమ్మ జీవిత మహోదధి' అనే గ్రంథములోని ఈ సంఘటన తెలియజేస్తున్నది.

నిజానికి పై గ్రంథం అమ్మ జీవితచరిత్రకు మూలగ్రంథం. మూలగ్రంథమైన వాల్మీకి రామాయణం నుంచి అనేక రామాయణ గాథలు వెలువడినట్లే- "అమ్మ జీవితమహోదధి" నుంచి అమ్మను గురించిన ఇతర గ్రంథాలు వెలువడినవి. ఈ చిన్నిగ్రంథము కూడా అటువంటిదే!

ఆ మూలగ్రంథములో అమ్మ పరాశక్తిత్వాన్ని గురించి ఈ విధంగా వివరింపబడింది. (పే. 4-జీవిత మహోదధి.)

"అమ్మ భూమి మీద పడిన వెంటనే, మంత్రసాని బొడ్డు కోయుటకు చాకు పట్టుకోగానే దారము లేదని గుర్తుకు వచ్చి, మంత్రసానికి ఎలాగో దారము తెచ్చి యిస్తారు. ఆ దారము చేతబూని బొడ్డుకు ఎన్ని చుట్లు చుట్టినా మామూలు దారము మిగిలి వుంటుంది. ఇంత పెద్ద దారమా? అని విసుక్కుని మంత్రసాని బొడ్డు కోయుటకు చాకు పట్టుకుంటుంది. చాకు అతి పొడవుగా మెరుస్తూ త్రిశూలము మాదిరిగా కనబడుతూ చేతికి అమరకుండా వుంటుంది. బొడ్డువంక చూడగానే బొడ్డులోని బుడుపు శంఖము వలె కన్పిస్తుంది. యేమీ తోచక, కొయ్యలేక తడబడి ఇది ఏదో జబ్బో గాలిచేష్టో అనుకుంటుంది. కాని ఒక గంట తరచి చూడగానే బొడ్డు కమలముగా అతి కోమలముగా అందులో ఎవరో ఒక అమ్మ అలంకారములో నిలబడినట్లు కనబడుతుంది. అలా పదిహేను నిమిషములు విభ్రమముతో చూచి యీ పిల్ల పుటకే గాలితో పుట్టింది. ఈ పిల్లకు ఎన్నాళ్ళకు నయమవుతుందో ఏమో అని అనుకొనుచుండగానే కమలములో వున్న రేకులు వూగుతూ వుంటాయి. కమలములో వున్న బొమ్మ గిరగిర తిరుగుతూ వుంటుంది. కళ్ళు తిరుగుతున్నవేమోనని మంత్రసాని

కళ్ళు మూసుకుని కూర్చుంటుంది. కొంతసేపటికి కళ్ళు తెరవగా కొద్ది దారము మామూలు చాకు కనిపించుతాయి. పక్కవారు బొడ్డుకోయుట ఇంత ఆలస్యమేమని అడుగగా నా కళ్ళు తిరిగినవని చెప్పి పని పూర్తి చేస్తుంది."

పాఠక మహాశయులారా! ఇదీ- అమ్మ భూమ్మీద పడిన వెంటనే జరిగిన అద్భుతం!

అసలు, అమ్మ పుట్టుకకు ముందు అమ్మ తల్లిగారైన రంగమ్మగారికి ముగ్గురు బిడ్డలు పుట్టి పోయారట.

అమ్మకూడా భూమ్మీద పడగానే (తెల్లవారుఝామున 4-30 గంటలకు (ఉషోదయ సమయం) ఆ పుట్టిన బిడ్డ ఆకృతి, చేతులు కాళ్ళు మెలిక వేసుకుని తెల్లగా తెలుపులో గోధుమరంగుగా పొడవయిన ఆకృతిగా కనబడుతూ (+) క్రాస్‌గా ముడుచుకుని కనురెప్పకూడా వేయకుండా సర్వాంగములు కదలిక లేకుండా అరమోడ్పు కన్ను (చేపనిద్ర మాదిరిగా) యేడ్పు లేకుండా ప్రాణమున్నదా లేదాయనే అనుమానం కూడా కలిగి ఈ బిడ్డకూడా పోయినదా అనే దిగులు పట్టుకున్నదట అక్కడ వున్నవారికి. ఈ విషయాన్నే మనం మొదట్లో చెప్పుకొన్నాం.

ఇలాగే, పుట్టిన నాల్గవ రోజున కూడా అమ్మ కాళ్ళుచేతులూ బంధించి, కొయ్యబారిపోయి, నల్లకప్పు (నల్లగ్రుడ్డు) వేసి నిద్రలో వున్నదట. ప్రాణం పోయిందేమో నని అందరూ అనుమానించారట. కాని, ప్రాణం పోలేదు. మామూలు స్థితి లేదు. అలాగని ఏ జబ్బూ లేదా పాపకు.

నిజానికది శాంభవ ముద్ర! యోగులూ, తాపసులూ వేసే ముద్ర. అదే ముద్రను ఆమె తిరిగి తన పంతొమ్మిది నెలల వయసులో తెనాలిలో అమ్మ మేనమామ చంద్రమౌళి సీతారామయ్యగారి ఇంటిలో వేసినది.

దాని వైనమిది. (పే.21- జీవిత మహోదధి.)

"ఒకరోజు సాయంకాలము 5-30 నిముషములకు ఇంటికి ఎదురుగా వున్న రాజమ్మగారి ఇంటికి చిట్టి చిట్టి అడుగులు వేస్తూ వెళ్ళి దానిమ్మ చెట్టుక్రింద కూచుని నల్లగ్రుడ్డు పైకి పోనిచ్చి అరమోడ్పు కన్నులతో పద్మాసనము వేసి కూర్చొనెను. ఇంతలో బావినీళ్ళకు వెళ్ళిన రాజమ్మగారు వచ్చి, అమ్మ పద్మాసనము చూడక, ముఖమువంక చూసి "అమ్మో! చిన్నబిడ్డ నెప్పి వచ్చినదని అమ్మపైన బిందెడు నీళ్ళు కుమ్మరించును. అయినను అమ్మ కదలదు. వెంటనే బింది క్రింద పారవైచి రాజమ్మగారు నోరు నోరు కొట్టుకుని సమాధిస్థితిలో వున్న అమ్మను భుజము మీద వేసుకుని అమ్మ యింటికి తీసుకునివెళ్లును. పద్మాసనమటులనే యుండును. ఇది చూచి ఇంట్లోవారు వైద్యుల కోసము పరుగెత్తుదురు."

పాఠక మహాశయులారా! తరువాత వైద్యులు వచ్చి కొన్ని చిట్కావైద్యాలు చెయ్యటం జరిగింది. అయినా అమ్మ వాటితో బైటపడక తనంతట తానే ఆ శాంభవీ ముద్రలో నుంచి బయటకు వచ్చింది. అదంతా పెద్ద కథ.

అసలు పై వాటికన్నా అద్భుతమైన సంఘటన అమ్మకు పురిటిస్నానం చేయించిన రోజున జరిగినది వెనక్కు వెడదాం. చూడండి... (పే.4- జీవితమహోదధి)

"అమ్మకు స్నానం చేయించి జల్లెడలో పరుండబెట్టి పిల్లలను కావలిబెట్టి, ఎవరి పనుల మీద వారు వెళతారు. పిల్లలు ఆడుకొనుటకు వెళ్ళిపోతారు. ఒక పావుగంట అమ్మ దగ్గర యెవరూ వుండరు. ఒక పెద్ద నల్లకుక్క అమ్మ తలవద్ద కూర్చుని, అమ్మ చేయి, కాలు కదిపినప్పుడు కొరుకుదామని సాహసించలేక, పాదములు కదిలించగానే, పాదముల వద్దకు వచ్చి అమ్మ పాదములపై తన ముట్టెని పెట్టి పరుండును. అట్లే పది నిముషములు హాయిగా నిద్రపోవును. అందరు వచ్చి పెద్దగా అరచి, కుక్కను ఎంత లేవగొట్టినా లేవదు. అమ్మకాలు కదిలించగానే కుక్క లేచి జల్లెడ చుట్టూ ప్రదక్షిణము చేసి వెళ్ళిపోతుంది. అందరూ "యీనకాచి నక్కల పాలైనట్లు యెంతో అన్యాయమై పోయేది"అని అనుకొందురు. కుక్క పదినిమిషములలో తిరిగి అమ్మ మంచము వద్దకు వచ్చి, అమ్మ కక్కిన పాలుతాగి మంచానికి అయిదు జానల దూరములో పడుకుని కనులు తెరచి అమ్మవంక చూస్తూ ప్రాణాలు వదులును. దాని ముఖంలో తేజస్సు తగ్గలేదు. దానికి అంతకుముందు ఏ జబ్బూ లేదు. పోయే జబ్బే.

జ్ఞానం కలగడానికి మనుష్య జన్మే కాదు, కుక్కదగ్గర నుంచి పిపీలికాది మనుష్య పర్యంతం సంస్కరింపబడ్డప్పుడు ఒకే అర్హత వున్నదని యిది ప్రత్యక్ష ప్రమాణం."

భక్త పాఠకులారా! తెలిసింది కదా. అమ్మ సాక్షాత్తూ పరబ్రహ్మమేనని తెలిపేందుకు పై రెండు సంఘటనలు నిదర్శనం.

మనిషి మొదలు జంతువుల వరకూ గల జీవకోటిని ఆవరించి వున్న మాయతెరను తొలగించి తనేమిటో తెలియజెప్పే ప్రక్రియయే పై సంఘటన.

ఆ కుక్కలోగల జీవుడు తన తప్పును తెలుసుకొనటమే కాదు... అమ్మ పాదాలముందు పడి ప్రాణత్యాగం కూడా చేసుకున్నది.

ఆ తర్వాత రెండురోజులకే మరొక విచిత్ర సంఘటన జరిగింది. అంటే... అప్పుడు అమ్మ ఇరవై తొమ్మిదిరోజుల పసిబిడ్డ.

సాధారణంగా తేలు మనిషిని తాకితే కుట్టకుండా వుండదు. కాని ఉయ్యాల తొట్టిలో పడుకుని వున్న అమ్మను ఆనుకుని, ఆమె డొక్కలో ఒక చంటిపాప తన తల్లిని కరచుకుని పడుకున్నట్టుగా ఒక నల్లని తేలు (మండ్రగబ్బ) అమ్మను కరుచుకుని పడుకున్నది.

అమ్మకూడా ఒక తల్లి తన బిడ్డమీద చేయివేసి పడుకున్నట్టుగా ఆ తేలు పొట్టమీద చేయివేసి ఆదమరచి నిద్రపోతున్నది.

ఆ తర్వాత కాస్సేపటికి అమ్మ తల్లిగారైన రంగమ్మగారు వచ్చి అదిచూచి భయంతో కేకలు వేస్తూ, ఆ ఖంగారులో తేలుతో సహా పిల్లను (అమ్మను) ఆమె పడుకున్న గుడ్డలో చుట్టి పైకి తీసి భుజాన వేసుకోవడం, తేలు గుడ్డలోనే వుండి అందులో వున్న అమ్మ క్రిందకు జారిపడటం, అది చూచిన రంగమ్మగారు కూడా తెలివితప్పి క్రింద పడిపోవటం జరుగుతుంది.

రంగమ్మగారి కేకలు, చేసిన హడావిడికి ఇంట్లోని వారు బయటనున్న వారు వచ్చి, రంగమ్మగారిని సేదదీర్చి పిల్లనెత్తుకుని బయటకు పరుగెడుతున్న ఆమెను వారించి, కూచోబెట్టి క్రింద తేలుతో సహా పడివున్న గుడ్డను ఆమె ఒళ్ళో వేసి, బిడ్డకు పాలివ్వమని ఆమె వొడిలో పడుకోబెడతారు.

అమ్మ తల్లిదగ్గర పాలు త్రాగుతూ వుంటే అదే గుడ్డలో వున్న తేలు మెల్లగా బయటకు వచ్చి (ఇదెవరూ ముందు గమనించరు) అమ్మ పాదాల మీదకు ప్రాకి, తన కొండిని అమ్మ అడుగుపాదాలకు (అరిపాదాలకు) తగిల్చి, అలానే ప్రాణం విడుస్తుంది.

తర్వాత అక్కడ వున్నవారు అది గమనించి చచ్చిపోయిన ఆ తేలును బైట పారవేస్తారు. (పే.10 & 11 జీవిత మహోదధి)

అసలు ఎంతో సాధన చేసి యోగత్వం సిద్ధించిన తరువాత గాని ఒక సామాన్య మానవునకు సాధ్యంగాని శాంభవీ ముద్రను...

అమ్మ పుడుతూనే ఈ భూమ్మీద పడుతూనే ఒకసారి, ఆ తరువాత నెలల వయసులోనే మరియొకసారి స్వయంగా వేసి చూపించింది. అది పైన చదువుకున్నాము.

తరువాత పైన చదువుకున్న కుక్క, తేలుల ప్రాణ త్యాగాలు అమ్మలోని దైవీశక్తిని తెలియజేస్తున్నవి.



# అమ్మలోని అనసూయత్వం

ఇంకా అమ్మలోని అతి శక్తివంతమయిన అనసూయత్వాన్ని ఆమె బాల్యంలోనే ప్రదర్శించిన మరికొన్ని సంఘటనలను ఇప్పుడు తెలుసుకుందాం.

అమ్మ తల్లిగారైన రంగమ్మగారు జబ్బుపడగా ఆవిడను వైద్యం కోసం బాపట్లలో వున్న అమ్మ చినతాతగారైన చంద్రమౌళి చిదంబరరావుగారింటికి తీసుకువెడతారు. (ఆ యిల్లు ఇప్పుడు బాపట్ల రైల్వేస్టేషన్ ఎదురు రోడ్డులో కుడిప్రక్కనుండి నాలుగో ఇల్లు. డాబా, దానిమధ్యలో ఒకే ఒక పెద్ద పెంకుల గదితో చాలా పాతబడిపోయి, శిధిలావస్థలో వుంది. దాని ప్రహరీ గోడపై ఇంగ్లీషులో "అమ్మ" అనే అక్షరాలు చెక్కి వుంటాయి. ఈ మధ్యనే అంటే- 2015 జూన్‌లో దానిని పడగొట్టేశారు.)

అక్కడ అందరూ రంగమ్మగారి ఆరోగ్యం గురించి ఆందోళన చెందుతూ, అక్కడే తిరుగుతున్న నాలుగు సంవత్సరముల వయసుగల చిన్నారి తల్లి (అమ్మ)ని గురించి, ఆమె తిన్నదీ లేనిదీ ఎవరూ పట్టించుకోకుండా ఆమెపట్ల అశ్రద్ధగా వుంటారు.

అమ్మకు అప్పుడు నాలుగు సంవత్సరముల రెండు నెలలు. వంటినిండా నగలు పెట్టుకుని రాత్రిపూట సముద్రపు ఒడ్డుకు వెడుతుంది. అప్పుడు జరిగిందో సంఘటన. చదవండి. (పే.28- జీవిత మహోదధి.)

"అమ్మ ఒకరోజున ఒంటరిగా నడచి ముత్తాయిపాలెం రేవు సముద్రానికి వెళుతుంది. ఒకరాత్రి సముద్రపు ఒడ్డున వుండగా ఒక పల్లెవాడు వచ్చి, అమ్మను ఎవరు నువ్వని అడుగగా అమ్మ పలుకదు. అమ్మ వంటినున్న సొమ్ములన్నీ క్రమముగా వొలుస్తాడు. యెవరో సముద్రమునకు వచ్చి యీ పిల్లను మర్చిపోయి వుంటారు అని భావిస్తాడు. సొమ్ములు తీసుకుని అమ్మను సముద్రంలో పడవేయవలెనని విసరివేయును. వేయగానే సముద్రములో యేదో మెరసినట్లుండి సముద్రమంతా కాంతిగా వుండును. అమ్మ కనబడదు. సముద్రములో అమ్మను పడవేయగానే మొదటి అలకే (సముద్రపు అల) వచ్చి వొడ్డున పడును. పల్లెవాడు ఏమీ తోచక ఇంకా లోతుకుపోయి దారి తెలియక అందులో పడిపోవును. పడి, ఉక్కిరిబిక్కిరై వూపిరాడక బాధపడుతున్న సమయంలో తను పడవేసిన పిల్లే (అమ్మ) రెండు చేతులతో తను పడవేసినట్లే తనను రెండు చేతులతో ఒడ్డుకు పడవేసినట్లుండును. వాడు ఒడ్డును వచ్చి వుండును.

అమ్మ మాత్రము మామూలు చోటునే కూర్చుని వుండును. పల్లెవాడు అమ్మను సమీపించి అమ్మ ముఖము వంక చూడగా తనకు సముద్రములో కనబడిన కాంతి అమ్మముఖంలో కనబడును. అమ్మను పల్లెవాడు ఇంటికి తీసుకువెళ్ళి అన్నముపెట్టి వొలచిన

సొమ్మంతా వొంటికి పెట్టబోగా అమ్మ "నీ వొలిచింది నీ సొమ్మే నాయనా! నీవు బ్రతికొచ్చావు, అంతేచాలు. నాకదే సొమ్ము. నీకిదే సొమ్ము. తల్లికి బిడ్డ సొమ్ము. బిడ్డకు డబ్బు సొమ్ము" అన్నది.

తెల్లవారింది. గం. 5.30లకు-

పల్లెవాడు: అమ్మా! నిన్ను తీసుకుని వెళ్ళి ఇంటి దగ్గర దిగవిడుస్తాను. చెప్పు, వొంటరిగా పోలేవు.

అమ్మ: వొచ్చేటప్పుడు నీవు వచ్చావా? వచ్చిన తరువాత నీవు రక్షించావా? 'యెప్పుడూ రక్షణ, శిక్షణ ఒకరిదే'. నీ యింటిలో మాత్రము నాకు భక్షణ జరిగినది. నీవు నాతో వద్దు. (అని ఒంటరిగా బయలుదేరును.)

అతను వెనుక రెండు ఫర్లాంగుల దూరముగా వస్తూ వుంటాడు. అమ్మ ఇల్లు చేరువరకు వుదయము గం. 10-30 నిముషములగును. అమ్మ సరాసరి లోపలకు వెళ్ళి మంచము మీద వున్న అమ్మను (తన తల్లిని) చూచి మేడమీదకు వెళ్ళును.

పల్లెకారి నగలు తీసుకున్నను అమ్మకు యధాప్రకారము నగలు వుండును."

పాఠక మహాశయులారా! తెలిసింది గదా. అదీ అమ్మలోని మహిమాన్వితమైన అనసూయత్వం! తన ఒంటిమీద నగలను పల్లెవానికి వదిలేసినా మళ్ళీ అన్ని నగలూ ఆమె వంటినే వున్నవి.

పైన పేర్కొన్న శిక్షణ, రక్షణ ఒకరివే నన్న అమ్మ వాక్యానికి అర్థం.

తనకు కీడు తలపెట్టిన పల్లెవానిని సముద్రంలోనికి నడిపించినదీ, ఆ సముద్రపు నీటిలో పడి దిక్కుతోచక అల్లాడుతున్న పల్లెవానిని తిరిగి ఒడ్డున చేర్చినదీ తానేనని అతనికి చెప్పటం. అదే మహిమాన్వితమైన అనసూయత్వం!

ఇది ఎటువంటిదంటే- అల్లరి చేస్తున్న బిడ్డను మందలించి, ఆ మందలింపునకు భయపడిన బిడ్డను జాలితో వోదార్చటం వంటిది. పైపెచ్చు తాయిలంగా ఆ పల్లెవాడు దోచుకున్న తన నగలను అతనికే వదలివేయటం అనేది- అతని యింటిలో తను చేసిన భక్షణ (భోజనం)కు ఇచ్చిన ప్రతిఫలం.

అమ్మ ఏ ఒక్కరి ఋణాన్నీ వుంచుకోదు!

ఆఖరికి ఆర్తితో, భక్తితో 'అమ్మా!' అని పిలిచినా చాలు, దానికి ఆమెనుండి మనకు తగిన ప్రతిఫలం ముడుతుంది.

ఆమెకు మనం ధనరూపేణా వస్తురూపేణా ఏమీ ఇవ్వలేకపోయినా భక్తితో, అనురక్తితో మనం చేసే మానసపూజ చాలు. "అమ్మా!" అనే ఒక పలకరింపు చాలు. ఆమె ఆనందంతో పులకరించిపోతుంది. అదే అవ్యాజకరుణారస పూరితమైన రాజరాజేశ్వరీత్వం!

## చిన్నతనాన అమ్మలో చెలరేగిన జిజ్ఞాస:

ఎంతటి దైవమైనా మానవదేహం దాల్చి ఈ లోకానికి దిగివచ్చిన తర్వాత ఆ దేహంచుట్టూ మాయపొర కమ్మక తప్పదు. అందుకే దీనిని "మాయాలోకం" అన్నారు జ్ఞానులు.

ఆ మాయకు సామాన్య మానవులు శాశ్వతంగా వశులై, అజ్ఞానాంధకారంలో పడి కొట్టుకుంటూ వుంటే వారిలో కొందరు సాధన అనే కరదీపికను ధరించి, తమచుట్టూ వున్న మాయ చీకట్లను తొలగించుకుని జ్ఞాన మార్గాన్ని ఎంచుకుని ఈ చీకటి లోకాన జ్ఞానకాంతులను విరజిమ్ముతూ వుంటారు. ఇదంతా మానవులు, శారీరకంగా, మానసికంగా పక్వానికి వచ్చినపుడు పరిణామక్రమంలో జరిగే ప్రక్రియ!

ఇక సాక్షాత్తూ సచ్చిదానంద స్వరూపుడైన భగవంతుడే మానవ దేహం ధరించి ఈ భువిపైన కొలువు దీరితే, పై దానికి వ్యతిరేకంగా అప్పుడప్పుడు మాయ మబ్బుల చాటుకు ప్రయత్నపూర్వకంగానే పోయి దాగుని–

"మేమూ మీ వంటి మానవులమే సుమా" అని దోబూచులాడుతూ వుంటారు. అందులో కూడా కొంత పరమార్థమున్నది.

అందుకు ఉదాహరణ బాలరాముడు.

బాల్యంలో తల్లి చంకన ఎక్కి ఆరుబయట గోరుముద్దలు తింటూ, ఆకసంలో వెలిగే చందమామ కావాలని పేచీ పెట్టాడాయన. దానిని తెచ్చియిచ్చేవరకూ అన్నం ముట్టనని పేచీపెడుతున్న ఆయనను ఓదార్చటానికి తండ్రి దశరథుడు ఒక అద్దం తెప్పించి దాన్ని ఆకసంలోని చంద్రునివైపు త్రిప్పి రాముని దానిముందు కూచోబెడతాడు. అప్పుడు బాలరాముడు ఆ అద్దంలో తన చేతికందినంత దూరంలో గల చంద్రుని చూచి సంబరపడతాడు.

బహుశా అప్పటినుంచే కాబోలు సూర్యవంశంలో ఉదయించిన ఆయనకు అద్దంలో చంద్రుని చూచి ఆనందించడంతో రామచంద్రుడని నామాంతరం కలిగింది.

అదే విధంగా ఆ రామచంద్రుని సేవకుడైన ఆంజనేయుడు. సాక్షాత్తూ శివాంశ సంభూతుడైన ఆయన వానరరూపం ధరించడంతో ఫలభక్షక ప్రియుడై, తూర్పున ఆకాశంలో అప్పుడే ఉదయిస్తున్న బాలసూర్యుని చూచి బాల్యచాపల్యంతో ఆయనను ఫలమని భ్రమించి ఎగిరి వెళ్ళి నోటితో కొరకబోయి మూతిని కాల్చుకుంటాడు.

అయితే పై రెండు సంఘటనలలో రెండు ముఖ్యమైన సందేశములున్నవి. రాముని సందేశంలో–

"ఈ జీవితం ఒక దర్పణం వంటిది. అందులో కనబడే దృశ్యం ఏదీ నిజం కాదు. శాశ్వతం అసలే కాదు. అసలు ఆ దర్పణమే శాశ్వతం కాదు. ఎటొచ్చీ పైన కనబడుతున్న చంద్రుడే శాశ్వతం. కాబట్టి ఆయనను చేరేందుకు ఊర్ధ్వలోకం వైపు దృష్టిని సారించు. ఎప్పటికైనా అదే నీ గమ్యం" అనే హితవు కూడా వున్నది.

ఇక ఆంజనేయుని సందేశం ఏమంటే-

"నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు, ఎర్రనివన్నీ ఫలములని భ్రమించకు. అందులోనూ అందని వాటికోసం అసలే ప్రాకులాడకు. అలా చేస్తే ఇదుగో ఇలా నాకు లభించిన ప్రతిఫలమే నీకూ ముడుతుంది సుమా!" అనే సందేశంతో పాటు హెచ్చరిక కూడా అందులో ఇమిడి వున్నది.

అయితే అమ్మ క్రీడలు వేరు. ఆదిపరాశక్తి శ్రీరాజరాజేశ్వరి అవతారమైన ఆమె తన చిన్నతనంలో క్రీడలపైకన్నా "ఇది ఏమిటి?" అనే పంచాక్షఱ భావనతో, "అసలు ఇది ఏమిటి?" అనే అష్టాక్షఱ భావనతో జిజ్ఞాసభరితమైన ప్రయోగాలు కూడా చేస్తూ వుండేది.

దానికి కారణం... ఆ "ఏమిటి?" అనే పదానికి అర్థం తెలియక కాదు. పై ఉదంతాల వలెనే ఆ ప్రయోగాల ద్వారా మనకు ఒక సందేశమివ్వటానికి.

ఆ జిజ్ఞాసే... 'జీవిత మహోదధి' గ్రంథములో 'పరిణామ విచారణ' పేరిట (పే. 47) అమ్మలో చెలరేగిన ఆలోచనా సరళిని గురించి, దానిమీద ఆమె చేసిన ప్రయోగాలను గురించి తెలుసుకోండి.

అప్పటికి అమ్మ వయసు నాలుగు సంవత్సరముల ఏడు మాసములు.

"రెండవరోజు అమ్మ తెల్లవారుఝామున నాలుగున్నర గంటలకు లేచి ముఖము కడుక్కొని పూజకు దొడ్లోకి పూలకు వెడుతుంది. పూలు కోయుటకు కొమ్మ వంచగా కొమ్మ అమ్మతో మాట్లాడినట్లుండును. 'కొమ్మలో నుంచి ధ్వని వచ్చిందా? నా మనస్సా?' అని అమ్మ ఆలోచించగా పువ్వు కోసినచోట చెమ్మ వచ్చును. అమ్మ 'కొమ్మ ఏడుస్తున్నదేమో?' అనుకుంటుంది. చెట్టును వదిలేసి అమ్మ "అసలు ఏమిటి?" అనుకుంటుంది. మనస్సులో "అసలు ఏమిటి అంటే యిది ఏమిటి? అసలు ఇది ఏమిటి?" అని అరటిచెట్ల దగ్గరకు వెళ్ళి అరటి యాకు కోయబోగా అరటి పాదులో మురుగుడు వాసన వచ్చింది. ఆకులు సువాసన వచ్చును. చెట్టుపెరిగింది, ఆకు పెరిగింది, మురుగుడు వల్ల. దానితో పెరిగిన ఆకు మంచి సువాసన. దీనికి దుర్వాసన కారణమేమిటి? అని వేరుచోట పొడిమట్టిలో నీరుపోసి బురదచేసి, మరొక చోట గుంట తవ్వి (నీరు బైటకు వచ్చేదాక) వేరొక చోట మళ్ళీ ఆ వూట నీరును పొడిమట్టిని కలిపి బురద చేసి రోజూ నీళ్ళు పోయగా అది మురుగు అయి ఒక నెలరోజులకు అందులో పచ్చి ఆకులు కలపగా మూడూ కలసిన తరువాత కొన్నిరోజులకు లుకలుకలాడి పురుగులు వచ్చును.

అమ్మ అది చూచి "ఏది జడత్వము? ఏది చైతన్యము? అన్న జిజ్ఞాసలో పడిపోయినది."

పాఠక మహాశయులారా! నాలుగేళ్ళ వయసులో అమ్మయందు కలిగిన ఆ జిజ్ఞాసకు కారణం ఆమెకు తెలియక కాదు. ఎందుకంటే తన చరిత్రను భాస్కరన్నయ్యకు చెప్పి వ్రాయించినప్పుడు ఆమెది నడివయసు. ఆ వయసులో తాను తన తల్లి గర్భము నుండి బయటపడినప్పటి సంఘటనలను కూడా చెప్పగలిగిందంటె, కేవలం అది దేవతలకు తప్ప మానవులకు సాధ్యంకాదు.

జడత్వంలోంచి చైతన్యం, చైతన్యంలోంచి జడత్వం కలిగినవని మనకు తెలియ జేయడానికే తన జిజ్ఞాస రూపంలో ఇదంతా తెలియజెప్పింది- అమ్మ.

జడరూపంలో నున్న మట్టిలోనుంచి చైతన్యరూపంలో నున్న నీరు పుట్టింది. మళ్ళీ ఆ నీటి అడుగున జడపదార్థమైన మట్టి వున్నది. ఆ రెండింటి సంగమంతో అంతవరకూ భూమిలో జడపదార్థముగా నున్న విత్తు మొలకెత్తి మొక్కగా జీవము పోసుకున్నది. దీనినిబట్టి మనకు తెలిసినదేమంటే నేలలో నీరు, ఆ నీటి అడుగున మళ్ళీ నేల, వీటి నడుమ గుప్తముగా జీవచైతన్యాన్ని నింపుకొన్న జడరూపమైన విత్తు.

ఇక్కడ విత్తు ఒక్కటేకాదు. జడ, చైతన్య రూపములో నున్ననేల, నీరు కలసి రూపొందిన చోట, జీవములేని ఆకులలములు వేసినపుడు అది మురిగిపోయి, మళ్ళీ ఆ మురుగులోనుంచి క్రిముల రూపంలో జీవముద్భవించినది.

ఇదీ భూభౌతిక జీవతత్వము!

అయితే, అది వుండే స్థలము, స్థితులను బట్టి దాని ఆకారము, స్వభావము వేర్వేరుగా వుంటాయి.

అందుకే కొన్నిచోట్ల మురుగులోనించి క్రిములు పుడితే, మరికొన్ని చోట్ల వృక్షజాలము మొలకెత్తుతుంది. క్రిములుద్భవించిన చోట నీరు నలుపురంగులో మురికి వాసన కొడితే విత్తు మొలకెత్తి మొక్కగా మారినచోట నీరు బురదగా జేగురురంగులో నుండి మట్టివాసన కొడుతుంది. అందులో నుండి మొలకెత్తిన మొక్కగాని, చెట్టుగాని దాని ఆకులతో పువ్వులతో సువాసనలను వెదజల్లుతూ వుంటాయి. వాటి రంగులు కూడా నయనానందంగా వుంటాయి. అదే సృష్టి వైచిత్యం!

ఆ బురదనేల మీది తడి కావచ్చు, లేదా తటాకపుటడుగున వున్న బురద కావచ్చు. ఏదైనా ఆయాచోట్ల భూభౌతిక తత్వాలను బట్టి విత్తును బట్టి, మొక్కగానో, చెట్టుగానో, వృక్షముగానో జీవముద్భవిస్తుంది.

దీనిని బట్టి మనం గ్రహించవలసినదేమంటే... చైతన్యమనేది జడ, ఖనిజములతో సహా ఈ సమస్త విశ్వమందూ వ్యాపించి వున్నదని. దాని ఉనికిని బట్టి దాని స్వభావము,

ఆకారము మారుతూ వుంటుంది. అందుకే, "నా దృష్టిలో జడమేమీ లేదు. అంతా చైతన్యమే, సజీవమే"నని ఆ తరువాత కాలంలో చెపింది- అమ్మ.

అందుకే ఖనిజ రూపములో నున్న చైతన్యము పరిణామక్రమములో మహాశక్తివంతమైన మానవాకృతిని దాల్చి ఈ విశ్వ పరిపాలనా కార్యములో ఆ పరంజ్యోతికి సహాయ, సహకారముల నందించుచున్నది.

అంతేకాదు... విశేష ఆధ్యాత్మిక స్థితినొంది మరల ఆ పరంజ్యోతిలో లీనమగుచున్నది.

ఈ పరిణామక్రమమును గురించి శ్రీ దత్తావతారుడైన 'శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం'లో శ్రీపాదులు నరసావధానికి ఈ విధముగా వివరించి యున్నారు. (పే.65- శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం.)

"ఖనిజము- సంపూర్ణ నిద్రావస్థలోనున్న చైతన్యము. వృక్షములు, వృక్షసంబంధ పదార్థములు, అర్థ నిద్రాస్థితిలోనున్న చైతన్యము. జంతువులు- పూర్ణచైతన్యములో నున్న స్థితి. ఖనిజముగా పుట్టి, ఖనిజముగా చచ్చి, తరువాత తరు, గుల్మాదుల (చెట్లు, పొదలు, తుప్పలు) జనించి, ఆ తదుపరి జంతుజన్మలనెత్తి, ఆఖరున మానవజన్మ నెత్తిన మానవుడు వివేక, జ్ఞాన, వైరాగ్యవంతుడై తనలోని నిద్రాణ స్థితిలో నున్న పరమాత్మ శక్తిని మేల్కొలిపి మోక్షము నొందవలెను."

పాఠక మహాశయులారా! తెలిసినది కదా. మన అమ్మకూడా అదే చెప్పింది. "ఈ సృష్టి పరిణామ శీలం కలది, దీనికి నాశనం అన్నది లేదని."

మన జిల్లెళ్లమూడి అమ్మకు 'అనసూయ' అను పేరుపెట్టినందుకు ఆమె తత్త్వము పురాణకాలం నాటి అనసూయ మాత మహిమాన్విత తత్త్వమునే అక్షరములా పోలియున్నది.

అసలు అనసూయ అనే మాటకు గల అర్థమేమిటో ఆమె మహిమాన్విత తత్త్వమెటువంటిదో పై గ్రంథములో శ్రీపాదుల వారే ఈ క్రింది విధముగా వివరించి యున్నారు. చూడండి (పే.65- శ్రీపాద శ్రీవల్లభ చరితామృతం)

"భూత, భవిష్యద్వర్త మానములు, అవస్థాక్రమము, సృష్టి, స్థితి, లయములు మొదలయిన క్రమములన్నిటినీ అతిక్రమించి 'నాన్నగారు' అత్రి మహర్షిగా ప్రఖ్యాతులైరి. సృష్టియందలి ఏ జీవియందును, ఏ పదార్థము నందునూ, అసూయ ద్వేషములు లేశమాత్రము లేని కారణమున 'అమ్మ' అనసూయగా ఖ్యాతి గాంచినది. బ్రహ్మ, విష్ణు రుద్రులకు కూడా ఆధారముగను, అతీతముగను వున్న ఆ పరంజ్యోతి స్వరూపమును దర్శించవలెనని అత్రిమహర్షి ఘోర తపస్సు చేసిరి. ఆ పరంజ్యోతి స్వరూపము సృష్టి యందలి ప్రతి ప్రాణినీ ప్రతి పదార్థమును అమృత దృష్టితో వీక్షించి అనుగ్రహించ వలసినదిగా అనసూయ మాత తపమాచరించినది. కర్మసూత్రము ననుసరించి జీవులకు

సుఖదుఃఖములు కలుగుచుండును గనుక మహా పాపముల ఫలితములు స్వల్పముగా కలుగునట్లునూ, స్వల్ప పుణ్యములకు మహా ఫలితములు కలుగవలెననెడి సత్సంకల్పముతో అనసూయమాత ప్రార్థన చేసెడిది. కఠినమైన లోహముతో చేయబడిన శనగల ఆకారముననున్న లోహపు ముక్కలను తన తపోబలముచే జీవంతములైన, తినుటకు యోగ్యమైన శనగలుగా అమ్మ మార్చివేసినది."

భక్త పాఠకులారా! తెలిసింది గదా... అలనాటి అనసూయ మాత దయార్ద్రహృదయము, మహామహిమాన్విత తత్త్వము.

పైన శ్రీ పాదులవారు పేర్కొన్న 'నాన్నగారు, అమ్మ' అనే పదాలు శ్రీ దత్తాత్రేయుల వారి తండ్రిగారైన అత్రి మహర్షిగానూ, తల్లిగారైన అనసూయమ్మగాను గ్రహించాలి. ఎందుకంటే శ్రీపాదులవారు సాక్షాత్తూ శ్రీ దత్తాత్రేయుల వారి అవతారముగదా! ఇంకొక విచిత్రమైన విషయం ఏమంటే – ఇక్కడ 'జిల్లెళ్ళమూడి'లో కూడా అందరూ అనసూయమ్మను 'అమ్మ' అని, ఆమె భర్త శ్రీ నాగేశ్వరరావుగారిని 'నాన్నగారు' అని పిలుస్తారు. ఈ సారూప్యం బాగుంది కదూ!

ఆనాటి అనసూయమాత తన భక్తులనే కాదు, జీవులందరికీ వారు చేసే మహా పాపములకు ఫలితములు స్వల్పముగానూ వారు చేసే స్వల్ప పుణ్య కార్యములకు మహా ఫలితములు కలుగవలెనన్న సత్సంకల్పముతో ప్రార్థన చేసెడిదని పైన చదువుకున్నాము.

అటువంటి సత్సంకల్పం ఎవరికి వుంటుంది? ఈ లోకంలో గల సకల జీవులను తన బిడ్డలుగా భావించే ఒక్క మాతృమూర్తికే వుంటుంది ఆ తపన.

సరిగ్గా అటువంటి తపన గలదే మన జిల్లెళ్ళమూడి అనసూయమ్మ! బాధాతప్త హృదయులై తన దగ్గరకు వచ్చిన ఎంతోమంది బాధలను, తాపములను కేవలం తన కంటి చూపుతో, చేతి స్పర్శతో లేదా తాను ప్రసాదించే తీర్థప్రసాదాలతో నయం చేసేది.

అలాగే ఆనాటి అనసూయమ్మ లోహపు ముక్కలను ఆహారముగా తినే శనగలుగా మార్చిన మహిమలనే మన అనసూయమ్మ కూడా చేసిన సంఘటనలు చాలా వున్నాయి.

అమ్మ తన దగ్గరకు వచ్చే భక్తులకు ప్రసాదంగా ఇచ్చేందుకు పళ్ళు మొదలైనవి అప్పటికప్పుడు ఏమీ అందుబాటులో లేకుంటే నేలనుండి ఇంత మట్టిని తీసి ప్రసాదంగా పంచిపెట్టేదట.

ఆశ్చర్యం!!!

ఆ మట్టే ఘుమ ఘుమలాడుతూ సువాసనతో నోట్లో వేసుకుంటే ఎంతో రుచిగా, తీయగా వుండేదట!

అలాగే ఒకసారి నాన్నగారు (అమ్మ భర్త శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు) అమ్మ వడ్డిస్తుండగా భోజనం చేస్తూంటే హఠాత్తుగా ఆయన నోటి వెంబడి రక్తం పడిందట.

అమ్మ చప్పున వెళ్ళి ఆ రక్తాన్ని చేతులతో పట్టి దోసిళ్ళలో నింపిందట.

అంతే! అమ్మ చేతిలోనున్న ఆ రక్తం చూర్ణంగా మారి, ఘుమ ఘుమలాడే సువాసనలను విరజిమ్మిందట. ఆ చూర్ణాన్ని అలాగే తినమని నాన్నగారి నోటి కందించిందట అమ్మ. నాన్నగారు దానిని రుచి చూడగానే ఎంతో తీయగా అనిపించిందట. నాన్నగారు అందులో ఒక్క అణువు కూడా మిగల్చకుండా మొత్తం అంతా తినివేశారట.

అంటే- తాను కక్కిన రక్తాన్ని చూర్ణరూపంలో ఆయనే తిరిగి శరీరంలో నింపు కొన్నారన్నమాట.

అలాగే, ఒకసారి అమ్మ చిన్న కుమారుడు పది సంవత్సరాల వయసుగల రవి (శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు. ఆయన ఎస్.బి.ఐ. బ్రాంచి మేనేజరుగా చేసి రిటైర్ అయి, ప్రస్తుతం విశ్రాంత జీవితాన్ని గడుపుతున్నారు. ఆయనే ఇప్పుడు విశ్వజననీ పరిషత్‌కు పాట్రన్.) అమ్మ భక్తులకు ప్రసాదంగా ఇచ్చిన మట్టిలోని సువాసనలను చూచి, "అమ్మా! ఇందులో సాంబ్రాణి కడ్డీలను కలిపావా?" అని అడిగారట.

అందుకు అమ్మ నవ్వేసి ఊరుకున్నదట. అప్పుడాయన ఎక్కడో వున్న రాళ్ళను కొన్నింటిని ఏరుకొని వచ్చి "ఆ వాసన వీటికి రప్పించు చూద్దాం" అన్నారట.

అమ్మ నవ్వుతూ వాటిని తాకి ఇచ్చిందట. అవికూడా సువాసనలను వెదజల్లాయట.

అటువంటి అనుభవమే ఆయనకు ఇంకొకటి జరిగింది.

ఒకరోజున అమ్మను చూడటానికి పదహారుమంది భక్తులు జిల్లెళ్ళమూడి వచ్చారు. వారికి భోజనం పెట్టడానికి అమ్మ ఒక కాఫీకప్పుడు బియ్యంతో ఎసరు పెట్టిందట.

అదిచూచి రవి "అమ్మా! ఇది నాకే సరిపోదు. మరి వీళ్ళందరికీ ఎలా?"అని అడిగారట.

దానికి అమ్మ "నీకు కావలసింది తినరా నీకెందుకు?" అని ఆయన భుజం తట్టిందట.

అయితే, విచిత్రంగా ఒక పసివానికి కూడా సరిపోని ఆ అన్నం, ఆ వచ్చిన పదహారుమందికీ రవితో సహా సరిపోయిందట. (పె.23 మహస్సు 2011 నవంబరు ప్రత్యేక సంచిక నుండి)

సరిగ్గా ఇటువంటి మహిమనే అమ్మ తన చిన్నతనాన అంటే తన ఏడవ ఏట చూపి, అందరినీ ఆశ్చర్యంలో ముంచివేసిందట.

అమ్మ తన బంధువులతో ప్రకాశంజిల్లా ఇంకొల్లు వద్ద గల పావులూరు వెళ్ళి కొన్నాళ్ళు వున్నదట. అక్కడగల పొలిమేర ఆంజనేయస్వామి గుడిలోపూజారి తనకు ఇచ్చిన వడపప్పు ప్రసాదాన్ని తీసుకుని దానికి ఒక సోలెడు పెసరపప్పు, చింతపండు, పచ్చిమిరపకాయలు,

వంటాయనను అడిగి చేర్చి పచ్చడి రుబ్బి, ఇంట్లో తనకు పెట్టిన అన్నమును కూడా తీసుకువెళ్ళి ఆంజనేయస్వామిగుడి దగ్గర చెరువులో బట్టలు వుతికే చాకలివాళ్ళకు ఆ దారిన పోయే బాటసారులకు, సుమారు ఒక ముప్ఫైమందికి కడుపునిండా అన్నంపెట్టి వారి ఆకలి తీర్చి, తృప్తి పడేదట. ఎవరైనా ఇంతమందికి ఆ కొంచెం పచ్చడి, అన్నం ఎలా పెట్టావు?" అని ఆశ్చర్యంతో అడిగితే "నలుగురినీ అడుక్కు వచ్చిపెట్టాను"అని చెప్పి తప్పించుకునేదట గాని, తన మహిమను గురించి చెప్పేది కాదట.

మరి ముప్ఫైమందికి సరిపడా అన్నం, పచ్చడి రోజూ ఆ పసిపిల్లకు ఎవరు ఇస్తారు?

అదే విధంగా అమ్మ స్వర్ణోత్సవ (50 సంవత్సరాలు) జన్మదిన సందర్భంగా 1973 ఏప్రిల్‌లో అమ్మ కోరిక ప్రకారం జిల్లెళ్ళమూడిలో ఆమె భక్తులు ఒకే పంక్తిలో లక్షమందికి జరిపిన సంతర్పణలో జరిగిందీ అద్భుతం!

అమ్మ కోరిక తీర్చేందుకు ఆశ్రమంలోని ఆమె బిడ్డలు అందరూ కలసి ఒకేసారి లక్షమందికి అన్న సమారాధన చేయడానికై అరవై ఎకరాలలో పందిళ్ళు వేసి రహదారులు ఏర్పరచి, వంటశాలలు నిర్మించి బ్రహ్మాండంగా శాకపాకాలు తయారు చేయించారు. తీరా సమారాధన చేసే రోజున అనుకోకుండా మరొక యాభైవేల మంది భక్తులు జిల్లెళ్ళమూడి పరిసర గ్రామాల నుండి తరలి వచ్చారు.

ఆశ్రమ నిర్వాహకులకు ఏం చేయాలో తోచక బాపట్లనుండి అదనంగా బియ్యం, కూరగాయలు తేవడానికి ప్రయత్నించగా అమ్మ వచ్చి "అదేం వద్దు"అని జీపు వేసుకుని వంటశాలల మధ్యనుంచి వెడుతూ రెండు ప్రక్కలా రాశులుగా పోసిన అన్నమునూ, శాకపాకాలనూ చూసుకుంటూ పందిళ్ళన్నీ కలియదిరిగి "ఇక వడ్డించండి" అన్నదట.

అంతే! అమ్మ చూపుల్లో ఏముందో...వారు అలా వడ్డిస్తూనే వున్నారు. ఇలా తినేవారు తింటూనే వున్నారు. అలా ఎంతమంది వచ్చి తిన్నా అక్కడ అన్నం, ఇతర భక్ష్యపదార్థాలూ అక్షయమవుతూనే వున్నాయి. అందరి భోజనాలూ అయిపోయినాక ఇంకా మిగిలిపోయిన అన్నాన్ని, భక్ష్యభోజ్యాలనూ అమ్మ కోరిక ప్రకారం పరిసరాలలోని పొలాలలోనూ, జిల్లెళ్ళమూడి గ్రామ శివార్లలో ప్రవహించే ఓంకార నదిలోను విరజిమ్మారు.

ఎందుకంటే...

అమ్మ దృష్టిలో అక్కడ ఆరోజు భోజనం చేసిన భక్తులు మాత్రమే అమ్మ బిడ్డలు కాదు. ఆ పరిసర పొలాలలో గల పశుపక్ష్యాదులూ, క్రిమికీటకాలూ, ఇతర సూక్ష్మజీవులూ అలాగే ఓంకార నదిలో నివసించే చేపలూ, సరీసృపాలు మొదలైనవి కూడా అమ్మ బిడ్డలే!

అందుకే మిగిలిన అన్నాన్నీ, భక్ష్యాలనూ అయా ప్రాంతాలలో విరజిమ్మమని అమ్మ చెప్పింది.

ఆ రోజు అసంఖ్యాకమైన మానవ భక్తులతో బాటూ, పొలాలలో, నదులలో జీవించే సకల ప్రాణికోటీ ఆ విందు భోజనాలను ఆరగిస్తూ వుంటే చూచి, పరవశంతో ఆనందభాష్పాలు రాల్చింది... సకల జీవకోటినీ గన్న ఆ మాతృమూర్తి!

అమ్మ తాకిన వస్తువులు సువాసనను సంతరించుకున్నవని పైన చెప్పుకొన్నాం గదా అసలు అమ్మ ఒంటి వాసనే పరిమళభరితమని ఆమెకు దగ్గరగా సంచరించే వారు చెప్పుకొంటారు.

అమ్మ పెద్ద వయసులోనే కాదు... ఆమె చిన్నతనాన అంటే పది సంవత్సరముల వయసులో కూడా ఆమె శరీరం సుగంధభరితమే! తద్వారా ఆమె ధరించిన దుస్తులు కూడా సుగంధాలను వెదజల్లేవి.

దానికి ఉదాహరణ చాకలి బుచ్చమ్మ ఉదంతం.

బుచ్చమ్మ గరికపాడు గ్రామంలో అమ్మ బంధువుల ఇంట్లో బట్టలుతికే చాకలి. చాలా నిజాయితీ గల మనిషి. నిర్మొహమాటి. ఆమెకు ఆ ఊరి చివర ఒక మఠము వుంది. ఆమె పేరనే దానిని "చాకలి బుచ్చెమ్మ గారి మఠం" అని పిలుస్తారు.

కారణం... అక్కడ ఆమె, ఆమె తమ్ముడు ఎల్లమంద బ్రహ్మంగారి తత్వాలు పాడుతూ, ఆ వూరి ప్రజలకు వేదాంత విషయాలు చెబుతూ వుండేవారు. చాకలి బుచ్చెమ్మ సూర్యనాడి, చంద్రనాడుల నడకలను గురించి చెబుతూ, అప్పుడప్పుడు జరగబోయే విషయాలను కూడా చెబుతూ వుండేది.

అమ్మలోని దైవత్వాన్ని గుర్తించిన బుచ్చెమ్మ ఒకరోజు అమ్మ బంధువుల పిల్ల, అమ్మ యీడుదే అయిన సుందరమ్మనూ, అమ్మనూ తన మఠానికి రమ్మని పిలుస్తుంది.

ఆమె మఠానికి వీళ్ళు వెళ్ళిన తరువాత మాటల ప్రస్తావనలో బుచ్చెమ్మ సుందరమ్మకు అమ్మ వాడిన దుస్తులనుంచి వచ్చే పరిమళాన్ని గురించి ఈ విధంగా చెబుతుంది. (పే. 433- జీవిత మహోదధి)

"బుచ్చమ్మ : అసలు మాట చెప్పమంటావా? ఆమె (అమ్మని) గుడ్డలు విప్పివేస్తే (అమ్మ తను తొడుక్కున్న గుడ్డలను విప్పి చాకలికి వేస్తే) ఆ గుడ్డలు ముదుచుకుంటుంటే యెంత పరిమళమో వచ్చింది" అన్నది. బుచ్చెమ్మ, అనసూయ (అమ్మ)ను చూపిస్తూ యేమన్నా అత్తర్లు రాసుకుందేమో ననుకున్నాను. పోనీ రాసుకున్నది ఎంతసేపు వుంటుంది అని నాకు తెలియదూ! గుడ్డలు ఉతుకుతుంటే చెరువంతా వాసన వచ్చింది. చెరువులో ఆ నీళ్ళు పడే ఆ వాసన వచ్చిందే అనుకోండి. ఆ వాసనే రకరకాలుగా (సువాసన్లే) ఒక్కొక్కసారి మరీ ముక్కు దగ్గర పెట్టనంతగా సంపెంగ వాసనా వచ్చింది. గుడ్డలిచ్చి ఇంటికొచ్చిన తరువాత నేను యోగంలో కూర్చుంటే, మొగలిపూల వాసనతో నేను వుతికిన పరికిణీ, చొక్కా (అమ్మవి) మడతబెట్టి నా ముందర పెట్టినట్లు, ఆ గజ్జెల పట్టాలతో

ఘల్లుఘల్లుమనుకుంటూ వచ్చి చొక్కా పరికిణీ తొడుక్కుంటున్నట్లు కనిపించింది. వెంటనే నేను చెయ్యి చాచినట్లు జడకుప్పెల జడ అమ్మవారి నలంకరించినట్లుగా అలంకరణతో గిరగిరా తిరుగుతూ తనతోబాటుగా తన జడ తిరుగుతూంటే ఆ పరికిణీ గుమ్మటాలు మళ్లే లేచి ఆ చిన్ని చిన్నిచేతులు, ఆ చక్కని పాదాలు భూమిమీద తిరుగుతుంటే, అసలు ఆ పాదాలే వేరు. ముఖము కంటే కూడా ఆ పాదాలు చూడ ఎంత బాగుంటయ్యో! ఆ పాదాలలో నా నీడ కనబడ్డది. చివరకు వచ్చి అమాంతంగా నావొళ్ళో కూచున్నట్లుగా స్పర్శ తగిలింది. కళ్ళు తెరిచాను. అది కాగానే మన యింటికి రావాలనిపించింది. రాత్రికి మీ యింటికి వచ్చిన కారణం అదే. వచ్చేటప్పటికి మీరు చీకట్లోనే కూచున్నారు కదా! సుందరమ్మగారూ! మీరు యిద్దరూ కలిసి కూచున్నప్పటికీ అమ్మ ముఖంలో కాంతి కనబడింది (ఆ చీకట్లోకూడా). ఇక్కడ (తన యింట్లో) ఏ రూపంలో చూశానో, అక్కడ (సుందరి యింట్లో) ఆ రూపంతో దర్శనమిచ్చింది.

అటువంటి తల్లిని ఇంటికి (తన యింటికి) తీసుకొచ్చి కూర్చోబెడదామనుకున్నా. అసలు నేను పిలవడమేమిటి? అదివరకే వచ్చి వున్నదిగా. రాకపోతే పిలవాలనిపించేది కాదు. తను వచ్చి పిలిపించుకున్నది."

పాఠక మహాశయులారా! తెలిసిందిగా... అమ్మ దేవతామూర్తి గనుకనే చిన్నతనం నుండే వంటినీ, పరిసరాలనూ సువాసనలతో నింపుకొని తిరిగేది.

సాధారణంగా శ్రీ లలిత, కనకదుర్గ, రాజరాజేశ్వరి మొదలైన శక్తిస్వరూపాలు పది, పదకొండేళ్ళ చిన్నపిల్లల రూపాల్లో పరికిణీ, జాకెట్లతో తిరుగుతూ ఆడుతూ పాడుతూ కనిపిస్తారు.

అసలు ఆ వయసులో అటువంటి దుస్తులు ధరించి కనిపించిన మానవ బాలిక లెవరైనా ముద్దులు మూటగట్టే దేవతాస్వరూపులుగానే అనిపిస్తారు, కనిపిస్తారు. వారి సంభాషణ కూడా ఎంతో అపురూపంగా, ఆత్మీయంగా అనిపిస్తుంది.

ఇంతకీ మనం ఇప్పుడు చెప్పుకొంటున్నది అలనాటి అనసూయమాత యొక్క లక్షణాలు, మహిమలు ఈనాటి మన అమ్మ అనసూయమ్మలో కూడా వున్నవని కదూ!

ఆనాటి అనసూయమ్మ పది సంవత్సరాల పాటు అనావృష్టిబారిన పడిన ఈ లోకంలో వర్షాలు కురిపించి, ఎండిపోయిన గంగను తిరిగి ప్రవహింపజేసి, బీడువారిన భూమిని తిరిగి సస్యశ్యామలంగా మార్చింది. అంటే అనావృష్టిని తలపుమాత్రంచేత రూపుమాపి, వర్షాలు కురిపించి ఈ భూమిని పచ్చదనంతో నింపినదన్న మాట.

అయితే ఈనాటి మన అనసూయమ్మ అతివృష్టిని ఆపుజేసి తన పరమభక్తుడైన శ్రీ కొండముది బాలగోపాల కృష్ణమూర్తి (గోపాలన్నయ్య) కూతురి వివాహం నిర్విఘ్నంగా నెరవేర్చిన ఉదంతం ఇది.

విడవకుండా ఏకధారగా కురుస్తున్న వర్షాల వల్ల తన కుమార్తె వివాహం ఎల జరపాలా అని గోపాలన్నయ్య ఆందోళన పడుతూ వుంటే అమ్మ అతన్ని పిలిచి...

"పెళ్ళి పనులన్నీ మీరు చూసుకోండి. ఈ వర్షం వ్యవహారం నేను చూసుకుంటాను అని ఆ పెళ్ళి అయి, భోజనాలన్నీ అయేదాకా కుండపోతగా కురుస్తున్న వర్షాన్ని ఆపుజే వివాహం నిర్విఘ్నంగా జరిగేటట్లు చేసింది.

అమ్మ అదే మహిమను ఈ రచయిత జిల్లెళ్ళమూడికి వచ్చి నివాసముంటున్న కాలం (ఆగస్టు 2012 నుండి 2014)లో కూడా ఎన్నో తడవలు చేసి చూపి, ఇక్కడ జరిగిన అనేక ముఖ్య కార్యక్రమాలను, కుంభవృష్టిగా కురుస్తున్న వర్షం బారినుండి తప్పించి నిర్విఘ్నంగా జరిగేటట్లు చేసింది.

అంతేకాదు...

ఆనాటి అనసూయమ్మ ఆనాడు దేవతల కోర్కె మేరకు పదిరోజులపాటు పగటి సమయాన్ని కూడా రాత్రులుగా మార్చి కాలాన్ని స్థంభింపజేస్తే-

నేటి మన అనసూయమ్మ కూడా కాలాన్ని కొన్ని గంటలపాటు స్థంభింపజేసిన ఉదంతం ఒకటి వుంది.

ఒకసారి దేశిరాజు భాగ్యమ్మగారనే ఒక ఆధ్యాత్మిక సంపన్నురాలు అమ్మవద్దకు వచ్చే భక్తులకు ఒక మంత్రోపదేశము చేయమని అమ్మను కోరితే, అమ్మ 1958 మాఘపౌర్ణమి నాడు జిల్లెళ్ళమూడి గ్రామం ప్రక్కనుండి ప్రవహించే నల్లమడ వాగు (అమ్మ దీనిని 'ఓంకార నది' అని పిలిచేది) ఒడ్డున తెల్లవారు ఝామున మూడున్నర గంటలనుంచి ఆరు గంటలవరకూ ఆరువందల మందికి భాగ్యమ్మగారు చెప్పిన మంత్రోపదేశం చేసింది. అంటే రెండున్నర గంటల సమయం అన్నమాట.

ఇక్కడ చెప్పుకోవలసిన విషయం ఏమంటే...

నది ఒడ్డున బారులు తీరి నుంచున్న భక్తులను ఒక్కొక్కరినే ఒకరి తర్వాత మరొకరిని పిలిచి వారి చెవిలో మంత్రోపదేశము చేయడానికి కనీసం ఒక నిముష సమయమైన పడుతుంది.

అటువంటిది ఆరు వందల మంది భక్తులకు మంత్రోపదేశం చేయడానికి ఆరు వందల నిముషాలు పడుతుంది. అంటే కనీసం పది గంటలు పడుతుంది.

పోనీ, ఒక భక్తుడికి మంత్రోపదేశం చేయడానికి అరనిముషం పట్టినా దాని వ్యవధి ఐదు గంటలు పడుతుంది.

అయితే అమ్మమాత్రం వారందరికీ కేవలం రెండున్నర గంటల కాలవ్యవధిలోనే ఆ మంత్రోపదేశం చేసిందంటే వారికి తెలియకుండానే కాలగమనాన్ని కనీసం సమయం

ఐదు గంటలనుంచి రెండున్నర గంటల సమయానికి కుదించినదన్న మాట. ఇప్పుడు ఆ స్థలంలో నది ఒడ్డున దాని జ్ఞాపకార్థం ఒక ఘాట్‌ని కూడా నిర్మిస్తున్నారు.

ఇకపోతే- ఆనాటి అనసూయ మాత బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను బిడ్డలుగా మార్చి తన ఒడిలో నిడుకుని లాలిస్తే-

ఈనాటి మన అనసూయమ్మ తనకన్నా వయసులో పెద్దవారూ, తలలు పండిన వృద్ధులూ అయిన ఋషి పుంగవులు తన వద్దకు వస్తే వారిని తన వొడినందిడుకుని అన్నం ముద్దలు కలిపిపెట్టేది. వారిలో ముఖ్యులూ, ప్రముఖులూ అయిన శ్రీవాసుదాస స్వామి, శ్రీ పూర్ణానందస్వామి, కాశీలో నివసించే శ్రీ ఆత్మానందస్వామి, శ్రీ లక్ష్మణ యతీంద్రులు, కుర్తాళం పీఠాధిపతి శ్రీ సిద్ధేశ్వరానందస్వామి మొదలైనవారున్నారు.

పైన చెప్పుకొన్నవన్నీ అమ్మ పెద్దవయసులోనూ, ఇంకా ముగ్గురు బిడ్డల తల్లి అయిన తరువాత జరిగిన సంఘటనలు.

ఇక అమ్మ చిన్నపిల్లగా, అంటే... నాలుగు సంవత్సరాల వయసులో చేసిన అద్భుతాలు ఎన్నెన్నో.

అమ్మ తన తల్లి గర్భంలోంచి యీ భూమ్మీద పడుతూనే చేసిన అద్భుతాలను గురించి మనం చదువుకున్నాం.

ఇప్పుడు మనం మరికొన్ని అమ్మ ఇంకా నెలల పాపగా వున్నప్పుడు చూపిన మహిమలను గురించి తెలుసుకుందాం.

అలనాడు అంధుడైన ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణుడు ఒక్క క్షణకాలంపాటు తన విశ్వరూపాన్ని చూపిన విధంగా అమ్మ తన మూడునెలల వయసులోనే తనను చూడగోరిన ఒక అంధురాలికి తనను చూసేందుకై చూపును ప్రసాదిస్తుంది.

అంతేకాదు... మూడోనెల వచ్చిన తనకు (అమ్మకు) ముద్దకుడుముల వేడుక చేయటంలో మరిడమ్మ మామ్మగారికి (తన తండ్రికి మేనత్త... తనకు అమ్మమ్మ వరుస) సహాయం చేస్తుంది.

ఆ రెండు వైనాలనూ ఇక్కడ గమనిద్దాము.

ముందుగా ముద్ద కుడుములు... (పే.15- జీవిత మహోదధి)

"మరిడమ్మగారు నానబోసిన బియ్యం బుట్టను వడవేసి పనిచేసే ఖాదర్‌బీని పిలచి "బియ్యం పోటెయ్యమ్మా!" అని రోటిలో బియ్యం పోసి జల్లెడ కోసం లోపలకు వెడుతుంది. తాతమ్మ చెప్పిన మాట ఖాదర్‌బీకి వినబడక యేదో పని చేసుకుంటూ వుంటుంది. అయితే తాతమ్మకు ఇంట్లో దంపుడుపోటు వినబడుతుంది. కానీ, ఖాదర్‌బీ కనబడదు. పోటు

వినబడుతుంది. బియ్యం మెదిగి వుంటాయి. తాతమ్మగారు ఆశ్చర్యపడి "ఎవరైనా ఇటువచ్చి వెళ్ళారా?" అని అక్కడ వున్న తాతగారిని (అమ్మ తండ్రి సీతాపతిగారిని) చూసి అడుగుతుంది.

తాతగారు "నేను చూడలేదు. ఇప్పుడే వచ్చా"నంటాడు. మామూలుగా వచ్చే పోయే వారిని అడుగగా మేమెవరినీ చూడలేదంటారు.

రోటిలో తలపెట్టి తాతమ్మగారు ఆ శబ్దాన్ని గమనిస్తుంది. నెమ్మదిగా శబ్దము వినబడుతూనే వుంటుంది. జల్లెడ పట్టనవసరము లేకుండా పిండి తయారై, పోసిన బియ్యానికి మించిన పిండి వచ్చును. ఇదంతా చూసి తాతమ్మగారు తన శరీరములో శక్తిలేదని తను చెయ్యక తప్పదని తన యిష్టదైవమయిన గురువుగారు, పాతగుంటూరు మల్లెల రత్తమ్మగారు తనకు సహాయపడ్డారని వారి ప్రార్థన చేస్తూ ఆనందపడుతూ అమ్మకు ఆ వేడుక చేయు పనులను ప్రారంభం చేస్తారు.

తరువాత అమ్మమ్మగారు (అమ్మ తల్లి రంగమ్మగారు) లేచి ముఖము కడుక్కొని, అమ్మకు గొల్లనాగమ్మ చేత స్నానము చేయించి బొట్టు పెట్టబోగా అమ్మ ముఖాన బొట్టు పెట్టే వుండును. బొట్టు యెర్రగా మెరుస్తూ వుండును. నాయనమ్మ పెట్టినదేమో నని అమ్మమ్మ, తాతమ్మ (మరిడమ్మ)గారి నుద్దేశించి "నాయనమ్మా! పిల్ల ముఖాన బొట్టు నీవు పెట్టావా?" అని అడుగగా, "నేనెరగనమ్మా! నా పిండి క్షోభలో నేనున్నానమ్మా! నాకు ఎవరయిందీ తోచక (పిండిని ఎవరు దంపిందీ తెలియక) ఆలోచిస్తున్నాను. అదీ (అమ్మకు బొట్టు పెట్టడం) అట్లాగే జరిగిందా? వెనకటికి సక్కుబాయికి కృష్ణపరమాత్మ సహాయము జరిగినట్లుగా మనకు మల్లెల రత్తమ్మగారి సహాయమేమో!" అని బెల్లం తరిగి పొయ్యిమీద పెట్టి, కట్టెలు ఎంత విసిరినా మండకపోవుటచే విసుగుతో పొయ్యిలో నీళ్ళు పోసి వెళ్ళిపోతూ "అన్నీ ఆ తల్లే (మల్లెల రత్తమ్మ) చేసుకుంటుందని మూతబెట్టి దొడ్లోకి వెడుతుంది.

తరువాత ఆమె వచ్చి పొయ్యిమీద వున్న భాండము మీద మూత తీసి చూడగా పాకము వచ్చియే వుండును. అంతకుముందు నీళ్ళుపోసి ఆర్పివేసిన పొయ్యి మళ్ళీ సన్నగా మండుతూనే వుండును."

భక్త పాఠకులారా! మూడునెలల పసిపాప అయిన అమ్మ రోట్లో బియ్యమును దంపించి పిండిని చెయ్యటమేకాక, నాగమ్మ తనకు స్నానము చేయించిన తరువాత, తన తల్లి రంగమ్మగారు వచ్చి బొట్టు పెట్టబోయినంతలో అమ్మ తన ముఖాన తనే బొట్టు పెట్టుకొన్నదంటే ఆ తరువాత రంగమ్మగారు విసుగుతో ఎంతకీ మండని పొయ్యిలో నీళ్ళుపోసి ఆర్పివేసి వెళ్ళిపోగా మళ్ళీ ఆమె తిరిగి వచ్చేంతలో ఆ పొయ్యిని మండించి భాండములో నున్న బెల్లము పాకము అయ్యేలా చేసిందంటే... ఇవన్నీ అమ్మగా ఈ భువిపై అవతరించిన ఆ పరబ్రహ్మమే, ఆ ఆదిపరాశక్తియేగాని వేరొకటి కాదు.

మరి, అదే సమయంలో తనను చూడవచ్చిన ఒక అంధురాలికి అమ్మ చూపును ఎలా ప్రసాదించిందో ఇప్పుడు గమనిద్దాం. (పే.16– జీవిత మహోదధి)

"ముద్దకుడుములు తీసుకుందామని వచ్చిన ముత్తయిదువు పేరు కాకునూరు లక్ష్మాయమ్మగారు "పిల్లను చూద్దామంటే కళ్ళు లేవుగా అమ్మా! చేతికన్నా ఇవ్వండి పట్టుకుని చూస్తా" అన్నది.

ఆ మాటకు అమ్మమ్మ (అమ్మ తల్లి రంగమ్మగారు) అమ్మను ఆమె చేతిలో పెట్టును. లక్ష్మాయమ్మగారు పిల్లను (అమ్మను) అందుకుని ముద్దుపెట్టుకోపోగా మెరుపు మెరిసినట్లు అమ్మ కళ్ళు రెండూ ఆమె కళ్ళలోకి కిరణములు గుచ్చుకుపోయినట్లుగా అయి చేతిలో అమ్మ అమ్మగానే వుండి వేరొక అయిదు సంవత్సరాల పిల్లగా కనబడును.

అంతే... వెంటనే ఆమె (లక్ష్మాయమ్మ) "అమ్మా! మరిడమ్మా!" అని కేకవేసి, "నీ సన్నిధికొచ్చిన వేళ ఎంత అదృష్టమమ్మా! ఏదో ఒక దివ్యదర్శనమైనది నీ శక్తివల్ల..." అన్నది."

పాఠక మహాశయులారా! లక్ష్మాయమ్మ అనుకొనటం అది మరిడమ్మగారి మహిమ అని. అటు మరిడమ్మగారు అనుకోవటం అది కేవలం తమ ఇష్టదైవమైన మల్లెల రత్తమ్మగారి మహిమ అని.

అయితే, పైన జరిగిన ఆ దర్శనాలన్నీ కేవలం మూడునెలల పసిపాప రూపంలో వున్న ఆ ఆదిపరాశక్తి, మన అనసూయమ్మదే అని వారికి తెలియదు.

అలా తెలిస్తే, అసలు మరిడమ్మగార్కి 'మల్లెల రత్తమ్మగారు' అనే గురువు వుండి వుండకపోతే, మూడునెలల పసివయసులోనే మన అనసూయమ్మ పరబ్రహ్మగా, ఆది పరాశక్తిగా లోక విదితమై వుండేది.

మరి, పాలుగారే, పాలు త్రాగే ఆ చిన్నవయసులోనే గదా మన చిన్నికృష్ణుడు పూతన మొదలగు రాక్షసులను సంహరించింది!

తను భూమ్మీద పడుతూనే అలనాటి పురిటి కృష్ణుడు కూడా తన మాయచే మధురలో తన జన్మస్థానమైన బందిఖానా చుట్టూ కావలిగా వున్న రాజభటులను మైకంలో ముంచి చెరసాలనుండి తనను బైటకు చేరవేసిన తన తండ్రి వసుదేవునకు సహాయపడ్డాడు.

అమ్మకూడా తను భూమ్మీద పడుతూనే తనకు కీడు తలబెట్టబోయిన శునకాన్ని మైకంలో ముంచింది. అలాగే తనను కాటువేయబోయిన తేలును కూడా మైకంలో ముంచి తన పక్కలో పడుకోబెట్టుకున్నది.

తరువాత ఒక దేవతకు హాని తలబెట్టబోయినందుకు అవి తనువును చాలించిన వనుకోండి. అది వేరే విషయం.

అందుకే అమ్మలో అనసూయ, రాజరాజేశ్వరిల తత్త్వమే కాదు, శ్రీకృష్ణుని సారూప్యత, అంశ కూడా ఇమిడి వున్నది.

శ్రీకృష్ణ పరమాత్మ రాజవంశములో జన్మించినా, యాదవ (గొల్ల) వనిత యశోదమ్మ వద్ద పాలు గుడిచి పెరిగినట్టుగానే, అమ్మ ఒక శ్రోత్రియ బ్రాహ్మణ వంశములో జన్మించినా, పైన మనం చదువుకున్నట్టు అమ్మకు స్నానం చేయించిన గొల్లనాగమ్మ వద్దనే అమ్మ తను పుట్టిన ముప్పయవ రోజునుండి తనకు పదిహేను నెలల వయసు వచ్చేవరకూ ఆ గొల్లవనిత చనుగుడిచి, ఆమె ఇంటివద్దనే పెరుగుతుంది.

ఎందుకంటే... పుట్టినప్పటినుంచీ అర్భకంగా వున్న పిల్లను (అమ్మను) అనారోగ్యంతో బాధపడుతున్న రంగమ్మగారు సరిగా చూడలేకపోవటం చేత, మరిడమ్మగారు అమ్మ పెంపకాన్ని గొల్లనాగమ్మకు అప్పగిస్తారు. పసిపాప తల్లి అయిన గొల్లనాగమ్మ కూడా తన వుగ్గుపాలతో తన బిడ్డలతో బాటుగానే అమ్మను కూడా పెంచుతుంది. మన్నవ వున్న వూరే కాబట్టి మధ్య మధ్యలో తీసుకువచ్చి అమ్మను ఇంట్లోవారికి చూపిస్తూ వుంటుంది.

అమ్మ అలా తనకు పదిహేను నెలల వయసు వచ్చేవరకూ గొల్ల నాగమ్మ వద్దనే పెరుగుతూ పారాడే వయసు వచ్చాక గొల్లనాగమ్మ కంచంలోనే అన్నం తింటూ గడుపుతుంది. అంటే ఒక విధంగా అమ్మకు అన్నప్రాశన కూడా అక్కడే జరిగిందన్నమాట.

ఇక అమ్మ చూపిన శ్రీకృష్ణుని లీలలను కూడా ముందు ముందు చదివి తెలుసుకుందాం.

ఇంతకీ మనం చదువుకుంటున్నది అమ్మ పసివయసులోనే ఒక అంధురాలికి చూపునిచ్చిన విషయం కదూ!

అప్పుడే కాదు... అమ్మ పెద్దవయసులో అంటే తన నడివయసులో, పుట్టు గ్రుడ్డివాడైన కాసు రాధాకృష్ణారెడ్డి అనే వ్యక్తికి కొంతకాలంపాటు చూపును ప్రసాదించింది.

ఆ వైనాన్ని మనమిప్పుడు తెలుసుకుందాం.

గుంటూరు జిల్లా అమరావతి మండలం తురగా వారి పాలెం గ్రామస్థులైన కాసు వెంకటేశ్వరరెడ్డి, కాసు రాధాకృష్ణారెడ్డి సోదరులు పుట్టుగ్రుడ్డివారు.

వారిరువురూ కలసి 1952-62 మధ్యకాలంలో విజయనగరం వెళ్ళి, అచ్చటి మహారాజావారి సంగీత కళాశాలలో సంగీతం నేర్చుకున్నారు.

అమృతవర్షిణి రాగాలాపన చేసి వర్షం కురిపించిన శ్రీ డొక్కా శ్రీరామ్మూర్తి గారి శిష్యరికం చేసి సంగీతంలో ప్రావీణ్యత పొందారు వీరు. ముఖ్యంగా కాసు రాధాక్రిష్ణారెడ్డిగారు వారి గురువుగారిచే "నాదోపాసక" అని పిలువబడుతూ వుండేవారు.

సంగీతం నేర్చుకుని స్వగ్రామం వచ్చిన తరువాత కొంతకాలం అచ్చటనే వుండి, తరువాత దైవాన్వేషణ చేయాలని బయలుదేరారు.

వీరు సంగీతంలోనే గాక ఆధ్యాత్మికంగా కూడా పరిణితి చెందినవారు. వారిలో వెంకటేశ్వరరెడ్డి సన్నగా వున్నా రాధాకృష్ణారెడ్డి మంచి దృఢకాయుడు.

వీరి దైవాన్వేషణ కార్యక్రమంలో ప్రఖ్యాతి చెందిన యోగులు, మహాత్ములకు ఒక పరీక్ష పెట్టేవారు.

అదేమిటంటే... నాభి (బొడ్డు)నుండి ఓంకారనాదం చేస్తూ అవతలివారి శరీరం మీద గుద్దితే వారు తట్టుకోవాలి. అలా తట్టుకుంటేనే వారు ప్రణవ స్వరూపులు. లేకుంటే కాదు.

వీరు తమ విద్యను ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి గాంచిన, పేరొందిన యోగిపుంగవుల మీద, మహిమాన్వితుల మీద ప్రయోగించి చూశారు.

వీరిరువురు సోదరులూ కొట్టిన దెబ్బలకు అవతలివారు దృఢకాయులైనా వీరి ధాష్టీకానికి తట్టుకోలేకపోయేవారు.

అలా వీరి దెబ్బలకు తట్టుకునే వారెవరూ లేరేమో ననుకుంటున్న సమయానికి శ్రీ వేదాంతం లక్ష్మీపతి అనే జిల్లెళ్ళమూడి అమ్మ భక్తుడు వీరిని అమ్మ దగ్గరకు వెళ్ళి ప్రయత్నించమని సలహా ఇచ్చాడట.

ఆమె ఆ గ్రామ కరణంగారి భార్య అయినా స్వయంభూ పరమాత్మగా ఆవిర్భవించినదని పై అన్వేషణకు వెళ్ళి ఆమెదగ్గర కొనసాగించమని సలహా యిచ్చారు.

దానికి వారు ఎంతో ప్రఖ్యాతి చెందిన యోగులే మా ప్రయోగానికి తట్టుకోలేకపోయారు. ఒక సామాన్య కరణంగారి భార్య ఏమిటి? స్వయంభూ పరమాత్మ ఏమిటి? ఏమైనా ఒకసారి చూడాలని సోదరులిద్దరూ జిల్లెళ్ళమూడి బయల్దేరి వెళ్ళారట.

వారు బాపట్ల చేరి, అక్కడనుండి రిక్షా చేసుకుని జిల్లెళ్ళమూడి 'ముఖద్వారము' అనబడే ఏడవ మైలు (బాపట్ల నుండి పెదనందిపాడు వెళ్ళే మార్గము) వద్ద రిక్షానుండి దిగి, జిల్లెళ్ళమూడికి నడిచి వెడదామనే తొలి ప్రయత్నములోనే అమ్మ వారిరువురికీ తనేమిటో తెలియజేసింది.

అప్పటికే బాగా వాన కురియడంతో దారి అంతా జారూ బురదగా వుంది. ఆ సోదరులలో రాధాకృష్ణారెడ్డి రిక్షాదిగి రెండడుగులు వేసాడో లేదో కాలుజారి బొక్క బోర్లా ముందుకు మట్టిబురదలో పడ్డాడట.

అక్కడనుండి జరిగిన సంఘటనలను శ్రీ మన్నవ దత్తాత్రేయ శర్మగారు వ్రాసిన "లోకబాంధవి-అనుభవాల వల్లరి" అనే గ్రంథంలో ప్రచురించిన విషయాల ద్వారా సేకరించి మీ ముందుంచడం జరిగింది. చదివి తెలుసుకోండి. (పే. 118-"లోకబాంధవి-అనుభవాల వల్లరి.)

"వెంటనే ఆ మట్టినుండి యాలకులు మొదలైన సువాసన ద్రవ్యాలు కలిపి చేసిన అరిసెల వాసన వచ్చింది. అసలే మంచి తిండిపుష్టి వున్నదేమో, ఆ మట్టిని పెద్ద తిరుపతి లడ్డంత మోతాదులో తిన్నారు రాధాకృష్ణారెడ్డి. రాధ చెబుతుండేవాడు. పల్లెటూళ్ళలో "నా జోలికి వస్తే మట్టి కరిపిస్తానని అంటుంటారని." ఈ మాట చెబుతూ మొదటిసారి ఏడవ మైలులో దిగగానే అమ్మ తనను అలా చేసిందని ఆ తరువాతి రోజులలో అనేవాడు. అక్కడ నుండి జిల్లెళ్ళమూడి చేరారు.

అమ్మను కూడా వారి పద్ధతిలో బండపరీక్షలు పెట్టేవారు ఆ అన్నదమ్ములు. అమ్మ వీరిచేత ఆ దెబ్బలు తింటూనే అందరికీ దర్శనం యిస్తూ, ప్రసాదాలు పెడుతూ వుండేది. వారు అమ్మను పెట్టే బాధలు చూచి, కొంతమంది వారిని వెళ్ళగొట్టాలని, బెదిరించాలని ఆలోచిస్తే అమ్మ "వాళ్ళ మీద చెయ్యిపడితే నామీద పడినట్టే. వారి సంగతి నేను చూసుకుంటాను. వాళ్ళను ఎవరూ ఏమీ అనవద్దు" అని ఆపింది.

ఒకసారి 'అడిగినంత పెట్టాలి' అనే వారి కోరిక మేరకు అమ్మ ఇద్దరికీ అరచేతి మందాన పెద్దసైజు గారెలు చెరొక ఐదు వందలు పెట్టడం జరిగింది. అవిగాక చెరొక బకెట్ పాయసం త్రాగి మళ్ళీ మధ్యాహ్నం వారి మామూలు భోజనం చేశారు.

వందమందికి అమ్మ దర్శనం ఇస్తున్నప్పుడు ఆ సమయంలో వెంకటేశ్వరరెడ్డి "ఒసేయ్, అమ్మా! కాఫీ తెప్పించవే" అని విసురుగా అనేవాడు. అమ్మ తన సహజ ప్రశాంత వదనంతో కాఫీ తెప్పించి ఇచ్చేది. ఈ విధంగా వారు నలభై రోజులు వున్నారు.

వారి పరిధికి మొదటిసారి పర్యటనలో ఏమీ కనబడలేదు. కానీ గ్రహిస్తే చాలా వున్నది. తరువాత ఇద్దరూ వూరికి వెళ్ళారు.

కొంత కాలం గడిచిన తరువాత రాధాక్రిష్ణారెడ్డి ఒక్కడే మళ్ళీ జిల్లెళ్ళమూడి వచ్చాడు.

రెండవసారి మళ్లీ అదే పద్ధతిలో పరీక్ష మొదలుపెట్టాడు.

రెండవసారి అమ్మ వివిధ దేవ, దేవీ రూపాలతో దర్శనం ఇచ్చారు. సీతారాములుగా, రాధాకృష్ణులుగా, శచీ పురంధరులుగా, పార్వతీ పరమేశ్వరులుగా ఈ విధంగా వివిధ రూపాలతో దర్శనం ఇచ్చారు. పురుష రూపంతో దర్శనం ఇచ్చినపుడు పురుష స్పర్శ, స్త్రీ రూపంలో దర్శనం ఇచ్చినపుడు స్త్రీ స్పర్శ కలిగేది రాధాక్రిష్ణారెడ్డికి. తరువాత అమ్మ

పాదాలనుండి రకరకాల వేదస్వరాలు, పంచాక్షరీ, గాయత్రీ, అష్టాక్షరీ ఈ విధంగా ఎన్నో మంత్రాలు వినబడినవి.

అమ్మను కొట్టేటప్పుడు అమ్మ ఒక ప్రణవ సముద్రమయితే, తనచేయి ఆ అలలకి తాకుతున్నట్లు అనుభూతయ్యేది అతనికి. అప్పుడు దత్తు (లోకబాంధవి రచయిత) "ఒక దేవతా రూపమో దేవుని రూపమో కనబడితేనే నిశ్చేష్టులమై పోతాము గదా! మరి ఇన్ని దేవదేవీ రూపాలుగా దర్శనమిచ్చినపుడు కూడ నువ్వు ఎట్లా కొట్టావురా? నువ్వు భస్మాసురుడివో, రావణాసురుడివో అయివుంటావని" రాధాకృష్ణారెడ్డితో అన్నారు.

అప్పుడు రాధాకృష్ణారెడ్డి "బంగారు ఖనిజం కోసం కొట్టడం మొదలుపెట్టాను. సత్తు, ఇత్తడి వస్తే ఆగుతానా? బంగారం వచ్చేవరకూ కొట్టాల్సిందే" అన్నాడు.

"దేవదేవీ రూపాలు కామరూపం ధరించినవారు చూపించగలరు. రావణాసురుడు కూడా మాయాసీతను సృష్టించాడు. సాధువు రూపం ధరించాడు. కనుక ఇటువంటివి చూసి పడిపోకూడదు. ఈ సహనం, సహజ సహనమవునా కాదా? గుణాతీతమవునా కాదా? ప్రణవస్వరూపం అవునా కాదా? అని అన్వేషణ మొదలుపెట్టాను" అన్నాడు."

పాఠక మహాశయులారా! రాధాకృష్ణారెడ్డి అలా కొన్నాళ్ళు అమ్మను తన సాధనా మార్గంలో అమ్మ నామాన్ని గానం చేస్తూ అమ్మను బాదుతూ అమ్మ చేతిముద్దలు తింటూ పెద్దగుడిలో పడుకుని కాలక్షేపం చేసేవాడు.

తరువాత కథ అంత్యదశను చేరుకున్న సమయానికి అతను అమ్మ సహనాన్ని పరీక్షించడం కాదు... అమ్మే అతని సహనాన్ని పరీక్షించదలచుకుందో ఏమో, అతని పై సాధనను అంతము చేసే విధంగా ఈ క్రింది సంఘటన జరిగింది. చదవండి (పే.119- లోకబాంధవి.)

"ఒకరోజు రాధాకృష్ణారెడ్డి తన బండచేత్తో నిర్విరామంగా ఐదు గంటలసేపు కీర్తనలు పాడుతూ అమ్మను కొట్టాడు. అంతసేపూ నిరామయంగా వున్న అమ్మ-

"ఏం నాన్నా! చేతులు నొప్పి పుడుతున్నాయా?" అని అడిగి నూనె తెప్పించి రాసింది అతని చేతులకు. దైవత్వం జయించలేనిది మాతృత్వం జయించింది.

అంతే... అమ్మయొక్క సహజ సహనం, గుణాతీతమయిన, భావాతీతమయిన ఆ దివ్య మాతృత్వానికి దాసోహమని అమ్మ పాదాల చెంత వ్రాలిపోయాడు.

భూమికూడా కంపిస్తుంది. పర్వతం కూడా బ్రద్దలై లావా ప్రవహిస్తుంది. ఈ కోమలమైన స్త్రీమూర్తి ఏమిటి? ఈ విధంగా కదలని, చెదరని మాతృవాత్సల్యం ఇట్లా కురిపిస్తున్నదని అమ్మ అఖండశక్తికి, పవిత్ర వాత్సల్యానికి అంజలి ఘటించి, తన జీవితాన్ని ఆమె సేవకు అంకితం చేసుకున్నాడు.

ఇక్కడ నిరామయంగా అమ్మ వున్నది అంటే అది శక్తివిహీనత కాదు. దివ్య వాత్సల్యం!

ఆ తరువాత సప్తసప్తాహాలు ఒక్కడే అమ్మనామం "జయహో మాతా! శ్రీ అనసూయా! రాజరాజేశ్వరి! శ్రీ పరాత్పరి!"తో చేశాడు."

భక్త పాఠకులారా! సప్త సప్తాహాలు చేయడానికి ముందు రాధాకృష్ణారెడ్డి అమ్మను వివిధ దేవీ, దైవరూపాలతో గాంచినది తన దివ్య చక్షువులతో.

దివ్య చక్షువు అంటే దివ్యదృష్టి గలవాడు అనేకాదు గ్రుడ్డివాడు అనికూడా అర్థమున్నది.

సాధారణంగా గ్రుడ్డివారు అలవాటు ప్రకారంగా చూపు లేకపోయినా తమ దైనందిన కార్యకలాపాలను చేసుకుంటూ వుంటారు. వారికి, తాము నివసిస్తున్న ఇంట్లో ఏ గది ఎటువైపున వున్నదో, ఏ వస్తువు ఎక్కడ వున్నదో ఎరుకనే. వారు ఇల్లు వదలి బయటకు వచ్చినపుడు కూడా ఒకసారి ఒక మార్గం వెంట పోతే ఆ మార్గము ఎంత దూరమున్నదో, ఎక్కడ ఏ మలుపు తిరుగుతుందో కూడా వారికి బాగా గుర్తు. అందుకనే వారు బయటకు వచ్చినపుడు అలవాటు పడిన రోడ్లవెంట చకచకా కళ్ళున్న వారికి వలె నడిచిపోతూ వుంటారు. వారి చెవులకు వినబడే శబ్దాన్ని బట్టి ఏ వస్తువు ఎంత దూరములో వున్నదీ తెలుసుకొనగలరు.

అది ఒక విధమైన దివ్యదృష్టి! అఖిదే 'దివ్యచక్షువు' అంటే. అది భగవంతుడు వికలాంగులకు ప్రసాదించిన వరం! ఆ వరం వల్లనే కాళ్ళూ చేతులూ లేనివారు తమ దైనందిన కార్యక్రమాలను నిరాటంకంగా చేసుకోగలుగుతున్నారు. అది భగవంతుడు వారికి కలిగించిన సౌకర్యం.

అలాగే కళ్ళు లేనివారికి బయట ప్రపంచం కూడా కళ్ళున్నవారికి వలెనే కనబడుతుంది. పోతే దానికి కాస్త ఊహాశక్తి కూడా తోడ్పడుతుంది.

అయితే అమ్మ రాధాకృష్ణారెడ్డికి ఇచ్చినది మాత్రం మహిమాన్వితమైన దివ్యదృష్టి. అందుకే అతనికి వివిధ దేవీ దేవతల దివ్య దర్శనాలు మాత్రమే కాదు... ఆయా రూపాల స్త్రీ పురుష స్పర్శలు కూడా అతని శరీరానికి కలిగించింది... అమ్మ!

అందుకే అతడు అమ్మకు మనసా, వాచా, కర్మణా దాసోహమయిపోయినాడు.

అయితే ఆయనకు అమ్మ చూపును ప్రసాదించింది మాత్రం అతడు సప్తసప్తాహాలు అమ్మనామం చేసిన తరువాతే.

ఆ వైనం క్రింద చదవండి! (పే.120- లోకబాంధవి)

"సప్త సప్తాహాల అనంతరం కొన్నిరోజులకు కళ్ళు వున్నవారికి కనబడినట్లు కొన్నినెలలపాటు రాధకి కూడా కనబడింది. ఈ ప్రపంచం, మనుష్యులు సర్వం కనబడినవి.

అప్పుడు అనుకున్నాడట– "కళ్ళు లేని వికలాంగులు, వాళ్ళు నిగ్రహంతో వుండటం ప్రధానం, గొప్ప కాదు. అన్నీ వున్నవాళ్ళు నిగ్రహంతో వుండటం విశేషం, గొప్ప" అని.

అలా రాధకి కళ్ళు కనబడటం కొంతకాలం జరిగిన తరువాత అమ్మ రాధని అడిగింది. "ఏం నాన్నా రాధా! నీకు కళ్ళు ఇంకా కావాలా?" అని.

అప్పుడు రాధ "ధృతరాష్ట్రునికి కృష్ణుడు కొన్ని క్షణాలు మాత్రమే కళ్ళు ఇచ్చాడు. నువ్వు నాకు కొన్ని నెలలు ఇచ్చావు. ఇంక అవసరం లేదు" అన్నాడు.

అలా ఆయన చెప్పిన తరువాత మళ్ళీ అతనికి అంధత్వం వచ్చింది.

ఈ విధంగా అమ్మ సాక్షాత్తూ పరమాత్మ అని నమ్మిన రాధకు రెండు అనుభవాల ద్వారా తన సర్వ సమర్థతను నిరూపించింది."

భక్త పాఠకులారా! ఇప్పుడు తెలిసిందిగా. తనయందు నమ్మకం విశ్వాసం వుంచిన వారికి భగవంతుడు వివిధ నిదర్శనాల ద్వారా తన ఉనికిని తెలియచేస్తాడు అని.

అందుకే 'విశ్వాసమే భగవంతుడు' అని తెలియజేసింది అమ్మ. అయితే ఆ విశ్వాసం కలగడానికి దేవుడు ఎన్నో పరీక్షలు పెడతాడు మరి. ఆ పరీక్షలలో నెగ్గాలి. మనకు సులువుగా, సునాయాసంగా దేవుడు కనబడితే ఆయన మీద మనకు విశ్వాసం కుదరదు.

అసలే రాధ ఆవేశపరుడు. తనకు కళ్ళు వుంటే ఆ చూపుతో ఈ లోకంలోని కుళ్ళునీ, కుచోద్యాన్నీ (అసూయ, ఈర్ష్య) చూచి ఆవేశపడి నిగ్రహం కోల్పోయి ఏ అఘాయిత్యాన్ని చేస్తానో నని భయపడి రాధాకృష్ణారెడ్డి అమ్మను ప్రార్థించి మరీ అంధత్వాన్ని తెచ్చుకుని వుంటాడు.

అటువంటి రాధాకృష్ణారెడ్డి అమ్మ ఆలయప్రవేశం చేసిన తర్వాత పన్నెండు సంవత్సరములకు అనారోగ్యం పాలయి, బాపట్లలో అమ్మకు అత్యంత ఆప్తురాలు అయిన డా॥ ఇనజాకుమారి నర్సింగ్‌హోమ్ (హైమా నర్సింగ్‌హోమ్)లో వైద్యం చేయించుకుంటూ 1996 అక్టోబర్ 23 వ తేదీన తుదిశ్వాస విడచి అమ్మలో ఐక్యం అయినాడు.

ఆయన సమాధి జిల్లెళ్ళమూడి ఊరి శివారులో ఏడో మైలునుంచి జిల్లెళ్ళమూడి వెడుతుంటే ఎడమవైపున చిన్నగుడిలాగా, లోపల చిన్న వినాయకుడి విగ్రహంతో మనకు దర్శనమిస్తుంది.

అంటే జిల్లెళ్ళమూడి అనే అమ్మ మహాదుర్గానికి రాధ కావలి భటుడన్నమాట!

# అమ్మ జ్ఞానప్రదాయిని-ప్రాణప్రదాయిని

ఇప్పుడు మళ్ళీ అమ్మ బాల్యదశలోని మహిమలను గురించి చెప్పుకొందాము.

అంతేకాదు, ఒక్కరోజు కూడా బడికి వెళ్ళి చదువుకోని అమ్మ భాషా పరిజ్ఞానాన్ని, తత్త్వచింతనను గురించి కూడా తెలుసుకుందాము.

ఈ ప్రకరణములో అమ్మ తన నాలుగవయేట ముత్తాయపాలెం సముద్రపుటొడ్డున ఒక జాలరికి తన దివ్యదర్శనంతో బాటు జ్ఞానోదయాన్ని కూడా కలిగించినట్టుగానే, ఇప్పటి తన అయిదారు సంవత్సరముల వయసులో బాపట్ల రైల్వేస్టేషన్ వద్ద మస్తాను, అంకదాసు అనబడే పోలీసులకు జ్ఞానోదయంతో బాటు తానేమిటో తెలియజెప్పింది.

అమ్మ బాపట్లలో తన పినతాతగారు చంద్రమౌళి చిదంబరరావు గారింటి వద్ద నుండగా జరిగిందీ సంఘటన.

అమ్మ తాతగారిల్లు బాపట్ల రైల్వేస్టేషనుకు దగ్గరలోనే వుండటంతో అమ్మ ఎప్పుడూ ఒంటినిండా నగలతో స్టేషన్ పరిసరాలలోనే తిరుగుతూ ఆడుకుంటూ వుండేది.

ఆ కాలంలో అమ్మను గురించి తాతగారు తప్ప ఎవరూ పట్టించుకునేవారు కాదు. ఎందుకంటే అమ్మ తన నాలుగవ ఏటనే తల్లిని పోగొట్టుకొనటం వల్ల అమ్మ అంటే ఆ యింట్లో, ముఖ్యంగా అమ్మకు పినతల్లి వరస అయిన భారతి (చిదంబరరావుగారి పుత్రిక)కి, అలాగే తెనాలిలో అమ్మ మాతామహులు వెంకట సుబ్బయ్యగారికి, ఆయన భార్య (అమ్మకి అమ్మమ్మ) జానికమ్మ మొదలైన వారికి అమ్మపట్ల నిరసన భావం ఏర్పడి ఆమె రాకపోకలను గురించి ఎవరూ అడిగేవారు కారు. ఇక అమ్మ అంటే అభిమానం వున్నా, చిదంబరరావుగారికి తన లాయర్ పనుల్లో వున్నప్పుడు అమ్మను గురించి పట్టించుకునేందుకు వీలు కలిగేది కాదు.

ఆ సందర్భంలో అమ్మ ఒకనాడు సాయంత్రం స్టేషన్ దగ్గరలో వున్న మర్రిచెట్టు క్రింద కూచుని రైలుదిగి వచ్చేపోయే ప్రయాణీకుల్ని చూస్తూ వుండగా మస్తాన్ అనే పోలీసువచ్చి, అమ్మను చూసి ఆమె వొంటినున్న నగలమీద ఆశపడి, ముఖ్యంగా ఆమె మెడలోని పులిగోరును కాజేద్దామనే ఉద్దేశ్యంతో దానిమీద చేయిపెట్టి లాగుతాడు. అది రాదు. గట్టిగా లాగుతాడు. అది రాదు సరికదా అతని చేయి నొప్పిపుడుతుంది.

అతని అవస్థను చూసిన అమ్మ ఏం చేసిందో ఇక చదవండి. (పే.52-జీవిత మహోదధి.)

"అమ్మ: నీ చెయ్యి నొప్పి పుడుతుంది. నేను ఇస్తాలే! నేను ఒక సంగతి అడుగుతాను చెప్తావా?

పోలీసు: ఆ... చెప్తా. ఇస్తానంటే చెప్తా.

అమ్మ: ఎందుకివ్వను! మాట అంటే ఏమిటో ఎప్పుడన్నా విన్నావా? అర్థం తెలుసునా? మాట అంటే మారుమాటలేని మాట. ఆ మాటనేమంటారంటే మంత్ర మంటారు. ఉత్తములకు మంత్రం, మామూలు వారికి మారుమాటలేని మాటకు సంఘంలో యే తంటా లేదు. చాలా తంటాలు పడుతున్నామంటారే, నీలాంటి మారుమాట గలవారే. ఇంతకూ చెప్తావా?

అని పులిగోరు తీసి చేతిలో పట్టుకుని...

"ఇక చెప్పు" అంటుంది.

పోలీసు: అడుగు.

అమ్మ: చెయ్యి పట్టు.

పోలీసు చెయ్యిపడతాడు.

అమ్మ అతని చేతిలో పులిగోరు పెట్టి, పులిగోరు మీద అమ్మ చెయ్యి పెట్టి...

"ప్రమాణపూర్తిగా చెప్పు. ప్రమాణమంటే భయం లేదులే. ప్రమాణాలకు చాలా అర్థాలున్నాయి. ఇక్కడ మనస్ఫూర్తిగా అని. నీకు ప్రమాణం నేనేలే.

అని పోలీసు వంక చూడగా పోలీసు అమ్మ ముఖము వంక చూస్తూ, ఆ ముఖములో వుండే మార్పులు గుర్తిస్తూ...

"అడుగమ్మా!" అంటాడు.

అమ్మ: అసలు నీ వుద్యోగమేమిటి? అది వివరించి చెప్తావా నాయనా?

పోలీసు: యెవరు లోపాలు చేసినా కనిపెట్టి వారిని పట్టుకుని జైలులో పెట్టడం.

అమ్మ: లోపమంటే?

పోలీసు: దొంగతనం చేసినా, యెవరినైనా చంపినా, యింకా నీకర్థం కావు. చాలా వున్నాయిలే.

అమ్మ: ఇప్పుడు నీవు చేసినదేమిటి? యిది దొంగతనం కాదా? మీకు తప్పు లేదా? నిన్నెవరు పట్టుకుంటారు? ఇంకొక పోలీసు పట్టుకుంటాడా? లేక అందరూ ఇంతే చేస్తారా? ఒకరి నొకరు మీలో మీరు అరెస్టు చేయరా? మీకు తప్పు లేదని చెప్పిందా గవర్నమెంటు?

అని అమ్మ పెద్దగా అంటూ పోలీసు ముఖము వంక చూడగా ఆ పోలీసునకు అమ్మ ముఖములో అరుణోదయమైన కాంతి గోచరించి, అమ్మ ముఖము కనిపించకుండా పోయి ఆ కాంతే నిలబడును... పదిహేను నిమిషముల పాటు.

మస్తాను పోలీసు తనచేతిలోని పులిగోరును అమ్మ మెడలో వేసి సమాధానము చెప్పక అమ్మను ఎత్తుకుని తన లైను వైపునకు వెడతాడు (పోలీసుల ఇళ్ళకు.)

ఆ రాత్రి కొంతమంది పోలీసులు చేరి అమ్మను దగ్గర కూచోబెట్టుకుని వారిలో వారు మాట్లాడుకుంటూ వుంటారు. అమ్మకు తెలియకుండా ఉర్దూభాషలో అమ్మకు, తనకు జరిగిన సంభాషణను మిగతా పోలీసు వారికి చెబుతాడు. ఆ చెప్పేదానిలో ఒకమాట తప్పు చెబుతాడు.

అప్పుడు అమ్మ అందుకుని...

“నేనదేనా అన్నది. అబద్ధమాడతావేం? ఉన్నది వున్నట్టు చెప్పు. కాదు కాదు. ఉన్నది చెప్పలేవు కూడా. జరిగింది జరిగినట్లు చెప్పు” అంటుంది.

అలా అంటున్న అమ్మను చూసి అక్కడ వున్న అందరూ బిత్తరపోతారు. అందులో ఒక పోలీసు చూసి “ఇదేదో మహత్తరమైన శక్తిలా వుంది. జరిగింది నీవు చెప్పమ్మా!” అంటాడు.

అమ్మ అన్నీ వివరించి చెప్పగా ఆ పోలీసు విని కొన్నిమాటలు గుర్తు రాసుకుంటాడు. రాత్రి పన్నెండు గంటలకు అమ్మను తిరిగి ఇంటికి తీసుకువచ్చి యిద్దరు పోలీసులు దిగవిడిచి పోతారు. అమ్మ ఆ రాత్రి ఇంటి బయట అరుగుల మీద పడుకుని తెల్లవారి ఇంట్లోకి వెడుతుంది.”

పాఠక మహాశయులారా! తెలిసినవిగా అమ్మ మహిమలు.

అంత బాల్యంలోనే అంటే... అయిదారు సంవత్సరముల వయసులోనే, అంతకు ముందు ముత్తాయిపాలెం సముద్రపుటొడ్డున తన వంటిమీద ఆభరణాలను దొంగిలించి తనను సముద్రంలోకి విసరివేసిన వెంటనే ఆ జాలరికి చూపిన కాంతిపుంజాన్నే, ఇక్కడ బాపట్ల రైలుస్టేషన్ వద్ద తన మెడలోని పులిగోరును తస్కరింపజూసిన పోలీసు మస్తానుకు కూడా అమ్మ చూపించింది.

అంతేకాదు, అంత పసివయసులోనే, బడిలో చేరి అ,ఆ లు కూడా నేర్వని ఆ పసిపాప, పైన పోలీసులు మాట్లాడుకుంటున్న ఉర్దూ భాషలో తప్పొప్పులను గుర్తించి వాటిని వారికి ఎత్తి చూపించి, సరిదిద్దింది. దానికి వారు బిత్తరపోయారు.

ఇక్కడ మనం ప్రత్యేకంగా చెప్పుకోవలసింది ఏమిటంటే–

దేవతలకు ఈ లోకమంతా ఒకటే. ఈ లోకంలోని ప్రాంతాలకు, వాటిలో గల భాషలకు వారు అతీతులు. అన్ని ప్రాంతాలూ వారివే. అన్ని భాషలూ వారివే.

అలాగే ఏమాత్రం చదువు లేని అమ్మ, ఆ తరువాతి కాలంలో వేదవేదాంగాలకు భాష్యం చెప్పి, వాటి సారాన్నంతా రంగరించి "అం-ఆ' అనే రెండక్షఱములలో నిక్షిప్తపరచిన ధీశాలిని!

కారణం... ఆమె అమ్మగా వ్యక్తమయే ఆదిపరాశక్తి!

ఆమెకు ఒక్క ఉర్దూనే కాదు, పాశ్చాత్య భాషలైన ఆంగ్లం, జర్మన్ ఆదిగా గల భాషలన్నీ కరతలామలకములే. పోతే... ఆయాభాషల వారు తమ తమ భాషలలో ఆమెను అడిగిన ప్రశ్నలకు ఆమె తెలుగులో సమాధానం చెప్పేది.

తమాషా ఏమిటంటే... వారి భాష ఈమెకు అర్థమయినట్లే, ఈమె తెలుగు భాష వారికి అర్థమయ్యేది! బహుశా అమ్మ చేసిన 'అద్భుత ప్రక్రియ ప్రకారం, అమ్మ మాట్లాడిన తెలుగు భాషా శబ్ద తరంగాలు వారి వారి భాషలలో 'డబ్' చేయబడి వారికి వినబడేవేమో!

ఇది కేవలం దేవతలు మాత్రమే చేయగల అద్భుత, అసాధారణ ప్రయోగం!

అందుకే ఆమెకు స్వదేశీయులలోనే గాక విదేశీయులలో కూడా భక్తులేర్పడినారు. వారిలో ఒకరిద్దరు ఇక్కడే తమ గృహ సముదాయముల నేర్పరచుకుని ఇప్పటికీ ఆమెను దర్శించుకుని వెడుతూ వుంటారు.

ఇంకొక అమెరికా భక్తుడు అమ్మను ఎప్పుడూ చూడకపోయినా, ఆమెను గురించి అక్కడకు వెళ్ళిన అమ్మ భక్తులద్వారా, పత్రికల ద్వారా విని ఆర్థికంగా ఆమెకు ఎంతో సాయం చేశాడు. వారిని గురించి ముందు ముందు తెలుసుకుందాం.

ఆ విధంగా భాషకాని తమ భాషలోని తప్పొప్పులను ఎత్తిచూపిన ఆ బాలిక యొక్క అనూహ్యమైన అసాధారణ శక్తులకు బిత్తరపోయిన ఆ పోలీసులలో మస్తాను; అంకదాసు అనబడేవారు ఆ తరువాతి కాలంలో ఆమెకు దాసోహమన్నారు. తమ జీవితాంతం ఆమెను సేవించుకున్నారు.

అందుకనే పసిపాపయైన అమ్మ బాపట్ల రైల్వేస్టేషన్ పరిసరాలకు గాని, పోలీసు లైన్సుకు గాని వెడితే వారు ఆమెను సాదరంగా, అభిమానంగా ఆదరించేవారు.

వారిలో మస్తాను సాహెబ్ తనపై కండువా తీసి, క్రిందపరచి అమ్మను కూర్చోబెట్టి మహమ్మదీయ ఆచారములో నమస్కారము చేసేవాడు.

ఆ తరువాత అమ్మకోసం వారు తెచ్చిన మిఠాయిలు తినిపించేవారు.

అటువంటి సందర్భంలోనే ఒకనాడు వారు అమ్మను సాదరంగా ఆహ్వానించి, ఆమెకోసం తెచ్చిన పీచుమిఠాయి, తీపిబూంది ఇచ్చి తినమని ఆమెముందు పెడతారు.

తరువాత ఏమయిందో వారికి తెలియలేదు. అరగంట తరువాత వారిచ్చిన పొట్లాల వంక చూస్తే వాటిల్లోని పదార్థములు అయిపోయి వుంటాయి.

అది పెద్ద విశేషం కాదు. అయిదారు సంవత్సరముల చిన్నపిల్లలు ఎవరైనా ఆపాటి మిఠాయిలను అరగంటలో అవగొట్టేయగలరు.

అసలు విషయమేమంటే... వారిచ్చిన మిఠాయిలను పసిపాప అమ్మకు బదుల ఎవరో వృద్ధురాలు తిన్నట్టుగా వారికళ్ళకు కనిపించింది.

అది వారి భ్రమయేమోననుకుని కళ్ళు నులుముకొని చూస్తే ఎదురుగా వారికి బాలికరూపంలో అమ్మయే కనిపించింది.

అది కలయో, వైష్ణవ మాయయో అన్నట్టుగా వారిద్దరూ అయోమయస్థితిలో పడి కాస్సేపు కళ్ళు మూసుకుని మళ్ళా కళ్ళు తెరచి అమ్మకు సాష్టాంగ నమస్కారములు చేసి ఇలా అన్నారు. (పే. 67– జీవిత మహోదధి.)

"అమ్మా! నీవెవరమ్మా! తినేటప్పుడు నీవుగా లేవే! తీసుకున్నది కనబడలేదు. నీవుగా లేవు. ముసలి అమ్మలాగా కనబడ్డావు. ఎందుకు?" అని వణుకుతూ భయంతో యిద్దరూ పాదాల మీద పడి పెద్దపెద్దగా అరుస్తూ "చెప్పు తల్లీ! చెప్పమ్మా! ఓ తల్లీ!" అన్నారు.

మస్తాన్: భయమూ వస్తుంది. ఆనందమూ వస్తాంది. ఏడుపూ వస్తాంది.

అంకదాసు: మాకు అడగటం చేతకాదు. నిన్ను తెలుసుకోలేము.

అమ్మ: నాకేం తెలియదు నాయనా! మీరు కళ్ళు మూసుకున్నప్పుడు యెవరో ముసలమ్మ వచ్చి తిన్నదేమో!

మస్తాన్: నిజంగానే చూచాము. నీవుగా లేవు. యెవరుగానో వున్నది. అట్లా కనబడ్డావని అనుకోలేను. ఆమె వచ్చి కూర్చోవటమూ చూడలేదు. తిన్నది మాత్రము నీవుకాదు.

అంకదాసు: (మస్తాను నుద్దేశించి) కాదులేవోయ్! అమ్మ అట్లా కనబడ్డదని మాత్రము నమ్మకమేమిటి? వచ్చి కూర్చోవటమూ చూడలేదు. అమ్మ లేచి పోవడమూ చూడలేదు. తిన్నది మాత్రము ముసలమ్మ.

అమ్మకు ఆ శక్తి లేకపోతే అయిదేళ్ళ పిల్లచుట్టూ మనమెందుకు తిరుగుతాం? లోగడ జరిగిన అనుభవాన్ని గుర్తుకు తెచ్చుకో. అమ్మ అన్నింట్లోనూ ఒప్పించి మెప్పించు తుంది. (అమ్మ మెడలోని పులిగోరును మస్తాను దొంగిలించిన ఉదంతము, తరువాత అమ్మ వారి ఉర్దూ సంభాషణలో జోక్యం చేసుకున్న ఉదంతం గురించి.)

మస్తాను: అమ్మమీద వున్న విశ్వాసం దొడ్డది. నేను ఇంతవరకూ ఎవరికీ దండం పెట్టి యెరుగను. అమ్మను చూడకముందు నేను చాలా తప్పులు చేసేవాడిని. అమ్మ తప్ప

మరేమీ గుర్తుకు రావటం లేదు. ఇల్లు వదలిపెట్టి పోదామనిపిస్తున్నది. భార్యాపిల్లలు యిసుగొస్తున్నది. ఉద్యోగము వద్దనిపిస్తున్నది. అమ్మను చూస్తూ వుంటే చాలు. అమ్మ మనం ఇంటివద్దే వున్నప్పుడు కూడా ఇట్లాగే కనబడితే హాయిగా వుంటుంది. అట్లా యేమి చేస్తే కనబడుతుందో?

అంకదాసు: మనమనేది పోయి అంతా అమ్మయితే?

మస్తాను: అంతా అమ్మయితే అమ్మను చూడటమెందుకు? అంతా అమ్మయితే ఆనందమేమున్నది? అమ్మ అమ్మగా వుండి మనం పిల్లలుగా వున్నప్పుడే ఆనందం. ఇదే పెద్దలు చెప్పే జీవన్ముక్తి లక్షణము. ఇదే భక్తి.

అలా వారు చెప్పేదంతా వింటూ అమ్మ ఏమీ మాట్లాడకుండా దూరంగా కూచుని వింటూ వుంటుంది."

పాఠక మహాశయులారా! అలా వారిరువురూ తమలో తాము మాట్లాడుకుంటూ లేచి అమ్మ దగ్గరకు వచ్చి ఆమెను లేవదీసి ఆమె ఇంటిదగ్గర దిగపెట్టడానికి తీసుకు వెడుతూ వుండగా జరిగిందీ సంఘటన.

అది మామూలు సంఘటన కాదు. అమ్మ ఏమిటో, ఆమెలోని అనసూయ తత్త్వం ఎటువంటిదో తెలియజెప్పే మరొక మహిమాన్విత ఘటన.

ఈ సంఘటనను గురించి తెలుసుకునేముందు అంతకు రెండురోజుల క్రితం బాపట్ల బజారులో ఒక ముసలితాత ఆకలితో సతమతమౌతూంటే... అమ్మ జాలిపడి తన మెడలోనున్న బంగారు గొలుసును తీసి, అతనికిచ్చి దాన్ని అమ్మి ఆ డబ్బుతో ఏమైనా కొనుక్కుని తినమంటుంది.

ఇప్పుడు అమ్మ మస్తాను, అంకదాసులతో తన ఇంటికి వెడుతుండగా, దారిలో రైలుపట్టాల కీవలగా ఆ ముసలివాడు కనబడి ఒకసారి ఎగాదిగా అమ్మవంక, వెనుకనున్న పోలీసుల వంక చూసి తర్వాత మళ్ళీ అమ్మను తేరిపార జూసి ఆమెకు హఠాత్తుగా సాష్టాంగ నమస్కారము చేసి, అలానే ప్రాణాలను వదిలేస్తాడు.

అతను ఇంకా నమస్కారము చేస్తున్నాడనుకుని, ఎంతసేపటికీ లేవకపోతే మస్తాను అతన్ని లేవదీస్తాడు. ఆ తాత లేవడు. పైగా నోటివెంట నురుగు పడుతుంది. ఒళ్ళంతా పచ్చబడి వుంటుంది.

మస్తాను అమ్మతో "ఇదివరకు ఇతన్ని ఎరుగుదువా అమ్మా?" అని అడిగితే అమ్మ "ఇదివరకు భిక్షాటనకు వెడితే భిక్షము పెట్టలేకపోయాను" అని అంటుందే కాని, అతనికి బంగారు గొలుసు నిచ్చానని చెప్పదు.

అప్పుడు వారు ఆ శవమును తీసుకువెళ్ళి పారవేద్దామని అమ్మతో అంటారు. అందుకు అమ్మ వారిని కట్టెలు కొనుక్కుని రమ్మని, ఈలోగా తాను ఇంటికి వెళ్లి భోజనము చేసి వస్తానని చెప్పి, వెళ్ళి భోజనం చేసి వస్తుంది. అప్పటికి రాత్రి ఏడున్నర గంటలయింది.

ఇంతలో అంకదాసు, మస్తాను వెళ్లి ఆ తాత శవదహనమునకై కట్టెలు తీసుకువస్తారు.

ఆ సమయానికి అమ్మ ఆ తాత శవం దగ్గర కూచుని, దాన్ని చేతులతో తడుముతూ వుంటుంది.

అప్పుడు జరిగింది అసలు సంఘటన!

అమ్మ అలా తడుముతూ వుండగానే ఆ తాత శవం కదలినట్లయింది.

అది చూచి మస్తాను "అమ్మా! తాత కదలినట్టున్నాడే!" అని గట్టిగా అరుస్తాడు.

దానికి అమ్మ "కదిలేది కదలదా నాయనా!" అని మెల్లగా అంటుంది.

అది విని మస్తాను "ఏమిటమ్మా! నిజం చెప్పు. పుల్లలు తెప్పించి మమ్ముల నాడించి తాతను చంపి బ్రతికించావా అమ్మా!" అంటాడు.

అమ్మ మాట్లాడకుండా శవము వంకనే చూస్తూ వుంటుంది.

అప్పుడు వారిలో వారు "అది తాత చావటము కాదేమో. సమాధిస్థితి యేమో" అని ఇంకేమేమో మాట్లాడుకుంటూ వుంటారు. ఇంతలో అంకదాసు అమ్మవంక తిరిగి చూసి ఆశ్చర్యంతో అట్టే వుండిపోతాడు.

అప్పుడేం జరిగిందో చదవండి. (పే. 70-జీవిత మహోదధి)

"అంకదాసు: (ఆశ్చర్యంగా) అమ్మ వంక చూస్తున్నావా మస్తాన్? అమ్మ తేజస్సు రకరకాలుగా మారిపోతున్నది. యెనకటివారు దశావతారాలే చూపించారంటారు."

అంటూ "అమ్మా! అమ్మా!" అని పెద్దగా అరుస్తూ అమ్మవంక చూసి...

"మనుష్యుల రూపంలో శరీరధారివై అయిన రూపాలే కాకుండా కొండలు, నదులు, నిధులూ కూడా యీ అరగంటలో రకరకాలుగా కనబడుతున్నవి. శరీరం పులకరిస్తున్నది. ఆనాడు కృష్ణుడు యశోదకు చూపించింది యిదేనేమో! అది నిజమని ఒప్పుకోవాలంటే యీనాటి అమ్మే ఆనాటి కృష్ణుడుగా పుట్టి వుండాలి. ఈ అదృష్టము ప్రతి ఒక్కరికీ కలగాలి, కలగాలి!" అంటూ పెద్దగా కేకలుపెట్టి ఉన్మత్తస్థితిలో పడి,

"అమ్మా! అమ్మా! నీవెవరో చెప్పమ్మా! యెరుక చెయ్యమ్మా!" అని "ఆ, యెరుకయింది. యెరుక చేశావు! యెరుక చేశావు! యెరుకే నీవు! నేను బాల్యంలో లక్ష్మీనరసింహ శతకము చదువుకునేవాడిని. ఇంతకంటే నాకేమీ దైవచింతన లేదు. నాకు భగవంతుడూ... నేను భగవంతుడ్ని చూశానంటే, నేను భగవంతుడ్ని గుర్తుపట్టానంటే... అమ్మ మనకొరకు...

ఏమీ చేయలేని వారికై... భక్తి లేనివారికి విముక్తి లేదంటున్నారు. కాని, భక్తి లేనివారికి ముక్తి వున్నదని, భక్తి తానని, ముక్తి తానని ఋజువు చేస్తున్నది! లేకపోతే... నేను చాల దుర్మార్గుడను. సరియైన వృత్తులు లేవు! నాకు యిన్ని మాటలు, యింత స్తోత్రము!... యిటువంటి దర్శనము!" అని అమ్మ పాదాల మీద పడి నమస్కారము చేస్తూ లేవలేదు.

అటు ప్రాణం వచ్చిన ముసలివాడు బాగా పొర్లుతున్నాడు.

ఇక ఇటు మస్తాన్ సాహెబ్ పరిస్థితి కూడా అంకదాసు వలెనే వున్నది. తనలో వున్న జీవం అమ్మలో ప్రవేశించినట్లుగా భావించి, తాను అన్నది లేక వున్నదంతా అమ్మేననుకుంటాడు.

అంకదాసు అమ్మ పాదాల మీదనుంచి లేచి "అమ్మా! అజ్ఞానులకు జ్ఞానం ఎట్లా కలుగుతుంది?" అని అడుగుతాడు.

"మీకు కలిగినట్లుగానే" అంటుంది అమ్మ.

"మాకు నీ దయవల్ల కలిగిందమ్మా!" అంటాడు అంకదాసు.

దానికి అమ్మ "అందరికీ ఒకరి దయవల్లనే. అజ్ఞానం, జ్ఞానం ఒకరి దయ వల్లనే కలుగుతుంది" అంటుంది.

అంకదాసు తాత వంక చూసి "తాతా! నీకెవరైనా సంజీవి పోశారా?" అని అడుగుతాడు. తాత మాట్లాడడు.

"సంజీవే 'అమ్మ'య్యా! జీవులకు సంజీవి అమ్మ!" అంటాడు మస్తాన్.

అమ్మ తాతనుద్దేశించి "నాయనా! మంచినీళ్ళు తాగుతావా?" అని అడిగింది.

తాత హీనస్వరంతో "ఏదీ వద్దమ్మా!" అని "నీవిచ్చిన నగను డబ్బు చేసుకున్నాను. అదికూడా అవసరం లేదు. కొంత ఖర్చయింది. ఒక తప్పు చేశాను. అదికూడా ఆ తప్పునకే ఖర్చయింది" అంటాడు.

అమ్మ: ఏ తప్పు చేశావు నాయనా!

తాత: నీకు తెలియదా అమ్మా! ఆ తప్పు కోసమే ఇచ్చి వచ్చావుగా.

అమ్మ: అప్పుడు నీకు తప్పు లేదు, నేను యిచ్చినప్పుడు.

తాత: నేనింకొకటి చెప్పుకుంటా అమ్మా! తాగి, మాంసం తినాలని మాంసం కొనుక్కున్నా అమ్మా! చేసుకోవటం చేతకాక పారేసుకున్నా అమ్మా!

అమ్మ: నాయనా! నా దగ్గరకు తెచ్చుకోలేకపోయినావా? చేసిపెట్టేదాన్ని. పచ్చిది కూడా తినొచ్చు కదా. ఎందుకు పారవేసుకున్నావు? నాకు తెచ్చిపెట్టకపోయావా? నేను తినేదాన్ని.

అమ్మ అలా అనగానే తాత ఉలిక్కిపడి, అమ్మ చేతిలో వున్న మాంసం ముక్క
చూసి అమ్మ పాదాల మీద పడబోయి మస్తాను, అంకదాసుల పాదాలమీద పడతాడు.

అంకదాసు తమ పాదాల మీద పడిన తాతను చూసి సాయంత్రం రైలుపట్టాల వ
అమ్మ పాదాల మీద ఎందుకు పడ్డావని అడుగుతాడు.

తాత: లేదు బాబూ! తాచుపాము కరచింది. బ్రతకననుకుని స్టేషన్‌
పోదామనుకుంటుండగా అమ్మ ఫలానా చోట వున్నట్లుగా శబ్దము వినబడింది. దీప
చూడకూడదన్నారు. దీపం లేకుండా అమ్మ దారి చూపించింది. సరాసరి అమ్మ దగ్గర
వచ్చాను. ఏమీ తెలియలేదు. అమ్మ మొన్న కనపడ్డప్పుడే అయ్యా! వినండి. ఈ డబ్బు
సొంతమునకు వాడుకుంటావా?" అన్నది. ఇంకొక్క ముక్క కూడా అన్నది. "పెద్దవాడి
పాములూ తేళ్ళూ జాగ్రత్త" అంది. నేను యెన్నాళ్ళనుండి తిరగటం లేదు? యేమిటి య
అమ్మాయి ఇట్లా అంటుంది? అని అనుకున్నా. అప్పుడు డబ్బు దాహం తప్ప మరే
కనబడలేదు. ఆ రోజునుంచి అమ్మ రోజుకొక రూపంతో కనబడుతూ మాటలు వినబడుతూ
వున్నాయి. నిన్నరాత్రి నేను యేదో వచ్చి చచ్చిపోయినట్లు, అమ్మ మందు పోస్తే బ్రతికిన
కల వచ్చింది.

ఆ తర్వాత అమ్మతో సహా వారు నలుగురూ ఆ మాటా యీమాటా చెప్పుకుంటు
వుంటారు.

అలా మాట్లాడుకుంటూ వుండగా తాత తన వెనుక యేదో కదిలినట్లుంటే వెనక
తిరిగి చూస్తాడు.

అంతే... "అమ్మోయ్!" అంటూ పెద్దగా అరుస్తాడు. కారణం... తళతళలాడుతు
అంతకుముందు తనను కరచిన సర్పం తన వెనుకకు వచ్చి నుంచుంటుంది.

అయితే అది మస్తాను, అంకదాసుకు కనిపించదు. అమ్మ కూడా "నేనేలే నాయనా
ఎవరూ లేరు" అంది.

తాత "కాదమ్మా! పాము" అంటాడు భయంతో.

"ఎక్కడ నాయనా!" అంటుంది అమ్మ చుట్టూ చూస్తూ.

అప్పుడు తాతకు ఆ పాము అమ్మ వొంటిమీద ప్రాకుతూ కనబడుతుంది.

అది చూచిన తాత "అదేం అమ్మా! నీమీద పాకుతూ వుంటే లేదంటావేం? అమ్మో
కరుస్తుంది... కరుస్తుంది..." అంటాడు భయపడుతూ.

అది చూచిన మస్తాను, అంకదాసులకు అమ్మ వంటిమీద అటువంటిదేమీ
కనబడకపోవటంతో...

"తాతకు మతిచెడిపోయింది. పాము కరిచింది కదూ! అందుకే అలా భయపడుతున్నాడు" అనుకుంటారు.

కాని, తాతకు కనబడుతున్నది నిజమే.

అమ్మ ఒంటిమీద పాము చుట్టుకుని, అమ్మ శరీరం కనబడకుండా ఆమె శరీరమంతా పాము శరీరమే చుట్టినట్లుండి, చివరకు పాము ఆకృతిగా నుండి, పాము రూపమై అమ్మ ముఖము మాత్రము మామూలుగానే కనబడుతుంది తాతకు. ఆమెపట్ల భక్తి కలిగి భయము తగ్గుతుంది. అమ్మ సాక్షాత్ భగవంతుడని ఆ రూపంగా విశ్వసిస్తాడు.

ఈ పాము ఉదంతం తెలియని మస్తాన్, అంకదాసులు అమ్మను గురించి మాట్లాడుకుంటూ వుంటారు. మాటల మధ్యలో అంకదాసు...

"అతనికి (తాతకు) కనిపించిన దృశ్యం మనకు కనిపించలేదు. నీకు కలిగినవి నాకు లేవు. నాకు కలిగినవి నీకు లేవు (అనుభవాలు.) మొదటిరోజు వయసుకు మించిన చురుకుగా, తెలివిగలదానిగా కనిపించింది. రెండవ రోజున అసాధారణ వ్యక్తిగా అనిపించింది. మూడోరోజు దైవత్వం ప్రబోధిస్తోంది. తాతతో సహా నాకేమన్పిస్తున్నదంటే చెప్పటం చేతకావటం లేదు. అమ్మ దగ్గరకు చేరిన వాళ్ళమంతా తలా వొక రకంగా చేశాము. అనుభవాలు వేరుగా వున్నాయి. కలిగే ఫలితం ఒకటే. మనసుకు తడుతున్నాయి గాని, ఇంతకన్న చెప్పలేను మాటలు రావు" అన్నాడు.

"భేష్! చక్కని మాటన్నావు. నా స్థితి అట్లాగే వున్నది. మనం చూడకపోయినా అమ్మను ముందు ముందు జరగబోయే రోజుల్లో అమ్మే దేముడని ప్రపంచమంతా గుర్తించాలని నా ఆశయం" అన్నాడు మస్తాన్.

అంకదాసు: అమ్మ అనుకుంటే ఎందుకు కాదు? మనం మాత్రం గుర్తించామా? అమ్మ దయేగా మనం గుర్తించడానికి.

మస్తాను: అమ్మను భగవంతుడు తప్ప గుర్తించలేడు. అమ్మే భగవంతుడుగా. ఇంకా గుర్తించేదెవరు?

అంకదాసు: ఇంకొక తమాషా చూశావూ? అమ్మ యిదంతా ఒక్కసారిగానే చూపిస్తే మనం యేమయ్యేవాళ్ళమో. గుజ్జనగూళ్ళు పెట్టినట్లు చేసింది.

మస్తాను: కాదు కాదు. వేలు నోట్లో పెట్టి పుట్టగానే ఆముదం కుడపటం నేర్పుతారు. గుజ్జనగూళ్ళ దాకా పోయావేం! అదే స్థితి... మనస్థితి.

వారిద్దరూ అలా మాట్లాడుకుంటూ వుంటే తాతకు యీలోపుగా అనేక ఆలోచనలు తడుతూ వుంటాయి.

‘అమ్మ డబ్బు యిచ్చేటప్పుడు అమ్మను గురించి సరి అయిన ఆలోచనతో లేను. అమ్మను ఒంటరిగా పిలిపించి ఒంటికున్న నగలన్నీ కాజేద్దామనుకున్నాను. అమ్మ నా బుద్ధిని గ్రహించి తానే పాముగా వచ్చి, కరచి, తనే నేను ఇక్కడ వున్నానని చెప్పి రప్పించి, నేను కనుక్కోలేనేమోనని, ‘నేనేరా’ అని చూపించింది’ అని మనసులో అనుకొని అమ్మతో...

“అమ్మా! నేనొకటి అడుగుతా చెబుతావా? నాకు ఇందాకటినుంచి అట్లాగే కనబడు తున్నావు. నాకు కనబడ్డట్టు వారికి కనబడటం లేదనుకుంటా. నేను అడుగుతున్నాను. వారు అడగటం లేదు. నా భయం వారికి లేదు. నా ఆనందము లేదు. అమ్మా! నేను అడగదలచుకున్నది అడుగుతున్నా చెబుతావా?”

అని పై సంగతులు (తన ఆలోచనలు) అడుగుతాడు. దానికి అమ్మ “నీకు ఏది తోస్తే అది నిజం నాన్నా! నీకు కనబడ్డదాన్ని బట్టేగా నీకు తోచేది. నేను కనుపింపజేసేది. నీకు తోచేది నీకు చెప్పేది, నీవు చెప్పేది అన్నీ ఒకటే అంది.”

పాఠక మహాశయులారా! తెలిసిందిగా. అంతకు ముందు రోజు బజారులో ఆకలిగొన్న తాతను చూచి తన మెడలోని బంగారు గొలుసును అమ్ముకుని ఆ డబ్బుతో ఆకలి తీర్చుకోమని అమ్మ చెబితే తాత ఆ డబ్బుతో తాగి, ఆపైన మాంసం తిందామని ప్రయత్నించడమే గాక, అమ్మను చాటుగా పిలిచి ఆమె వొంటి నున్న నగలను కాజేద్దామని అనుకుంటాడు.

దానికి బదులుగా అమ్మ ఏం చేసింది? అతని తప్పుడు ఆలోచనలను మొదటిలోనే పసిగట్టి, అతని తప్పు అతనికి తెలియచెప్పడానికి, అతన్ని పాముచే కరిపించి, చంపి, మళ్ళీ బ్రతికించింది.

అలా చంపటం, లేదా చనిపోయినట్లు అతన్ని భ్రమింపజేయటం తన తప్పును తాను తెలుసుకునేందుకే. అంతేకాని, అది అతనికి విధించిన శిక్ష కాదు. శిక్షణే!

సరిగ్గా అటువంటి శిక్షణనే అంతకుముందు తన నాలుగేళ్ళ వయసులో తాను ముత్తాయిపాలెం బీచ్‌కి వెళ్ళినప్పుడు తనకు ఆపద తలపెట్టిన జాలరికి కలుగజేసింది.

అందుకే... ‘తన దగ్గర శిక్ష లేదు. శిక్షణే’ అనీ, తప్పు చేసిన ఆయా వ్యక్తుల కిచ్చే ఆ శిక్షణ కూడా వారి ‘రక్షణ’ కొరకే ననీ అంటుంది అమ్మ.

అది నూటికి నూరుపాళ్ళు అనసూయతత్వం! రాగద్వేషాలు లేని అనసూయ తత్త్వం!

అందుకే అంకదాసు ఇదివరకు ‘అనసూయ’ అంటే అర్థం చెప్పమ్మా! అనసూయ అంటే అసూయ లేనిదంటారు. అంతేనా? ఇంకేమైనా అర్థముందా? నీవు చెప్పమ్మా?” అని అడిగినప్పుడు అమ్మ...



**ఆ త్రిశూలం దుష్ట శిక్షణకు కాదు. దుష్టత్వ శిక్షణకు.**

"నాయనా! 'అనసూయ' అంటే నా ఉద్దేశ్యం రాగ, ద్వేష అసూయలను పారద్రోలేదే 'అనసూయ' అదే అనసూయత్వం. అనసూయ తత్త్వం" అని తనను చూపుకొంటూ తన అసలు తత్త్వాన్ని వివరిస్తుంది.

పాఠకులు ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి. అలనాటి అనసూయమాత... మానవులు చేసే పెద్ద తప్పుకి చిన్న శిక్షను, చిన్న పుణ్యకార్యానికి పెద్ద ఫలితాన్ని ఇవ్వమని తపస్సు చేసిందని.

అయితే నేటి మన అనసూయమ్మ మాత్రం మానవులు చేసే పెద్ద తప్పులకు చిన్న చురకలాంటి శిక్ష వేసి, వారి తప్పును వారు తెలుసుకునేట్టు చేసి, వారిని తిరిగి సన్మార్గాన నడిపించేది.

"నడిపించేది" ఏమిటి? తాను దేహ త్యాగం చేసిన నాటినుండి నేటివరకూ అదే పద్ధతి నామె అవలంబిస్తోంది. ఇప్పటికీ మన మధ్యనే తిరుగుతున్న ఆమె దేహ త్యాగానంతరం లీలలను గురించి ముందు ముందు తెలుసుకుందాం.

అలాగే మానవులు చేసిన చిన్న పుణ్య కార్యానికి పెద్ద ఫలితాలను ఇచ్చిన సంఘటనలు కూడా వున్నాయి. వాటిని గురించి కూడా ముందు ముందు తెలుసుకుందాం.

# ఆపదుద్ధారిణి - ఆత్మప్రబోధిని

సరే... తనకు కీడు తలపెట్టిన వారిని కొద్దిపాటి శిక్షతో వారిని చావు అంచుల వరకూ తీసుకువెళ్ళి మరలా వెనక్కు తీసుకువచ్చింది. దానినే "శిక్షణ" అనేది అమ్మ.

అదెటువంటిదంటే... మనం ఇదివరకే చెప్పుకొన్న విధంగా, అల్లరి చేస్తున్న ఒక పిల్లవాడిని ఒక దెబ్బవేసి దారికి తీసుకురావటం వంటిది.

అయితే ఏ తప్పు చెయ్యని వారిని ప్రమాదం నుండి రక్షించడం, మృత్యుముఖం నుండి మళ్ళించడాన్ని ఏమంటారు? 'ఆపదుద్ధారణ' అంటారు.

అమ్మ చిన్నతనంలోనే అంటే... ఐదు సంవత్సరముల వయసులోనే చేసిన అటువంటి మహిమను గురించి ఇప్పుడు చెప్పుకొందాము.

అమ్మ తల్లిగారైన రంగమ్మగారు పరమపదించిన తరువాత అమ్మ, చిదంబరరావు తాతగారు, మరిడమ్మ బామ్మగారు, మన్నవలో వారింటికి నౌఖరు ఖాశిం, బాపట్ల నుండి మన్నవకు తిరుగు ప్రయాణమైనారు. మన్నవ వెళ్ళాలంటే బాపట్లలో రైలు ఎక్కి నిడుబ్రోలు స్టేషనులో దిగి, పొన్నూరు మీదుగా ఎడ్లబండి ఎక్కి వెళ్ళాలి. ఆ రోజుల్లో బస్సులు విరివిగా వుండేవి కావు.

రైల్లో అమ్మకెదురు సీట్లో కిటికీ ప్రక్కగా ఒక ఎనిమిది సంవత్సరముల వయసు గల కుర్రవాడు కిటికీ అంచున చేయివేసి కూచున్నాడు. వాడి ప్రక్కన ఒక ముసలాయన కూచున్నాడు. అతడు ఆ కుర్రవానికి తాత.

ఆ కుర్రవాడు పరుగెడుతున్న రైల్లోంచి బయట వెనక్కు పరుగెడుతున్నట్లున్న చెట్లను చూస్తుంటే, పైన వున్న కిటికీ రెక్క దఢాలున జారి ఆ కుర్రవాని చేతిపైన విసురుగా పడింది.

వెంటనే ఆ కుర్రవాడు "అమ్మా!" అని గట్టిగా అరచి, తన ఎదురుగా కూర్చున్న 'అమ్మ' వైపే చూస్తూ ముందుకు వాలిపోతాడు.

అలా వాలిపోయిన వాడు ఎంతకీ లేవకపోయేసరికి పెట్టెలోని వారందరూ అతన్ని పరీక్షించి, చనిపోయినాడని నిర్ధారించారు. పెద్ద దెబ్బలేమీ తగలకపోయినా ప్రాణాలు వదలినందుకు చింతిస్తారు. మనవడు పోయినందుకు దుఃఖిస్తున్న తాతని ఓదారుస్తారు.

నిడుబ్రోలు స్టేషన్‌లో రైలు ఆగగానే అమ్మ, చిదంబరరావు తాతగారు, మరిడమ్మగారు, ఖాశిం దిగారు.

వారితో బాటే ఆ తాతకూడా పిల్లవాని శవాన్ని భుజాన వేసుకుని దిగి ప్లాట్‌ఫామ్ మీద పడుకోబెట్టి దుఃఖిస్తూ వుంటాడు.

అమ్మ అది చూచి, జాలిపడి చిదంబరరావుగారితో "తాతగారూ! ఆ పిల్లవాడిని మనం పారవేయిద్దామా?" అని అంటుంది.

దానికి తాతగారు "మనకెందుకమ్మా! పొద్దుగూకుతున్నది. పోదాం పద" అంటారు.

వారివెంట దిగిన నౌఖరు ఖాశిం బండికోసం బయటకు వెళ్ళాడు.

కాస్సేపటికి ఖాశిం వచ్చి ఒంటెద్దు బండి మాట్లాడానని చెప్పాడు. సామాన్లు బండిలో పెట్టించమని చెప్పి, చిదంబర రావుగారు ప్లాట్‌ఫారం చివరివరకూ వెళ్ళారు.

తాతగారు వచ్చేలోగా వస్తానని మరిడమ్మగారితో చెప్పి, అమ్మ పిల్లవాని శవం దగ్గర కూచుని ఏడుస్తున్న ముసలితాత దగ్గరకు వెడుతుంది.

అప్పటికే అక్కడికి చాలామంది జనం వచ్చి చేరారు. విగతజీవుడైన ఆ పిల్లవానినీ, తాతనూ జాలిగా చూస్తూ నుంచున్నారు.

వారి చుట్టూ మూగిన జనాన్ని చీల్చుకుని అమ్మ వెళ్ళి తాతకు ఎదురుగా నుంచుంది.

తన ఎదురుగా నుంచున్న అమ్మను చూచి తాత, "అమ్మా! ఇందాక రైల్లో మాకెదురుగా కూచున్న తల్లివి నీవే కదా?" అని అడిగాడు.

అప్పుడు అక్కడ మూగిన జనం అంతా అమ్మవైపు ఆశ్చర్యంగా చూచారు.

అప్పుడు అమ్మకూ, తాతకూ మధ్యన జరిగిన సంభాషణను గురించి ఈ క్రింద చదివి తెలుసుకోండి. (పే. 99- జీవిత మహోదధి)

"అమ్మ: (తాత దగ్గరకు వెళ్ళి పైన చేయి వేసి నిమురుతూ) ఎందుకు నాయనా! ఏడుస్తున్నావు? పిల్లవాడు పోయినాడనా? యిప్పుడు ఖర్చులకు డబ్బులు లేవనా? నిన్ను చూచేవాళ్ళు యెవరూ లేరనా నీవు ఏడవటం?"

తాత: పిల్లవాడు ఇంత గంజి పోస్తాడు అనుకున్నానమ్మా! ఒకప్పుడు జ్వరము వచ్చి పడుకుంటే అడుక్కొచ్చి పెట్టాడు తల్లీ!

అమ్మ: అలా అయితే యేడిచేది నీ కొరకే గదా! పెంచింది నీ కొరకు. నీ తృప్తి. నీకు హాయిగా వుండిపెంచావు. చస్తే నీకు కష్టమని యేడుస్తున్నావు. ఏదన్నా వాడి చేతిలో పెడితే వాడు తింటే నీకు తృప్తి కనుక పెడుతున్నావు. వాడల్లరి చేస్తుంటే కొట్టి, అల్లరి మాన్పించి తృప్తిపడుతున్నావు. ప్రాణం పోయిన శవాన్ని దగ్గర పెట్టుకుని యేడుస్తున్నావంటే, డబ్బు లేదని, పారేసేవాళ్ళు లేరని, నీ బాధ్యత తప్పిపోతున్నదని... అదీ నీ కొరకే!"

ఆమె చెప్పింది వింటూ, అక్కడ వున్న వారందరూ ఆశ్చర్యంగా అమ్మవంక చూస్తు వుంటారు. ఇంతలో ఖాశిం అమ్మను వెతుక్కుంటూ వస్తాడు. "అమ్మా! తాతగారు నీకోస వెతుకుతున్నారు. ఆయన నిన్ను యిల్లా పోతే ఎట్లా అని కోప్పడుతున్నారమ్మా! చిన్నపిల్లన ఎవరైనా ఎత్తుకుపోతారు" అన్నాడతడు.

అమ్మ: అదీ ఆయన తృప్తికే. ఖాశిం! ఈ తాతకు ఏం కావాలో అడిగి చేస్తావా తరువాత వెడదాం.

ఖాశిం: తాతగారు కోప్పడతారమ్మా!

అమ్మ: తొందరగా వెళ్ళడం తాతగారి తృప్తి. ఈ తాతపని చూడ్డం నా తృప్తి.

ఇంతలో దూరంగా తాతగారు రావడం చూసి, అమ్మ ఖాశింతో "నీవు పోయి తాతగారిని కలుసుకో. నేను వస్తున్నా" అని ఖాశిం అక్కడనుంచి కదలకపోతే అతన్ని స్టేషన్ బయట పంపర పనసపండు కొనుక్కు రమ్మని పంపి, అతను వెళ్ళగానే తనచేతి వుంగరం తీసి తాత చేతిలో పెట్టి "నాయనా! ఇది మార్చి వాడుకో. నా చేతిలో వున్నదిది" అంది.

దానికి తాత "చిన్నపిల్లవు. ఎందుకమ్మా ఈ పని?" అని అంటున్నా వినకుండా "నాకొరకే. నా తృప్తి నాయనా!" అంటుంది అమ్మ.

"నా కివ్వటం నీ తృప్తి ఏమిటమ్మా?" అని తాత దానిని తీసుకొనుటకు నిరాకరిస్తే అమ్మ ఆ ఉంగరాన్ని తాతచేతిలో బలవంతాన వుంచి...

"ఒకవేళ నీ మనవడు "ప్రాణం కడబట్టిందంటారే" అట్లాగే, అట్లా కడబట్టి మళ్ళీ లేస్తే, యీ వుంగరం అబ్బాయి చేతికి పెట్టు" అంటుంది.

తాత "ఇంకా ఏం బ్రతుకుతాడమ్మా! పోయిన బిడ్డ" అంటాడు విరక్తిగా.

"ప్రాణం పోతే సరే. ప్రాణం కడబట్టి బ్రతికితే? లేకపోతే మరొక దానికి ఉపయోగించుకో" అని అక్కడనుంచి వెళ్ళిపోతుంది.

"బాలవాక్కు బ్రహ్మహక్కు" అంటారు. కాని, ఇక్కడ ఐదు సంవత్సరముల వయసుగల ఈ బాలిక మామూలు బాల కాదు. అపరబ్రహ్మ! ఆమె వాక్కు అమోఘమై ఆమె తిరిగి వచ్చేలోగా చనిపోయిన పిల్లవానిలో ప్రాణం తిరిగి వస్తుంది!

ఆ సంగతి తాతగారి వద్దకు వెళ్ళిన అమ్మకు తెలుసు. అందుకే ఆ పిల్లవాడిని తిరిగి చూడడానికై తాతగారితో, తాను బయలుకు వెళ్ళాలని చెప్పింది.

అప్పటికే చీకటి పడుతుండటంతో చిదంబరరావుగారు త్వరగా మన్నవ గ్రామం చేరుకోవాలనే తొందరలో వున్నారు.

ఇది గమనించిన ఖాశిం, తాతగారితో "ఇక లాభంలేదు. మీరు ముందు బయలుదేరండి. మీరు దొప్పలపూడి దగ్గరకు వెళ్ళేటప్పటికి నేను అమ్మనెత్తుకుని వస్తాను" అంటాడు. దానికి తాతగారు సమ్మతించి మరిడమ్మగారితో సహా వెళ్ళిపోతారు.

ఆ విధంగా తాతగారిని పంపించి అమ్మ ఖాశింతో సహా తిరిగి వచ్చేసరికి మరణించిన పిల్లవాడు లేచి కూచుంటాడు.

అది చూచిన తాత పరమానందభరితుడై అమ్మకు నమస్కారము చేసి...

"ఇందుకే పెద్దలు 'బాల వాక్యము- బ్రహ్మవాక్యము' అంటారు అని అంటాడు. దానికి అమ్మ "బ్రహ్మ వాక్యము అంటే భ్రాంతి లేని వాక్యము. భ్రాంతిలేని వాడే బ్రహ్మ" అని వివరణ ఇస్తుంది."

ఈ విధంగా ఆ రోజు రైల్వేస్టేషన్‌దగ్గర పాముకాటుతో చనిపోయిన బిచ్చగాడిని శరీరము నిమిరి బ్రతికించినట్టుగానే, ఈ రోజు 'అపరబ్రహ్మ' అయిన అమ్మ తన వాక్కు మాత్రంచేత చనిపోయిన బాలుని బ్రతికించింది. దానినే 'ఆపదుద్ధారణ' అని పైన చెప్పుకొన్నాం.

కాని ఆ బాలుడు తరువాత మళ్ళీ అమ్మవొడిలోనే ప్రాణం విడుస్తాడనుకోండి. అది వేరే కథ. దానిని తెలుసుకోవాలంటే మీరు "జీవిత మహోదధి"ని చదవాల్సిందే!

అయితే మనమిక్కడ తెలుసుకోవలసింది కొంత వుంది.

మొదట తను చేసిన ధన సహాయాన్ని దుర్వినియోగపరచి, పైగా దురాశతో తనను మోసం చేసి తనవద్దనున్న నగలను దోచుకుందామనుకున్న బిచ్చగాడిని పాము కాటుతో మృత్యుముఖానికి పంపి, మళ్ళీ బ్రతికించింది. దాని కతడు పశ్చాత్తాపంతో కృంగిపోతాడు. దానినే అమ్మ 'శిక్షణ' అన్నది. ఆ 'శిక్షణ' దేనికి? తనపట్ల ఆ బిచ్చగాడు ప్రవర్తించిన అనుచిత ప్రవర్తనకు. దానిని మాత్రమే అమ్మ మన్నించి అతన్ని శిక్షించకుండా కేవలం అతనిలో మానసిక పరివర్తన కలిగించి, వదలివేసింది.

ఎదుకంటే- అతని జీవితకాలం ఇంకా మిగిలి వుండి వుంటుంది. అందుకే అతనిలో పాపభీతిని కలిగించి, మిగిలిన జీవితాన్ని సన్మార్గంలో నడవమని అతడిని క్షమించి వదిలేసింది.

అయితే పైన రైల్లో చనిపోయిన బాలుని వయసు కేవలం ఎనిమిది సంవత్సరాలు. ఎనిమిది సంవత్సరాల అతని పసివయసు పాపపుణ్యాల కతీతం. పైగా ఆ బాలుడు అల్పాయుష్కుడై వుంటాడు. అందుకే తనపైన ప్రేమను పెంచుకున్న (ఈ వైనాన్ని మీరు 'జీవిత మహోదధి' గ్రంథంలో చదివి తెలుసుకోండి) ఆ పసివాడిని తిరిగి తనలో ఐక్యం చేసుకుని అతనికి సద్గతిని కలిగించింది.

అటువంటి సద్గతినే మన్నవ గ్రామం కృష్ణభక్తుడైన ఒక వృద్ధునికి కూడా కృష్ణుని రూపంలో కనబడి కలిగించి తనలో ఐక్యం చేసుకున్నది. ఈ వైనాన్ని రాబోయే అధ్యాయం "చింతలతోపు"లో చదివి తెలుసుకోండి.

ఇంతకీ విషయమేమంటే... ఈ లోకంలో ప్రతివ్యక్తీ తన తృప్తికోసమే బ్రతుకుతాడు. తన ఆనందం కోసమే తాపత్రయపడతాడు. అతడు జీవితంలో చేసిన సత్కార్యాలూ, దుష్కార్యాలూ, ఆఖరికి తన భార్యాబిడ్డలను పోషించుకోవడం కూడా తన తృప్తికోసమే. తన ఆనందం కోసమేనని పైన మనుమని కోల్పోయి దుఃఖిస్తున్న తాతకు అమ్మ వివరించి చెప్పింది.

ఆఖరుకు తానూ అందుకు అతీతం కాదని, ఖర్చుల కోసం తన ఉంగరాన్ని తాతకు ఇవ్వడం కూడా తన తృప్తి కోసమేనని అన్నది.

అంటే... మానవులు పరస్పరం చూపించుకుంటున్న అనుబంధాలూ, ఆత్మీయతలూ అన్నీ వట్టివేనన్న మాట! అవన్నీ ఎవరికి వారు తమ తృప్తి కోసం ఆడుకుంటున్న తమకు తెలియకుండానే అభినయిస్తున్న వింత నాటకం అన్నమాట!

అదే నిజమైతే, ఈ సమస్త సృష్టీ, అందులో గల ఈ మానవులూ, వారి మధ్యన గల ఈ సంబంధాలూ ఎంత విచిత్రం! ఎంత వినోద భరిత విషాదపూరితం!

అలా అయితే ఈ వినోదాల, విషాదాల సమ్మిళితమైన ఈ జగన్నాటక రచన ఎవరిది? ఎవరి కోసమిది? ఎవరి కాలక్షేపం కోసం ఈ విశ్వరంగం పై సృష్ట్యాది నుంచీ, నిరంతరంగా ఎప్పటికీ తెరపడని ఈ మహానాటకం కొనసాగుతున్నది?

ఈ ప్రశ్నలకు సమాధానం- విధాత!

అవును. ఈ నాటక రచన విధాతదే. కేవలం ఈ నాటక రచనయే కాదు... దీన్ని ఆడించేదీ, అవలోకించేదీ కూడా ఆయనే! ఆ ఏకైక ప్రేక్షకుని కోసమే ఇదంతా! ఆయన తృప్తి కోసమే!

మనం ఒక సినిమానో, నాటకాన్నో చూస్తున్నప్పుడు అందులో వచ్చే మంచి పాత్రల పట్ల ఆదరణనీ, చెడు పాత్రల పట్ల నిరాదరణనూ ప్రదర్శిస్తాము. అంతే... అంతకుమించి మనమేమీ చెయ్యలేం. వాటిపట్ల మన రాగాలూ, ద్వేషాలూ వాటినేమీ చేయలేవు.

అయితే యీ విశ్వనాటక ప్రదర్శనలో అలా కాదు. దీన్ని నడిపించేదీ, వీక్షించేదీ విధాత. మంచి అయినా చెడు అయినా దారి తప్పి నడిచేవారిని ఆయన సరిదిద్దుతాడు. అప్పటికీ వారు దారిన పడకపోతే, నాటకరంగం నుంచి వారిని నిష్క్రమింపజేసి, తమ చెడు కర్మల ఫలితాన్ని అనుభవించేందుకు మరొక జన్మను వారికి కలిగిస్తాడు.

పోతే... ఆయన మనలా కాకుండా ఈ విశ్వనాటక వీక్షణంలో కేవలం ప్రేక్షకుడై, మంచికి పొంగి, చెడుకు కృంగిపోకుండా వినోదాన్నీ, విషాదాన్నీ స్థితప్రజ్ఞుడై వీక్షిస్తూ, ఆనందాన్నీ, ఆవేదననూ కేవలం నటిస్తాడంతే.

అయితే అందులో అవసరమైన వారికి, అర్హులైన వారికి సహాయపడుతూ తృప్తిపడతాడు.

పైన... మనుమని కోల్పోయిన తాతకు ఖర్చుల నిమిత్తం అమ్మ తన వ్రేలి నున్న ఉంగరాన్నివ్వటం తన తృప్తికోసమే నన్నది సరిగ్గా అటువంటిదే.

అయితే... మనకీ ఆమెకూ గల తేడా ఏమిటంటే ఆ తృప్తి అనేది కేవలం 'నటన' అన్న విషయం విధాత స్థానంలో వున్న ఆమెకు తెలుసు. పాత్రల స్థానంలో వున్న మనకు తెలీదు... అంతే!

అందుకే అన్నారు "జగమంతా ఒక నాటక రంగం! జనమంతా పాత్రధారులు!" అని.

అయితే... ఈ జగాన్నీ, జనాన్నీ నడిపించే ఆ జగన్నాటక సూత్రధారికి మాత్రం అంతా తెలుసు.

ఈ సృష్టించేదీ, నడిపించేదీ, అంతం జేసేదీ అర్ధనారీశ్వరుడైన తానేనని. మనకి మాత్రం ఆ విషయం తెలీదు.

❀ ❀ ❀



# చింతలను బాపే చింతలతోపు

బాపట్లలో అమ్మ తల్లిగారైన రంగమ్మగారు పోయిన తరువాత అమ్మ బాపట్లనుండి స్వగ్రామం అయిన మన్నవ వచ్చేసింది. ఎందుకంటే అమ్మ తండ్రిగారైన సీతాపతిగారు మన్నవ గ్రామకరణం.

ఒక సంవత్సరం పాటు అమ్మ మన్నవలోనే వున్నా, ఆ కాలంలో ఎక్కువ రోజులు ఆమె చిన్నతనంలో తన చనుగుడిపి పెంచిన గొల్లనాగమ్మ ఇంటివద్దనే వుంటూ, మధ్య మధ్య తన తండ్రిని, అన్నగారైన రాఘవరావుని చూడటానికి మాత్రమే ఇంటికి వస్తూ వుండేది.

మన్నవ అంటే అమ్మకు ప్రాణం! బహుశా అది తాను పుట్టిన గడ్డ అయి వుండటమేనేమో!

అమ్మ మామూలు మనిషిగాక, సాక్షాత్తూ ఆదిపరాశక్తి అయినా, మానవదేహం ఇచ్చిన మాయవలన 'వున్న వూరూ, కన్నతల్లి' అనే నానుడి ఆమెకూ వర్తించింది.

అందుకనే తిరిగి మన్నవ వెళ్ళిన తరువాత ఆమె అమ్మమ్మ జానకమ్మగారు వచ్చి అమ్మను తనతోబాటు తెనాలి తీసుకువెళ్ళి సాకుతానన్నా అప్పటికి నాలుగేళ్ళ వయసున్న అమ్మ, తనను చిన్నప్పటినుంచీ పాలిచ్చి పెంచిన గొల్లనాగమ్మను వదలి నేను తెనాలి రానని తన అమ్మమ్మతో చెబుతుంది.

దానికి కారణం కూడా వున్నది. అదేమిటంటే తెనాలి అమ్మమ్మ గారింట్లో తన తల్లి తరపు బంధువులు, ముఖ్యంగా పినతల్లులు, తాను పుట్టిన తరువాత తల్లిని మింగేసిందన్న అక్కసుతో అమ్మను చులకన చేసి చూచి, సూటిపోటీ మాటలనేవారట.

అందువల్ల కూడా తరువాతి కాలంలో బాపట్ల తన పినతాతగారైన చిదంబరరావు గారింట్లోనో, లేదా మన్నవలోనో వుండేది గాని శాశ్వతంగా తెనాలి పోయి, అమ్మమ్మ గారింట్లో వున్నది లేదు. ఎప్పుడైనా బంధువులతో కలసి తెనాలి అమ్మమ్మ గారింటికి వెళ్ళినా కొద్దిరోజులకే అటు బాపట్లకో, ఇటు మన్నవకో తిరిగి వచ్చివేసేది.

అయితే అమ్మ ఎక్కువ కాలం తన నాలుగవ యేటనుంచీ తనకు వివాహమైన పిదప తన పదునాలుగవ సంవత్సరం వరకూ బాపట్లలో చిదంబరరావు గారింట్లోనే గడిపింది. దానికి కారణం తన పినతాతగారు చిదంబరరావుగారు ఒక్కరే తనను ప్రేమగా లాలించి, తనలోని దైవత్వాన్ని గుర్తించి ఆదరించేవారు. అందుకే ఆయనంటే అమ్మకు ఎంతో మక్కువ.

అయితే ఇప్పుడు తల్లి సంవత్సరీకాలు అయిపోయాక అందరూ అమ్మను బాపట్ల తీసుకువెడదామని ప్రయాణ సన్నాహాల్లో వుండగా, మన్నవ మీద వున్న మక్కువ కొద్దీ

ముఖ్యంగా వూరి బయట డ్రెయిన్ ఒడ్డున తనకెంతో ఇష్టమైన చింతలతోపును చూడటానికని ఇంట్లో ఎవరికీ చెప్పకుండా అమ్మ అటువైపు పరుగెడుతుంది.

ఆ తరువాత అక్కడ చింతలతోపులో ఏం జరిగిందో, అక్కడ తనలో గల మహామహిమాన్వితమైన కృష్ణ తత్త్వాన్ని అప్పుడే అటుగా వచ్చిన గంగరాజు పున్నయ్యగార్కి అమ్మ ఎలా బహిర్గతపరచిందో ఈ క్రిందను చదివి తెలుసుకోండి. (పే.133- జీవిత మహోదధి)

"అమ్మ అందరికంటే ముందుగా బయలుదేరి మురుగు కాల్వ కట్టమీద కూచుని తనవాళ్ళ రాకకై ఎదురుచూస్తూ 'నన్ను వదలిపెట్టి వెళితే బాగుండు వీళ్ళు' అనుకుంటూ చింత చెట్టెక్కి కూచుంటే అందరిళ్ళూ కనబడుతున్నాయి.

అమ్మ మనసులో 'యీ తోపంతా చింతలతోపే. ఈ వూరు చుట్టూ చింతలే. చింతల్లో చాలా రుచులు కూడా వున్నాయి' అనుకుంటూ ముదిరిపోయిన చింతకాయ నములూ 'ఒకే చెట్టుకు ఒకసారిగానే చిన్న చిన్న కాయలూ, పెద్దకాయలూ, పూలూ, చిగురూ దానికున్న లక్షణాలన్నీ బయటపడితే దీని స్థితి ఎలా వుంటుంది? అన్ని లక్షణాలు కలిగిన చెట్టంతా ఒకేసారి చూపించలేకపోతున్నది. ఆ లక్షణాలు, గుణములు కూడా కాలానికి కట్టుపడుతున్నాయి" అనుకుంటూ యింకా చివరికొమ్మకు వెళ్ళి నుంచోగానే కొమ్మ చిటుక్కున విరుగుతుంది. విరిగినదాని పక్కకొమ్మను పట్టుకుని 'విరిగింది మధ్యకొమ్మ. నాకు ఆధారమైనది పక్కకొమ్మ. విరిగిన దానికంటే సన్నని కొమ్మ. విరగటానికి కారణమేమిటి?' అనుకుంటూ యింటివైపు చూస్తూ "ఇదే మొదలు చింతచెట్టు ఎక్కటం, ఎక్కిన కొమ్మ విరగటం. లోగడ చిట్టికేసరపు చెట్టు, బాదంచెట్టు, కొబ్బరి, తాడిచెట్లు ఎక్కడం జరిగిందికాని, యే ప్రమాదము జరుగలేదు. బాదముచెట్టు పెళుసు అంటారుగాని విరగలేదు. పాలమనిషి 'చిట్టికేసరపు కొమ్మలు కావాలమ్మా! బర్రెకు మేతలేదు. ఆ పాలు అమ్ముకుంటేగాని అన్నం లేదు' అని యేడిస్తే అప్పుడు ఆ చెట్టు ఎక్కినపుడు కూడా ప్రమాదం జరగలేదు. అది చాలా పెళుసు అంటారు. ఇంతకూ అన్నిటికీ కాలమే ఆధారం. కొబ్బరిచెట్లు, తాడిచెట్లు కారణం కాదు" అని అనుకుంటూ అమ్మ మళ్ళీ విరిగిన కొమ్మనే పట్టుకుని ఇంకా పైన జానపొడుగు వున్న చిటారు కొమ్మనెక్కి యేదీ పట్టుకోకుండా నిలబడి, వూరు నాలుగువైపులా చూచి, "యీ కొమ్మ ఇప్పుడు విరగదేం? ఊరంతా చూపిస్తున్నది. పైగా కొమ్మ చూపిస్తున్నదా? ఊరు కనబడుతున్నదా? దానికై అది నేనే చూడగలుగుతున్నానా? మూడూ వున్నయిలే. మూడూ నేనేగా. చెట్టువున్నదని గుర్తించింది నేను. మరొక కొమ్మ నాధారం చేసుకున్నది నేను. చిటారు కొమ్మకెక్కింది నేను. ఊరు నాలుగువైపులా చూసింది నేను. ఇదంతా నేనేనని అనుకున్నది నేను."

అని అమ్మ ఇలా ఆలోచిస్తున్నంతలో గంగరాజు పున్నయ్యగారు "యీ చెట్లు వేసింది నేను" అని అనుకుంటూ చెట్టుపైనున్నఅమ్మను చూడకుండా చెట్టు క్రిందగా నడచి వెళతాడు.

పైనుంచి ఆ మాట విన్న అమ్మ...

"అదుగో అదే నేననుకున్న నేను. అదే ఎవరికి వారు నేను అనుకుంటే నేనే నేనే నేను. అంతా నేనైన నేను. నీవుగా చూడాలంటే నేను నీకై చూస్తాడు. నేను, నీవు వేరుగా చూడలేదు. అదే నేననే నేను. ఇదే 'నేతి నేతి' మహా వాక్యాలు. మా తాతమ్మ మరిడమ్మగారు మొన్న యెవరికో చెబుతుంటే విని 'నేతి నేతి' అంటే ఏమిటి? అని అడిగితే చెప్పలేదు. దానిసారం ఇదే" అని అనుకొంటూ ప్రక్కచెట్టు క్రింద వున్న తాతగారిని (ఇందాకటి ముసలాయన పున్నయ్యగారు. ఆయన కృష్ణభక్తుడు) చూచి, చిటారుకొమ్మ మీద వున్న అమ్మ "తాతగారూ! తాతగారూ!" అని పిలవగా క్రిందవున్న పున్నయ్య తాతగారు నాలుగుమూలలా జూచి, కేక ఎక్కడో అంతుబట్టక చివరకు చిటారుకొమ్మవంక చూచి అదిరిపోయి...

"అమ్మో! పొన్నచెట్టుమీద కృష్ణుడు కనబడుతున్నాడు. నుంచున్నాడు. రండర్రా!" అని పెద్దగా కేకవేసి అనుకోకుండా నమస్కారము చేసి అమ్మ వున్న చెట్టు క్రిందకు పరుగెత్తుకు వస్తారు. 'తనకేక వూరంతా వినబడ్డది' అని అనుకుంటాడు. (అమ్మ నుంచున్న కొమ్మకు పైన యింకా ఏ కొమ్మలూ లేవు. అనగా వృక్షాగ్ర భాగాన ప్రక్కను ఏ ఆధారమూ లేకుండా అమ్మ కేవలం గాలిలో నిలబడినట్లు నిలబడి వుంటుంది.'

అమ్మకు అప్పుడు ఐదు సంవత్సరముల ఆరు మాసములు."

భక్త పాఠకులారా! అమ్మ కేవలం రాజరాజేశ్వరి అవతారమనే కాదు, ఆమె కృష్ణుని అంశ అని కూడా పై సంఘటన తెలుపుతున్నది. అయితే మనమింకొక విషయం గురించి కూడా ముచ్చటించుకోవాలి. కేవలం అయిదున్నర సంవత్సరాల బాలికగా అమ్మలోని అద్వైత తత్త్వ చింతననూ, మహా మహా పండితులను మించిన తార్కిక వాదననూ గమనించండి.

"ఈ చెట్లు వేసింది నేను" అని అనుకుంటూ తాను కూచున్న చింతచెట్టు క్రిందనుంచి వెడుతున్న పున్నయ్యగారిని చూసి అమ్మ ఏమనుకున్నదో చూడండి.

"అదుగో అదే నేననుకున్న నేను. అదే ఎవరికి వారు అనుకునే 'నేనే నేననే నేను. అంతా నేనైన నేను'. నీవుగా చూడాలంటే 'నేను' నీవై చూస్తాడు. నేను, నీవులను వేరుగా చూడలేదు. అదే నేననే నేను. యిదే 'నేతి నేతి' మహా వాక్యాలు."

అంటే... దీని అర్థం... నీవు నీకంటితో చూస్తున్న ప్రతీ దృశ్యం నీ శరీర భాగమైన కంటిది కాదు. అలా చూసేది నీ హృదయకుహరంలో, ఒక జ్యోతి రూపంలో వుండే 'ఆత్మ' మాత్రమే. అదే 'నేను' అనుకునే అసలైన 'నీవు'. ఆ 'నీవే' నీ భౌతిక శరీరంలోని నీ పాదాలవ్రేళ్ళ చివరినుంచి నీ తలపైగల రోమాల చివరి వరకూ పరుచుకుని వున్నది. నీ

యొక్క పంచతన్మాత్రలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల ద్వారా నీ శరీరావస్థలను అనుభవిస్తున్నదిఅదే. నీ ఉనికి అయిన నీ ఆత్మది.

అది నీ భౌతిక శరీరంలోని చెవుల ద్వారా శబ్దాన్నీ, నీవంటి పై నున్న చర్మం ద్వారా స్పర్శనూ, కనుల ద్వారా ఎదుటి వస్తువుల రూపాన్నీ, నీ నాలుక ద్వారా రసము (రుచులు) నూ, నీ ముక్కు ద్వారా వాసన (గంధము)నూ అనుభవిస్తున్నది.

అయితే నీ భౌతిక శరీరమే 'నేను' అనుకునే నీకు ఆ సంగతి తెలియదు. 'నేతి' అనే మాటకు 'కాదు' అని అర్థము. 'నేతినేతి' అంటే ఇదికాదు... ఈ చెవి కాదు. ఈ చర్మం కాదు. ఈ కన్ను కాదు. ఈ నాలుక కాదు. ఈ ముక్కు కాదు... ఇవేవీ కాదు. ఆ అనుభవాలన్నీ ఆత్మవే. 'నేను' అనబడే ఆత్మవే అని.

పైన అమ్మ అన్నమాటలు "నీవుగా చూడాలంటే 'నేను' 'నీవై' చూస్తాడు"కు అర్థం, నీవు చూడాలనుకున్నదీ, చూస్తున్నాననుకున్నదీ నీవు కాదు. నీలోని ఆత్మారాముడైన 'నేను' అని.

అందుకే జ్ఞానులైన మన పెద్దలు తమకు ఆకలి వేసినప్పుడు ఇంత అన్నం తిని ఆకలిని తీర్చుకోవటాన్ని "ముందు ఇంత అన్నం తిని లోపల వున్న ఆత్మారాముడ్ని తృప్తిపరచుకోవాలి" అని అనేవారే కాని, అన్నం తిని ఆకలిని తీర్చుకోవడం ద్వారా శరీరాన్ని తృప్తి పరచుకోవాలని అనేవారు కాదు.

అన్నం తినడం ద్వారా లోపలనున్న ఆత్మారాముడు తృప్తి చెందితే మొత్తం శరీరం తృప్తిపడినట్టే.

అంతటి చిన్నవయసులో ఏ ఆధారమూ లేకుండా చింతచెట్టు చివరి కొమ్మన నిలబడి చూస్తున్న అమ్మకు చుట్టూ తనకు కనబడే వూర్లు, తన కాళ్ళక్రింద వున్న చెట్టు, దానిక్రింద నున్న భూమి అన్నీ తానేననే అద్వైత భావన కలిగిందంటే... ఆమె మామూలుగా మన కంటికి కనబడే ఒక సామాన్య గ్రామ కరణం (మన్నవ సీతాపతి) గారి కుమార్తె కాదు. ఆమెగా మానవ దేహం దాల్చి మన కంటిముందు నిలచిన రాముడు, కృష్ణుడు మొదలగు దేవాదిదేవుళ్ళకు అధిదేవతయైన ఆదిపరాశక్తి!

సరే... ఇప్పుడు మళ్ళీ గంగరాజు పున్నయ్యగారి విషయానికి వద్దాం.

వృక్షాగ్రభాగాన తన యిష్టదైవం చిన్ని శ్రీకృష్ణునిగా కనుపించిన ఆ చిట్టితల్లిని మళ్ళా చూసేందుకు పున్నయ్యగారు ఆ చింతచెట్టు క్రిందికి వస్తారు.

అప్పుడేమైందో మళ్ళీ జీవిత మహోదధిని చదివి తెలుసుకుందాం. (పే. 135-జీవిత మహోదధి)

"చెట్టు క్రిందకు వచ్చి తలయెత్తి పైకి చూచి ఇదివరకు తాను చూచిన కృష్ణుడు కనబడక "అయ్యో! అయ్యో! కృష్ణుడేడి! కృష్ణుడేడి?" అని ప్రక్కనున్న రోడ్డుమీదకు పరుగెత్తుతాడు పున్నయ్యగారు.

అమ్మ అట్లాగే వృక్షభాగాన నిలబడి చూస్తూ వుంటుంది. పున్నయ్యగారు వెళ్ళిన చోటునుండి తిరిగి చూస్తాడు. ఇందాక కనబడిన దృశ్యానికి కృష్ణుని తలవెనుక భాగాన ఒక చక్రమున్నట్లుగా కనబడును.

"అదుగో కృష్ణుడు! చక్రధారి వస్తున్నాడని" పాడుకొనుచు నృత్యము చేస్తాడు.

అమ్మ మెల్లగా చెట్టు దిగి, నృత్యము చేయుచున్న పున్నయ్యగారి దగ్గరకు వెళ్లి "తాతయ్యా! ఏమిటి ఆడుకుంటున్నావు? నేను కూడా వచ్చేదా ఆడుకోటానికి? యీ ఆట పేరేమిటి? పలుకు. వచ్చాడా? వస్తున్నాడా?" అని అనగానే నృత్యము చేస్తున్న పున్నయ్యగారు అమ్మను కౌగలించుకుని, యెత్తుకుని, భుజము మీద పడుకోబెట్టుకుని వూళ్ళోకి పరుగెత్తుతాడు. (ఎందుకంటే అమ్మ అప్పటికీ కృష్ణునిగానే దర్శనమిచ్చు చుండును.)

ఊళ్ళోకి రాగానే యిల్లు గుర్తించక వూరంతా తిరుగుతూ వుంటాడు.

ఊరు ప్రజలంతా అదిచూసి "ఆయన కృష్ణభక్తుడు గాదూ! తల్లిలేని పిల్లను చూచేసరికి ఆవేశముతో ఆమెను ఎత్తుకుని నామము చేసుకుంటూ వూరువెంట తిరుగుతున్నాడు" అని అనుకుంటారు. మరియు ఎప్పుడూ బజార్ల వెంట తిరగనివాడు యిప్పుడు ఇలా తిరుగుతున్నాడు. పిచ్చికూడ ఎక్కుతుందేమో ననుకుంటారు. ఆయన తమ్ముడు గంగరాజు రామసుబ్బయ్యగారు అన్నగార్ని వెంబడిస్తాడు పిచ్చి యెక్కిందేమోనని భయపడి.

గంగరాజు పున్నయ్యగారు, తన యిల్లు కూడా గుర్తించనివాడు, నామము చేస్తూ, ఊరు చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణము చేసి మూడోసారి సీతాపతి తాతగారు (అమ్మ తండ్రి) యింట్లోకి ప్రవేశించగానే నామము ఆగిపోయి నిశ్చేష్టుడై వసారాలో కాస్సేపు అలాగే నిలబడి వుంటాడు. ఆయన భుజము మీద వున్న అమ్మ దిగటానికి కూడా వీలులేని స్థితిలో పున్నయ్యగారు చేతులతో ఆమెను గట్టిగా బిగించి పట్టుకుని వుంటారు. కాస్సేపయిన తరువాత మళ్ళీ తన్మయత్వంలో పడి, ఈసారి చేతులు వదలి నృత్యం చేస్తూ వుంటారు.

ఏదో అపశకునము ఎదురై ప్రయాణమును ఆపిన యింట్లోని వారంతా ఈ హడావిడికి పరుగు పరుగున బయటకు వచ్చి, గుమ్మంలో అమ్మను ఎత్తుకుని నుంచుని, చేతులు వదిలి తన్మయత్వంతో నృత్యం చేస్తున్న పున్నయ్యగారిని, ఆయన భుజాన్ని గట్టిగా కరుచుకుని పట్టుకున్న అమ్మను చూచి కంగారుపడతారు.

అమ్మ పడుతుందేమోనని చిదంబర్రావుగారు అమ్మను తీయబోతే, పున్నయ్యగారిని కరుచుకుని వున్న అమ్మ రాదు.

"ఏం బెట్టి అతికించాడీయన?" అనుకుంటూ చిదంబర్రావుగారు అమ్మను గట్టిగా లాగబోయారు. అప్పుడు వారిద్దరి మధ్యా సంభాషణ ఈ విధంగా సాగుతుంది. (పే. 136– జీవిత మహోదధి)

"ఏం బెట్టి అతికించాడీయన?" అన్న చిదంబర్రావుగారి మాటకు,

అమ్మ: ఆయనలో వున్న నేను, నాలో వున్న నేను, పెట్టి అతికించాడు.

చిదంబర్రావు: అయితే ఆత్మ పెట్టియా?

అమ్మ: ఆత్మ పెట్టేది కాదు. ఆవరించేది. ఆవరించే వున్నది.

చిదంబర్రావు: ఆ మాటకు అర్థం వివరంగా చెప్పు.

ఇంతలో పున్నయ్యగారు నృత్యమును ఆపి, అమ్మను మామూలుగా యెత్తుకుని వింటూ వుంటాడు– తెలిసీ తెలియని స్థితిలో.

అమ్మ: ఆత్మ అంటే నే చెబుతా. నాకు తెలియదు. యెవరన్నా చెప్పుకునేవి చెబుతా. దానికి చెప్పాలంటే చాలా అర్థముంది. ఒక్కమాటలో చెప్పాలా?

అని అమ్మ పున్నయ్యగారి భుజం నుండి క్రిందకు జారి, గుండ్రని సున్నా నేలమీద చుట్టి, "యీ సున్నాలో ముఖ్యమైన ప్రదేశమేది?" అని అడిగింది.

చిదంబర్రావు: సున్నాలో చెప్పమంటావా? సున్నా చుట్టటానికి ఆధారం చెప్పమంటావా?

అమ్మ: సున్నాలో తెలిస్తే యిది చెప్పినట్టే.

చిదంబర్రావు: గీటు కూడానా?

అమ్మ: లోపల వున్న ప్రదేశము.

చిదంబర్రావు: అంతా ముఖ్యమే.

అమ్మ: గీత మీద యేది ముఖ్యము?

చిదంబర్రావు: బయలుదేరింది ముఖ్యము.

అమ్మ: బయలుదేరటానికి యేది ముఖ్యము?

చిదంబర్రావు: సంకల్పము.

అమ్మ: వేలు, గోరు, భూమి యీ మూడూ ముఖ్యం గావా, సంకల్పము దాకా పోయారు?

చిదంబర్రావు: ఈ మూడూ సంకల్పానికి సంబంధించినవేగా?

అమ్మ: సంకల్పము ఆకృతి లేనిది. యీ మూడూ ఆకృతి కలిగినవి. సంకల్పము కాదని కాదు... యీ మూడూ చెప్పి సంకల్పం దగ్గరకు వెళ్ళాలి.

చిదంబర్రావు: (నవ్వుతూ) ముందుగా అక్కడికెందుకు వెళ్ళకూడదు?

అమ్మ: వెళ్ళకూడదని కాదు. క్రమంగా వస్తే, కానిదేమిటో తేలుతుందని.

ఈ విధంగా అమ్మ చిదంబర్రావు తాతగారితోను, అక్కడ వున్న మిగిలిన పెద్దలు, మరిడమ్మగారు, వెంకట సుబ్బయ్యగారు మొదలైన వారితో తర్కవితర్కాలూ, వాదనలు చేస్తూండగా... ఉన్మత్తస్థితి నుండి తెలిసీ తెలియనిస్థితికి, తర్వాత మామూలు స్థితికి వచ్చిన పున్నయ్యగారు అదంతా వింటూ అంతకు ముందు కృష్ణపరమాత్మను గురించి అమ్మ చెప్పిన మాటకు తనకు తెలిసిన అర్థము చెబుతూ–

"కృష్ణ పరమాత్మ స్థితి మనకు లేదు గనుక, ఆ తల్లికి వున్నది గనుక ఆ అర్థము వచ్చింది" అంటాడు.

అందుకు అమ్మ "కృష్ణ పరమాత్మ స్థితికీ, కృష్ణుడికి తేడా వుంటుందా?" అని అడిగిందాయనను.

దానికి పున్నయ్యగారు "ఏమోనమ్మా! అంతగా చెప్పలేను. నీవంక చూడగా, చూడగా కిష్టప్పేమోనని అనుమానమొస్తోంది" అన్నారు.

"అనుమానమేగా. అవున్లే, అనుమానమే లేకపోతే నన్ను 'కిష్టప్పా' అని పిలిచేవాడివిగా" అంది అమ్మ.

అప్పుడు అక్కడే వున్న అమ్మ తాతగారు, అంటే అమ్మ తల్లిగారైన రంగమ్మగారి తండ్రి వెంకటసుబ్బారావుగారు అమ్మతో–

"కృష్ణునికీ, కృష్ణతత్త్వానికీ తేడా అనే ప్రశ్న మేమే వేశాం. నువు చెప్పు సమాధానం" అన్నారు.

అప్పుడు అమ్మ "కృష్ణతత్త్వమంటే కృష్ణుడి లక్షణాలు కలిగింది కృష్ణతత్త్వం. కృష్ణుడంటే కృష్ణుడే! కృష్ణుని గురించి చెప్పుకోవడానికి పురాణాలే ఆధారమైనవి. ఆ పురాణాలు చెప్పిన లక్షణాలు ఎక్కడ వుంటే అక్కడ వాటిని కృష్ణతత్త్వాలు అంటున్నాము మనము" అంది.

ఆమె అలా అంటుండగానే అమ్మవైపే చూస్తున్న పున్నయ్యగారు మళ్ళీ తన్మయావస్థలోకి వెళ్ళి–

"వాడే వీడు. వీడే వాడు. అప్పుడు ఆ ఆకారముతో వచ్చాడు. ఇప్పుడు యీ ఆకారంతో వచ్చాడు" అంటూ స్పృహ తప్పి పడిపోతాడు.

అతడు పొద్దుట మాదిరిగానే తన్మయావస్థలో వున్నాడని అక్కడ వున్న వారందరూ లేచి నుంచుని ఆయన వంక చూస్తూ వుంటారు.

అంతలోనే ఆయన మూతీ, చెయ్యి, కాలు పక్షవాత మాకారముగా మారివుంటుంది.

ఇంతలో మరిడమ్మగారు "ఇంతకూ ఈ ప్రయాణమాగడానికి కారణం యిదిరా!" అంటూ అమ్మవంక చూసి మళ్ళీ పున్నయ్యగారి వద్దకు వెళ్ళి "కొంపదీసి ప్రాణం పోలేదు కదా!" అని ఆయన నాడి చూస్తుంది.

"ప్రాణం పోయినట్టున్నదే" అని అంటుంది. కాని, ప్రాణం పోలేదు. కొద్దిగా కొనవూపిరి వుండును. పున్నయ్యగారిని అందరూ వారి యింటికి తీసుకువెడతారు. (నిజానికి ఆ రాత్రి రెండు గంటల వరకూ ఆయన ప్రాణం పోదు.)

తర్వాత అమ్మ పున్నయ్యగారిని చూడటం కొరకు వారి యింటికి వెడుతుంది.

అమ్మ పోయి నుంచోగానే ఆయన కన్నెత్తి అమ్మవంక చూచి కదలని చెయ్యి కదిలించి అమ్మకు నమస్కారం చేసి నంగి మాటలతో-

"చెట్టుమీద నుంచుంది నువ్వే! నువ్వే!" నని తల పైకెత్తి, కళ్ళు పెద్దవి చేసి, లేవబోయి "నీవే నీవే" నని వెనక్కుపడి పరమాత్మలో అంటే అమ్మలో ఐక్యమవుతాడు."

భక్త పాఠకులారా! కేవలం ఐదున్నర సంవత్సరముల ముద్దులొలికే చిన్నపిల్ల 'నేను' ను గురించి తలలు పండిన పెద్దలతో అంత వివరంగా, అద్వైత, తార్కిక వాదనలు చేసిందంటే, పై పెచ్చు ఆత్మ తత్త్వమును గురించి నేలమీద గుండ్రని సున్నా చుట్టి, ఆ సున్నాలో ఏది ముఖ్యమని అడిగిందంటే ఆమె సామాన్యమైన మానవ బాలిక కాదు. ఆ రూపంలోనున్న జగన్మాత!

కనుకనే సున్నాలో అంతా ముఖ్యమేననే తాతగారి జవాబునకు 'మరి చుట్టూ గీసిన గీత మీద ఏది ముఖ్యం?" అని అడిగింది.

దానికి తాతగారు గీత బయలుదేరిన చోట ముఖ్యం అంటే, మరి ఆ చోటుకి ఏది ముఖ్యమని అమ్మ అడిగిన ప్రశ్నకు సంకల్పమని చెప్పారు వారు.

దానికి అమ్మ "సంకల్పం కనబడనిది. ఈ గీత ఉనికికి ముఖ్యమైనది. చేతివేలు, గోరు, క్రింద వున్న నేల అనీ, ఆ తరువాతనే గీత గీద్దామనే సంకల్పమనీ ఒక క్రమంలో వివరించి చెప్పింది అమ్మ.

దీనిని బట్టి, గీత మన శరీరమైతే, దాని కాధారమైన నేల ఈ లోకమైతే, ఆ గీతను నేలమీద సున్నా రూపంలో గీసిన గోరు, వేలు ఆ గీత సృష్టికి కారకములైతే ఆ సృష్టి కారకములకు ప్రేరణ కలిగించింది సంకల్పమనే భగవంతుడు.

అందుకే మనకు జీవితంలో జరిగే అనేక సంఘటనలకు మూలం కేవలం "భగవత్సంకల్పం" అని మనం వాడే మాటను మార్చి "భగవత్సంకల్పం కాదు, సంకల్పమే భగవంతుడు" అని తరువాతి రోజుల్లో తనకు వివాహమై జిల్లెళ్ళమూడిలో నివసించిన తరుణంలో తన భక్తులకు వివరణ ఇచ్చింది అమ్మ.



# మూగజీవులకు కూడా కైవల్యం కలిగించిన అమ్మ

భక్త పాఠకులారా! కృష్ణభక్తుడైన పున్నయ్యగారికి అమ్మ కృష్ణుని రూపంలో కనబడి, అవసానదశలో వున్న ఆయన వద్దకు వెళ్ళి తనలో కలుపుకున్నదని పైన చదువుకున్నాం కదా.

అదేవిధంగా తన భక్తులైన మానవులనే కాదు, తన చుట్టూ తిరిగే ఎద్దు, కుక్క మొదలైన మూగజీవాలను కూడా వాటి అవసాన దశలో స్వయంగా వెదుక్కుంటూ వెళ్ళి వాటిని స్పర్శించి, తనలో కలుపుకున్న ఉదంతాన్ని ఇప్పుడు తెలుసుకుందాము.

ఒకసారి అమ్మ తన తండ్రిగారైన సీతాపతిరావుగారు, అన్నగారైన రాఘవరావులతో తెనాలి వెడుతుంది.

ముగ్గురూ తెనాలిలో రైలు దిగగానే తండ్రీ, అన్నగారు టి.సి.కి టిక్కెట్టివ్వడానికి అటువెళ్ళగా, ఏదో పని వున్నట్లు అమ్మ గబగబా స్టేషన్ బ్రిడ్జి ఎక్కి స్టేషన్ బైటకు వెడుతుంది.

ఎందుకంటే, అక్కడ స్టేషన్ బయట ఒక మూగజీవి తన రాకకై ఎదురుచూస్తున్న దని తెలుసు. మరి, తను దానికీ అమ్మే కదా! అందుకే, ఆ తల్లిప్రేమలో తలమునకలయి, బిడ్డను వీక్షించే తొందరలో "సిరికిం జెప్పడు శంఖ చక్రయుగముం జేదోయి సంధింపడే' అన్నట్టుగా, తనవెంట వున్న పెద్దవారికి కూడా చెప్పకుండా, వారిని తప్పించుకుని ఆతృతగా, వడివడిగా అమ్మ స్టేషన్ బయటకు వచ్చి, అక్కడ వున్న గుర్రపు బళ్ళు, ఒంటెద్దు బళ్ళవైపు వెడుతుంది. అప్పుడు అమ్మ వయసు సుమారు ఆరు, ఏడు సంవత్సరముల మధ్య వుండవచ్చు.

అప్పుడేమయిందో ఈ క్రింద చదివి తెలుసుకోండి. (పే.192- జీవిత మహోదధి.)

"ఆనాడు (అంటే- 1929-30 సంవత్సరముల మధ్య) తెనాలి స్టేషన్ బ్రిడ్జికూడా యిట్లా వుండదు. అదోరకంగా వుంటుంది.

అమ్మ స్టేషన్ నుంచి బయటకు ముందుగానే వెళ్ళి ఒంటెద్దు, గుర్రపుబళ్ళు వున్న చోట నుంచుంటుంది. అమ్మ నుంచున్న బండి ఎద్దుకు జబ్బుగా వుంటుంది. అందుకే అమ్మ సరాసరి ఆ ఎద్దు వద్దకు వెడుతుంది.

"బండి ఎంతకు కడతావబ్బాయి" అంటూ ఎద్దును సవరిస్తుంది అమ్మ.

అమ్మ దానిమీద చెయ్యిపెట్టి నిమరగానే ఎద్దు ఉలిక్కిపడి గజగజ వణుకుతుంది.

"ఏయ్ అమ్మాయి, ఎద్దుజోలికి రాబోకు" అంటాడు బండివాడు. అలా అన్నా అమ్మ ఎద్దును సవరదీస్తూనే వుంటుంది.

అదిచూచి, "నీకు కాదా చెప్పేది?" అని బండివాడు కొరడా తీసుకు ఒక్కటి వేస్తాడు. కొరడా దెబ్బ అమ్మకు తగిలి ఎద్దుకు తగులుతుంది. ఎద్దు వులిక్కిపడి కాడి వదిలిపెట్టి, అమ్మ కాళ్ళమీద ముట్టిపెట్టి కింద పడుతుంది- అమ్మను కంటితో చూస్తూ.

ఆ బండి మనిషి యెద్దు దగ్గరకు వచ్చి అమ్మ పాదాల వంక, యెద్దు ముఖము వంక చూస్తాడు. చూసి "ఇదేమిటమ్మాయి? యెద్దును కాస్తా బెదరపెట్టావు. అసలే చావుకు సిద్ధమయింది. వారము రోజులనాడు చచ్చిపోతుందనే అనుకున్నాను. కాని,ఎందుకు బ్రతికిందో బ్రతికింది. అవస్థపడి పడి ఆశ వదులుకుని సర్వం భగవంతుని మీదనే భారం వేసి యెద్దుకు మేతవేసి పడుకున్నా. మళ్ళీ నేను లేచేటప్పటికి మేత కొరికింది. ఎప్పుడూ మెడకు కట్టిన తాడు తెంచటం కాని, వేసిన గడ్డి తినకపోవటం గాని యెంత దూరం బండి కట్టినా యెదురు తిరగటంకాని యెరుగదు. ఆ రోజు జబ్బు చేస్తే దేముడికి మొక్కుకున్నా. నయము చేస్తే యేమన్నా ఇస్తాననే బదులు, నయము చేస్తే యెద్దునిస్తానని యివాళే బండి కట్టాను."

అతను యీమాట అనే సమయంలో తాతగారు, అమ్మ అన్నయ్య రాఘవరావు యెవరో తెలిసిన మనిషితో మాట్లాడుతూ వస్తూ వుంటారు. రాఘవరావు ముందుగా ఇంటికి వెళతారు.

ఎద్దు రెండు కళ్ళు తెరచి, అమ్మవంక చూసి ప్రాణాలు విడుస్తుంది. యెద్దు వర్చస్సు (రూపము) యిన్నాళ్ళనుంచి అమ్మ కోసమే ఆగి వున్నానన్నట్టుగా వుంటుంది. జ్ఞానం కలగటానికి మానవ జన్మే అక్కరలేదు."

భక్త పాఠకులారా! దీనిని బట్టి మనకు తెలిసిందేమిటంటే అవసానదశలో స్టేషన్ బయట వున్న ఆ యెద్దును స్వాంతనపరచి, తనలో సాయుజ్యపరచుకుందుకే అమ్మ తనవారికి కూడా చెప్పకుండా ముందుగా స్టేషన్ బయటకు వచ్చిందని.

ఆ యెద్దు కూడా తన చివరి క్షణాలలో సాక్షాత్తూ భగవంతుడే తన వద్దకు వచ్చాడని గ్రహించి యిన్నాళ్ళుగా నీ కోసమే ఎదురు చూస్తున్నానన్నట్టుగా తనముందు నుంచున్న అమ్మవంకే చూస్తూ, అమ్మ పాదాలపై తన ముట్టి నాన్చి ప్రాణాలు వదలి, వారం క్రిందట తనకు జబ్బు చేసినప్పుడు తన యజమాని (బండివాడు) మొక్కు కున్నట్టుగా అమ్మకు తనను తానర్పించుకుంటుంది. కాదు... అమ్మే ఆ బండివాని మొక్కును తీర్చే నెపంతో ఆ యెద్దును తనలో కలుపుకునేందుకు స్వయంగా అక్కడకు వెళ్లింది.

అందుకే "జ్ఞానం కలగడానికి మానవజన్మే అక్కరలేదని" అమ్మ అన్నది ఇందుకే.

నిజానికి మానవులలో కన్నా జంతువులలోనే జ్ఞానం ఎక్కువ. ఎటొచ్చీ మనం దానిని తోటివారికి వివరిస్తాం. నోరు లేని ఆ జీవులు వివరించలేవు. అయితే మానవుల కన్నా అవే దేవునికి నిస్వార్థంగా సేవ చేస్తాయి. అంటే కర్మసన్యాసం అన్నమాట!

అటువంటిదే ఈ క్రింది ఉదంతం.

అమ్మ తన వివాహమైన తరువాత పద్ధెనిమిదవ యేట తన పెద్దకుమారుడైన ఆరు నెలల సుబ్బారావును ఎత్తుకుని నాన్నగారివెంట 1941వ సంవత్సరములో జిల్లెళ్ళమూడికి వచ్చింది. నాన్నగారిది జిల్లెళ్ళమూడి కరణీకం.

ఆ విధంగా వచ్చిన తరువాత అన్న వితరణనే తన ధ్యేయంగా పెట్టుకుని మధ్య మధ్యలో అవసరాన్ని బట్టి తన మహిమలను చూపినా, ఒక కరణంగారి భార్యగా సామాన్య గృహిణి వలెనే ఏమీ తెలియనట్లు ప్రవర్తించేది. తనను చూడవచ్చిన వారందరికీ వండి వార్చేది.



"ఈ చపాతీ నీకోసమే నాన్నా!"

ఆ తరువాత కాలంలో, అంటే తన ముప్ఫైఐదవ ఏట అమ్మ తన అవతార ప్రకటన చేసింది. అదుగో అప్పటినుంచే ఆమెకోసం తండోపతండాలుగా భక్తులు ఆమెను కొలుచుకునేందుకు జిల్లెళ్ళమూడికి వచ్చేవారు. అది 1950 దశకపు ఉత్తరార్థం.

ఇంచుమించు 1958 ఆ ప్రాంతంలో అమ్మ దగ్గర చాలమంది భక్తులు చేరి, కొంతమంది జిల్లెళ్ళమూడిలో శాశ్వత నివాసాలను ఏర్పరచుకుని, అటు అమ్మకు, ఇటు ఆశ్రమానికి వచ్చే పోయే భక్తులకు భోజన సదుపాయాల నేర్పరిచే పనిలో నిమగ్నమయ్యేవారు.

విచిత్రమేమిటంటే- ఆ మహత్కార్యంలో జ్ఞానులైన మానవ భక్తులే గాక నోరులేని ఒక శునకరాజం కూడా పాల్గొనేది.

అది మామూలు కుక్క కాదు. దానికి ఏడు సంవత్సరముల వయసున్నప్పుడు గ్రామస్థులు ఊళ్ళో వున్న కొన్ని పిచ్చి కుక్కలను కొడుతూ దీన్నికూడా కొట్టగా, తీవ్రంగా దెబ్బలు తిన్న అది చావుబ్రతుకుల మధ్య ప్రాణభయంతో పరుగు పరుగున వచ్చి పూరింట్లో చొరబడి, అక్కడ మజ్జిగ చిలుకుతున్న అమ్మ పాదాలముందు వ్రాలిపోయిందట. అమ్మ దానిని అక్కున చేర్చుకున్నది.

అది అమ్మ మజ్జిగ చిలికినపుడు క్రిందపడిన మజ్జిగ చుక్కలు త్రాగి, అమ్మ పెట్టిన తిండి తిని, ఆరోగ్యవంతురాలై, సుమారు పధ్నాలుగు సంవత్సరముల పాటు అమ్మ సేవలో జీవితం గడిపిన ధన్యజీవి.

దానిని గురించి అమ్మకు, సంస్థకు అది చేసిన సేవను గురించి - తన జీవితాన్నంతటినీ అమ్మ సేవకై అంకితం చేసిన, ఇప్పటికీ తన డెబ్భైవ పడిలో అమ్మ సేవ చేసుకుంటున్న శ్రీమతి బ్రహ్మాండం వసుంధర డైరీ రూపంలో "శ్రీవారి చరణ సన్నిధి" అనే గ్రంథంలో వ్రాసిన విషయాన్ని ఈ క్రింద చదవండి.

(పే.98 నుంచి 102 వరకు- "శ్రీవారి చరణ సన్నిధి")

"సంస్కారమనేది మానవులలోనే గాక మిగతా జీవజాలంలో కూడా వున్నదని మనకు తెలియజెప్పిన ఆ కుక్కను గురించి చెప్పుకోవాలంటే విజ్ఞాన వంతులం, వివేకవంతులం అని అనుకుంటున్న మనకంటే, దాని వివేకం, విజ్ఞానం ఎన్నోరెట్లు విశాలమైనది.

అమ్మను అది ఎంత ప్రాణప్రదంగా ప్రేమించేదంటే... అమ్మకు ఏ చిన్న బాధ కలిగినా, ఎవరైనా కలిగించినా అది సహించలేకపోయేది. అమ్మ బాధపడుతున్నపుడు కన్నీళ్ళు కారుస్తుండేది. అమ్మకు ఎవరైనా బాధను కలిగించినపుడు అవతలివాళ్ళ అంతు కనుక్కునేదాకా వదిలిపెట్టేది కాదు.

దాని చూపులో, నడకలో, నడతలో అమ్మకోసం ఏ క్షణంలోనైనా ఆత్మార్పణ చేయగల త్యాగం, ధైర్యం కనిపిస్తుండేవి. అనేక సంఘటనలలో అమ్మకు తల్లిగా, తోడుగా, మిత్రునిగా ప్రవర్తించేది. అందుకే ఒక సందర్భంలో అమ్మ దాన్ని గురించి ఒక్కమాటలో అన్నది.

"మనిషి మనిషినీ ఎంత దూరం ప్రేమించవచ్చో అంత దూరం అది ప్రేమించగలదు" అని.

ఎప్పుడైనా ఇంట్లో పిల్లలకు జబ్బుగా వుంటే అమ్మకు వాళ్ళ దగ్గర కూచునే అవకాశం లేనపుడు, లేదా, అమ్మ ఏదో పనిలో వున్నప్పుడు అమ్మ ఆ పని పూర్తిచేసుకుని వచ్చేవరకూ వాళ్ళ దగ్గర కూచునేది. ఇంటికి ఎవరైనా కొత్త మనిషి వస్తే అమ్మదగ్గరకు వెళ్ళి తాకి,

సంజ్ఞ చేసి చెప్పేది. అరవటం కాని, కరవటం కాని లేవు. ఇటువంటి లక్షణాలతో కుక్కలన్నింటిలోకి ప్రత్యేకంగా వుండేదది.

అమ్మ చరిత్రలో విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించాల్సిన యోగ్యత దానికున్నది."

భక్త పాఠకులారా! ఆ కుక్కను గురించి పై గ్రంథములో వ్రాసిన విషయములు గాక, ఆ కాలంలో అమ్మను సేవించుకుని, ఆమె తరువాత ఇప్పటికీ అక్కడ (జిల్లెళ్ళమూడిలో) వుండి సేవించుకుంటున్న భక్తులు కొందరు... ముఖ్యంగా అమ్మ చిన్నకుమారులు శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు (రవి అన్నయ్య, అమ్మ సంస్థ అయిన 'విశ్వజననీ పరిషత్'కు పాట్రన్) గారు చెప్పిన దానిని బట్టి...

ఆ కుక్క అక్కడకు (జిల్లెళ్ళమూడికి) వచ్చిన భక్తులకు కూడా తన శైలిలో సేవలు చేసేదట.

ఇప్పటిలాగా ఆ రోజుల్లో బాపట్ల-పెదనందిపాడు రోడ్డులో ఏడవ మైలు (11వ కిలోమీటరు) నుంచి లోపలకు వున్న జిల్లెళ్ళమూడికి రోడ్డు సౌకర్యం లేదు. చీకట్లో, వానలో జారూ బురదలో, ఎండలో పడుతూ లేస్తూ దారి వెదుక్కుని భక్తులు వచ్చేవారు.

అటువంటి వారిని ఈ కుక్క దగ్గర వుండి వారికి దారి చూపుతూ, ముందు నడిచి జిల్లెళ్ళమూడికి తీసుకువచ్చేదట. అలాగే ఇక్కడ అమ్మ దర్శనం చేసుకుని తిరిగివెళ్ళే భక్తులను ఏడవ మైలు వరకూ సాగనంపేదట.

పొద్దుపోయి చీకట్లో ఏడవ మైలువద్ద బస్సు దిగి వచ్చేవారికి దారి చూపేందుకు నోటితో చిన్న లాంతరు పట్టుకుని మరీ అక్కడ సిద్ధంగా వుండి, వారిని ఆ లాంతరు వెలుగులో జిల్లెళ్ళమూడికి చేర్చేదట. అటువంటి భక్తులలో ప్రస్తుతం ఇక్కడ నివసిస్తున్న శ్రీ టి.టి.అప్పారావుగారు ఒకరు.

ఇక అమ్మ చిన్న కుమారులు శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావుగారు చెప్పిన ప్రకారం ఒకరోజు వారు, వారి మిత్రులతో పాటు బాపట్ల వెళ్ళడానికి ఏడవ మైలు బస్‌స్టాప్ వద్దకు వచ్చేసరికి వారు బాపట్ల తీసుకువెళ్ళవలసిన ఒక ముఖ్యమైన వస్తువును మరచిపోయారట.

అప్పుడు ఒక చీటీ వ్రాసి వారివెంటే ఏడవ మైలు వద్దకు వచ్చిన ఆ కుక్కమెడలో కట్టి జిల్లెళ్ళమూడికి పంపిస్తే అది వెళ్ళి ఆ చీటీ చూపించి, అట్నుంచి ఒక మనిషి ద్వారా ఆ వస్తువును వారికి తెచ్చిపెట్టిందట. అలాగే రవి అన్నయ్య వ్రాసి, దానిద్వారా పంపిన చీటీ ప్రకారం, ఆకలితో వున్న రవిఅన్నయ్యకు ఇంటినుంచి భోజనం క్యారియర్ తెప్పించిందట!

అటువంటి ఆ నిస్వార్థజీవి, కర్మసన్యాసిని అంతిమదశ ఏ విధంగా ముగిసిందో తెలుసుకోండి. (పే.98-శ్రీవారి చరణ సన్నిధి.)

"తే. 3. 8. 64–

సాయంత్రం ఆరుగంటల నలభైఐదు నిముషములు అయినది. అమ్మ దగ్గర కూచున్న చంద్రమ్మక్కయ్య మాటల సందర్భంలో అమ్మతో–

"రోజూ వచ్చే పెద్దకుక్క ఇటువైపు కన్పించలేదమ్మా! ఎక్కడుందో పాపం! దానికి రోజులు దగ్గరకొచ్చినై" అంది.

ఆమె అన్నమాటల్లో అతిశయోక్తి లేదు. ఆనాటి దాని (కుక్క) పరిస్థితిని చూస్తే రోజులు కాదు, కొన్ని గంటల వ్యవధి మాత్రమే వున్నదనిపిస్తుంది. అమ్మ వెంటనే సావిత్రిని పిలిచి కుక్క ఎక్కడుందో అని అప్పుడే వెదికించింది. అప్పటికది పోస్టాఫీస్‌లో పడుకుని వుంది.

"వర్షం పడినా ఇబ్బంది లేని ప్రదేశమది. అక్కడే పడుకోనివ్వండి దాన్ని. నెమ్మదిగా అదే లేచి వస్తుంది" అన్నది అమ్మ.

అమ్మ అలా అన్నాక మళ్ళీ ఎవరూ అటువైపు వెళ్ళలేదు. మరి ఎప్పుడు లేచి వెళ్ళిందో ఆ కుక్క అమ్మగదివైపు రాకుండా డాబాలవైపు వెళ్ళి వాటికెదురుగా వున్న ఇసుక కుప్పల మీద పడుకుంది.

పెద్దగా వర్షం లేకపోయినా తెరపాటుగా సన్నని జల్లు పడుతున్నది. చలిగాలి వీస్తోంది. అయినా కుక్క లేవలేక మరణబాధ వలన శరీరంలో కలుగుతున్న తపనకు తట్టుకోలేక అక్కడే పడుకున్నది.

సావిత్రి ఈ విషయం చెప్పగానే కుక్కను చూడటానికి అమ్మ వెంటనే బయల్దేరింది.

అయితే ఆశ్రమంలో వున్నవారు అమ్మకు బదులు తాము కుక్కను వెతుకుతామని, అది కనిపిస్తే దానినే అమ్మ వద్దకు తీసుకువస్తామని చెప్పారు.

అయితే అమ్మ దానికి ఒప్పుకోలేదు. "మీరు ఇక్కడకు తీసుకువచ్చేది నాకోసం కాని దానికోసం కాదుగా నాన్నా! నాకేం ఫర్వాలేదు. నేను వెళ్ళాల్సిందే"అని మందిర ద్వారం ద్వారా బయటకు వచ్చి అంత వర్షంలోనూ, బురదలోనూ పొడినేల మీద నడిచినట్లు చకచకా అడుగులు వేసి నడుస్తూ, తన అంతిమ దర్శనానికి ఎదురు చూస్తున్న కుక్కను (భక్తుణ్ణి) సమీపించింది.

"ఇష్టం అయితే కష్టం లేదన్నది" గదా అమ్మ.

అమ్మ వెళ్ళేసరికి నరసమ్మక్కయ్య అనే భక్తురాలు గిన్నెలో పాలు పోసి కుక్కకు తాగిస్తున్నది. అది అతికష్టంమీద గుటకలు వేస్తూ మింగుతున్నది. "అన్నం తిన్లేదా?" అని ఆ కుక్కను చూస్తూ ఆమెనడిగింది అమ్మ.

"ఇందాక పెడితే కాస్త తిన్నది. కాని, ఏమీ తినటం లేదమ్మా!" అన్నదామె.

అమ్మ "జల్లు పడుతున్నది కదా. ఇక్కడే వుంచారేం? పంచలో పడుకోబెట్ట లేకపోయారా?" అన్నది.

"ప్రయత్నించాం కానీ రాలేదమ్మా!" అన్నదామె.

అప్పుడు అమ్మ, గ్లాసులో మిగిలిన కొద్ది పాలలో తులసీదళాలు తెప్పించి వేసి తాను కుక్క ప్రక్కన కూచుని, దానిమీద చెయ్యివేసి, ఆప్యాయంగా నిమురుతూ ఆ పాలను పట్టమని ఆమెకు చెప్పింది.

తన ప్రార్థన నాలకించవచ్చిన ఆర్తత్రాణ పరాయణ అయిన అమ్మ అమృత స్పర్శకు ఆ కుక్కలోని నరనరము ఆనందంతో పులకించిందేమో ఆ ఆనందచ్ఛాయలు దాని కదలికలోనే గాక, ముఖంలో కూడా కన్పించాయి. కళ్ళు విప్పి అమ్మను చూడాలని ప్రయత్నించింది.

కాని, దృష్టి మాంద్యం అందుకు అడ్డుపడింది. నరసమ్మక్కయ్య అమ్మ చెప్పిన ప్రకారం గిన్నెలో పాలుపోసి దాని ముందు పెట్టింది. అయితే అది ముట్టుకోలేదు. దాని ఉద్దేశం గ్రహించిన అమ్మ, దాని మూతికడిగి, శరీరమంతా నీళ్ళు జల్లి, తోకవైపు భాగం తుడిచి, "కురుపు ఎక్కడుంది?" అంటూ దాని చెవి పట్టుకుని చూచింది. అది బాధగా మూలిగింది. మళ్ళీ ఒకసారి నీళ్ళు జల్లి, చెవి అంతా కడిగి శరీరమంతా నిమిరి, "దీన్ని వెచ్చగా వుండే ప్రదేశంలో పడుకోబెట్టండి" అని అక్కడనుంచి లేచింది అమ్మ.

వరండాలో కూచున్న నాన్నగారు (అమ్మభర్త శ్రీ నాగేశ్వరరావుగారు) తిరిగి వస్తున్న అమ్మను చూసి "కుక్క పరిస్థితి ఎలా వున్నది?" అని అడిగారు.

"దానిపని అయిపోయింది పాపం!" అన్నది అమ్మ.

భక్తపాఠకులారా! ఆ తరువాత రెండురోజులకు చివరి ఘడియలలో అమ్మచేత సేవ చేయించుకున్న ఆ శునకరాజం అంతిమశ్వాస వదిలింది. అమ్మకీ విషయం తెలియగానే వేరే కుక్కలుగానీ, జంతువులు కాని పీక్కుతినకుండా వుండేలా ఒక గొయ్యి తీసి దానిని పూడ్చిపెట్టమన్నది.

తనకూ, తన వద్దకు వచ్చే భక్తులకూ అంతసేవ చేసిన ఆ శునకానికి దాని చివరి దశలో స్వాంతన చేకూర్చి సమాధి చేయించిందా మాతృమూర్తి!

అటువంటి సమాధినే ఇంకొక జంతువు అయిన వానరానికి చేయించింది అమ్మ.

అంతేకాదు, తన మీద వ్రాలిన దోమలు, తన శరీరం మీద ప్రాకే చీమలు మొదలైన చిరుజీవులను వేనినీ అదిలించదు, విదిలించదు అమ్మ. ఆ వైనాన్ని చదవండి. (పే. 114- 'శ్రీవారి చరణ సన్నిధి.)

17.9.1964

"ఉదయం ఎనిమిది గంటలు. అమ్మ హాల్లో కూచున్నది. ఒక కాకి వచ్చి హాల్లో తిరుగుతున్నది. ఎంత తోలినా పోవటం లేదు. అక్కడున్న కాత్యాయిని, "కాకి పోవటం లేదే?" అని అంటే- అది విన్న అమ్మ "అదీ నాలాంటిదే. నేను పోతున్నానూ?" అని "అది నాకోసమే వచ్చింది" అన్నది మళ్ళీ.

కందిరీగ కుట్టి, చెయ్యి వాచి బాధపడుతున్నా "వచ్చి సేవ చేసుకుని వెళ్ళింది" అనేది. పురుగు వంటిమీద వ్రాలి గట్టిగా పట్టుకుని వదలకపోయినా "దాని సంస్కారమది. దాన్నీ సేవ చేసుకోనివ్వండి. వాటిని తోలొద్దనేది." మంచం నిండా పురుగులు వ్రాలినా తోలనివ్వదు. చీమ శరీరం మీద ప్రాకుతున్నా తియ్యనివ్వదు. పిచ్చికలు, కాకులు, కుక్కలు ఒకటేమిటి... చీమలు, దోమలు, పురుగులు సమస్త జీవులు అమ్మప్రేమలో మునిగి తేలుతుంటాయి.

అమ్మ మంచం మీద పడుకున్నది. ఒక చీమ వచ్చి అమ్మ పాదంపైనే తిరుగుతున్నది. అమ్మను వదలక గట్టిగా పట్టుకున్నది. అమ్మ కాలు కదల్చలేదు సరికదా తాను బాధపడుతున్నా దానిని తియ్యనివ్వలేదు. అదేమి ప్రేమో మరి!"

భక్త పాఠకులారా! తెలిసిందిగా... అమ్మ తనవద్దకు వచ్చే భక్తులనే కాదు, క్రిమికీటకాదులూ, పక్షులను కూడా ప్రేమించేది. తల్లిలా లాలించేది. మరి అవికూడా తన బిడ్డలే కదా!

అమ్మ పూరింటిలో వున్నప్పుడు ఒక వానరం (కోతి) వుండేది. అది చాలా పెద్దకోతి. అది ఎప్పుడూ అమ్మదగ్గరే తిరుగుతూ వుండేది.

అమ్మ దగ్గరకు వచ్చే భక్తులు అమ్మతో మాట్లాడుతూ వుంటే అదికూడా వారితోబాటు కూచుని శ్రద్ధగా వింటూ వుండేది.

ఒకసారి అది ఎందుకో ఒకటి రెండు రోజులు కనబడలేదు. అమ్మ దానికోసం అంతా వెదికించింది. ఆఖరికి అది పూరింటి పైన కప్పుమీద కూచుని కనబడింది. కాని, అదిచాలా నీరసంగా వున్నది. వెదకటానికి వెళ్ళినవారు దానికి తినమని కొబ్బరిముక్క అందించినా అది తీసుకోలేదు. అప్పుడు అమ్మ, దాని అనారోగ్యం పోగొట్టడానికి ఒక హోమియో మాత్ర తెప్పించి దానిని ఒక అరటిపండులో పెట్టి, ఆ పండుని పైనున్న వానరానికి చూపించమన్నది.

ఆ పండుని చూడగానే వానరం వచ్చి దానిని తీసుకుని తిన్నది. ఆ విధంగా రెండుసార్లు చేసేసరికి దానికి ఆరోగ్యం చేకూరి మళ్ళా యధావిధిగా అమ్మ దగ్గరకు వచ్చి వెడుతూ వుండేది.

కాని, కొన్నాళ్ళకు ఆ వానరం పిల్లలు కొట్టిన రాళ్ళ దెబ్బలకు గాయాలపాలై చనిపోగా, అమ్మ దానిని ఇప్పుడు మాతృశ్రీ హోమియో హాస్పిటల్ వున్న ప్రాంతంలో సమాధి చేయించి ముందు ముందు అక్కడ ఆంజనేయులవారి గుడిని కట్టించమని చెప్పిందట. ఇప్పుడు అదే ప్రాంతంలో చూడముచ్చటగా, సంజీవని పర్వతాన్ని ఎత్తుకుని పోతున్న శ్రీఆంజనేయులవారి విగ్రహంతో కూడిన ఒక మందిరం కనువిందు చేసే రంగులతో తయారయింది.

ఆ తరువాతి వంతు ఇంకొక మూగజీవి అయిన ఒక ఎద్దుది.

ఒకనాడు అమ్మ ఇప్పటి నవ నాగేశ్వరాలయం (అది అప్పటి నాన్నగారి కచేరి సావిడి మరియు అమ్మ, నాన్నగారు నివసించే కుటీరం) వద్ద కూచుని వుండగా గాయపడిన ఒక ఎద్దు, కూచుని వున్న అమ్మచెంతకు వచ్చి, ఆమె పాదాలకు ముట్టినానించి మౌనంగా రోదిస్తూ కన్నీరు కారుస్తుంది. అప్పుడు అమ్మ ఆప్యాయంగా దాని శరీరమంతా నిమిరి ఒక మనిషిని ఓదార్చినట్టే ఓదార్చి పంపిస్తుంది.

ఇవన్నీ అమ్మకు మూగజీవులపై గల అవ్యాజ కరుణకు గల తార్కాణములు.

ఒక్క మనుషులు జంతువులే కాదు... జీవంతో ఉట్టిపడే వృక్షజాతుల పట్లకూడా అమ్మ తన అవ్యాజ కరుణను చూపిన దాఖలాలు వున్నాయి.

అమ్మ ఒకసారి కృష్ణాజిల్లా నందిగామలో ఒకసోదరుని ఇంటికి వెళ్ళినపుడు దారిలో అందరినీ పలుకరిస్తూ వెడుతుండగా, వాకిట్లో నిండా బొండాలతో విరగకాసిన ఒక కొబ్బరిచెట్టు నిండు గర్భిణిగా కనిపించింది. అయితే అంత పచ్చని ఆ చెట్టు మొదలులో ముళ్ళకంపలు, మురికి పట్టిన పాతగుడ్డపీలికలు, తిని పడవేసిన ఎంగిలి విస్తరాకులు, చెత్త చెదారంతో నిండిన ఆ ప్రదేశమంతా చీదర చీదరగా కనబడింది.

అంతే... ఆ దృశ్యం చూసిన అమ్మ కలత చెందిన మనసుతో ఠక్కున ఆగిపోయి, "చెట్టుకూడా మన పిల్లే కదా నాన్నా! నిండుగర్భిణిగా వున్న చెట్టును చూసే విధం ఇదేనా?" అని చెప్పి అక్కడే కుర్చీ తెప్పించుకుని కూచుని అప్పటి కప్పుడు ఆ చెట్టు చుట్టూ వున్న మలిన పదార్థాలను ఊడ్పించి, శుభ్రం చేయించి నాలుగు కడవల నీళ్ళు పోయించింది.

అమ్మ... ఈ సృష్టిలో గల మానవులతోబాటు సకల జీవరాశిని తన బిడ్డలవలె భావిస్తుందనేందుకు ఇది ఒక చక్కని తార్కాణం.

(పే.60– శ్రీ టి.టి.అప్పారావుగారి రచన "అమ్మ అమ్మే" అనే గ్రంథం నుండి.)

❀ ❀ ❀

# అమ్మలోని రాజరాజేశ్వరీ తత్త్వం

భక్త పాఠకులారా! ఇంతవరకు మనం అమ్మయొక్క మహామహిమాన్వితమైన అనసూయతత్వం గురించి కొన్ని ముఖ్య విషయాలను ముచ్చటించుకున్నాం.

ఇప్పుడు అమ్మ, తనలో గల శ్రీ రాజరాజేశ్వరీదేవి యొక్క అమ్మత్వాన్ని, మాతృత్వ మధురిమను, ఈ లోకంలోగల సమస్త జీవకోటిపై ఏ విధంగా ప్రదర్శించిందో తెలుసుకుందాం.

ముందుగా అమ్మ బాల్యంలోనే చూపిన మహనీయ మాతృత్వాన్ని గురించి తెలుసుకుందాం.

(పే.201- జీవిత మహోదధి)

**అమ్మ దివ్యత్వ ప్రాభవం**

ఆరు సంవత్సరముల వయసుగల అమ్మ, తన తల్లి పోయాక తన తండ్రి సీతాపతి గారితో కలసి తెనాలినుండి బాపట్లలో గల పినతాతగారు చిదంబరరావుగారింటికి వస్తుంది.

బాపట్లలో నృసింహోపాసకులైన శ్రీలక్ష్మణాచార్యులుగారు అమ్మయొక్క దివ్యత్వాన్ని గురించి అంతకుముందే గ్రహించారు. ఆమెను శ్రీ బాలాత్రిపురసుందరిగా ఆరాధిస్తారు.

అందుకే అమ్మ తిరిగి బాపట్ల వచ్చిందని తెలియగానే ఆ సాయంత్రం అమ్మను వెతుక్కుంటూ చిదంబర్రావు తాతగారింటికి వచ్చి "అమ్మా! బాలాత్రిపురసుందరీ! వచ్చావా?" అంటూ అప్పుడే మేడమీదనుంచి దిగి వస్తున్న అమ్మను పలుకరిస్తారు.

"బాలాత్రిపురసుందరి ఎవరు?" అని అక్కడే వున్న చిదంబరరావుగారి భార్య అన్నపూర్ణమ్మ (పున్నమ్మ) అడిగినదానికి ఆచార్యులవారు "మన బాలేనమ్మా!" అంటారు.

దానికి పున్నమ్మగారు "మాకు బాలలు ఎవరూ లేరు" అంటుంది.

ఇంతలో అమ్మ మేడమీదనుంచి క్రిందకు దిగి వస్తుంది. ఆమె ఈ సంభాషణ వినకుండానే "ఆబాలగోపాలం బాలలయ్యే వృద్ధులైనారు" అని వెంటనే స్నానాలగదిలోకి వెడుతుంది.

లక్ష్మణాచార్యులవారు అది విని "ఇదుగో అమ్మా! ఈ బాలే. అమ్మ చెప్పిన సమాధానం వినలేదా? వినబడలేదా?" అంటారు. దానికి పున్నమ్మగారు "ఇటు వెళ్ళిందా ఏమిటి?" అంటారు బాత్‌రూంవైపు చూస్తూ.

"ఇప్పుడు చూడలేదా? అమ్మను మనం చూడకపోయినా మనలను ఆమె చూస్తూనే వుంది" అన్నారు ఆచార్యులవారు.

స్నానాల గదిలోంచి ఇది విన్న అమ్మ "చూస్తున్నానని చూచేవారు యెంతటి వారో?" అన్నది.

"నీవెంతవార్ని చూస్తే అంతతటివారు" అన్నారాయన.

"అంతా వారే. వారే వీరు" అన్నది అమ్మ మళ్ళీ.

అది వింటూనే కూచున్న ఆచార్యుల వారు గబగబా లేచి స్నానాల గదిలోకి వచ్చి, కాళ్ళు చేతులు కడుగుకొనుచున్న అమ్మను యెత్తుకుని తన కాషాయ గుడ్డలతో అమ్మ ముఖము, కాళ్ళు చేతులు తుడిచి,

"ఈ తల్లి అర్థమయే తల్లి కాదు. చెప్పినా అర్థం కాదు. అమ్మా! నాకుమాత్రం యీస్థితి మారకుండా చెయ్యి తల్లీ! నాకు అరవై సంవత్సరాలు వెళ్ళిపోతున్నవి. నీ లీలలన్నీ చూస్తానో చూడనో. నిన్ను నేను, మీ అమ్మ పోయిన రోజునుండీ గమనిస్తూనే వున్నాను. ఒకరోజు స్వప్నములో కనబడి నీ స్థితి అంతా చెప్పినట్లు, చివరకు నీవు నా తండ్రి నరసింహస్వామిగా కనిపించి, ఇంతకుముందు నీవు అన్నమాట 'అంతా వారే, వారే వీరు' అన్న శబ్దం ఆ కలలో కూడా వినిపించింది. ఆ రోజునుండి కలిగిన ఆందోళన, ప్రేమ, భక్తి ఈరోజుకు దృఢపడింది. రూపము కూడా ఆనాడు చూచినదే" అన్నారు.

ఆ తరువాత లోపలినుంచి అక్కడకు వచ్చిన చిదంబరరావు తాతగారితో మాట్లాడుతూ తన చంకనున్న అమ్మను తన వీపుపై ఉప్పు మూటగా వేసుకుని పెరట్లో బాదంచెట్టు క్రింద మంచంలో మూలుగుతూ పడుకున్న చిదంబర్రావుగారి తల్లి నరసమ్మగారి వద్దకు వస్తారు.

ఆమె రెండురోజులనుండీ భోజనం ముట్టలేదట. అమ్మ తల్లిగారైన రంగమ్మగారు పోయినప్పటినుంచీ ఆమెమీద బెంగతో ఆవిడ మంచాన పడ్డారు. జబ్బేమీ లేదు. అదొక మానసికవ్యాధి. ఏవేవో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతూ వుంటుంది. ఎవరితోనూ మాట్లాడదు. మరీ ఎవరైనా వచ్చి బలవంతం చేస్తే రెండుమూడు రోజుల కొకసారి అన్నం తింటుంది.

అది తెలిసిన ఆచార్యులుగారు "నేను వెళ్ళి లేపి చూస్తాను" అని ఆమె మంచం దగ్గరకు వెళ్ళి ఆమె వెన్ను రాస్తూ "అమ్మా! తల్లీ! లే... నాకు అన్నం పెడుదువుగాని... లే" అంటారు.

అప్పుడామె ఉలిక్కిపడి నిద్రనుండి కళ్ళు తెరచి చూచి...

"ఎవరూ? రంగమ్మ తల్లీ!" (అమ్మ తల్లి) అని, "లేదుగా నాయనా!" అంటూ మళ్ళా వెంటనే కళ్ళు మూసుకుంటుంది.

అప్పుడు ఆచార్యులుగారు అమ్మను క్రిందకు దింపి...

"అమ్మా! బాలాత్రిపురసుందరీ! నీవొచ్చి లేపు లేస్తుంది" అంటారు.

అమ్మ వచ్చి "తాతమ్మా!" అని మెల్లగా పిలవగానే నరసమ్మగారు లేచి కూచుంటుంది.

అది చూచి ఆచార్యులుగారు పున్నమ్మగారివైపు తిరిగి "చూశారా పున్నమ్మగారూ! 'బాలాత్రిపురసుందరి' అంటే ఇక్కడ ఎవరూ లేరంటిరే. ఆ లక్షణాలు (అమ్మలో) కనిపెడుతూ వుండండి" అంటారు.

అప్పుడు అమ్మ "కనిపెడితే కనబడేవి కావు. కనబడితే కనిపెట్టేవి. నీ ప్రయత్నాలు లేవు" అంటుంది.

భక్త పాఠకులారా! ఆచార్యులుగారు పున్నమ్మగారితో 'అమ్మలో బాలాత్రిపురసుందరి లక్షణాలు కనిపెడుతూ వుండండి' అన్నమాటకు అయిదారేళ్ళ అమ్మ, పైన చెప్పిన తాత్విక వివరణను గమనించండి.

తనలోని దేవతా లక్షణాలను కనిపెడదామని చూస్తే నువ్వెంత ప్రయత్నించినా కనబడేది కాదని, అవి వాటంతట అవి కనబడితేనే నీవు చూడగలవని వివరించింది.

అంటే దానర్థం పున్నమ్మగారి వంటి సామాన్యులకు, అవిశ్వాసులకు ఎంత ప్రయత్నించినా దేవుడు కనబడడు. 'తన దర్శనానికి వారు అర్హులు' అని ఆయన సంకల్పించినపుడే వారికి ఆయన దర్శనమౌతుందని.

తరువాత మరిడమ్మ (అమ్మ తండ్రి సీతాపతిగారి మేనత్త) గారి విషయంలో అదే జరిగింది.

అమ్మ కోరిక మీదట మంచంలో పడుకుని వున్న నరసమ్మగారు లేచివచ్చి భోజనానికి కూచుంటే, ఆమెకు అన్నం తినిపించడానికై అమ్మ గబగబా పెరట్లోకి వెళ్ళి ఒక తడిగుడ్డ చుట్టుకుని వచ్చి (ఎందుకంటే నరసమ్మగారికి ఆచారం ఎక్కువ) అప్పటికే అన్నం కలుపుకొని తింటున్న నరసమ్మగారి వంక చూస్తూ వుంటుంది.

అప్పుడే అక్కడకు పెరుగు గిన్నె తీసుకువచ్చిన మరిడమ్మగారు (ఆవిడకు అమ్మ అంటే ప్రేమే కాదు 'అసాధారణ బాలిక' అనే గురికూడా ఎక్కువ) తడిగుడ్డతో నుంచుని వున్న అమ్మను చూచి,

"ఎందుకమ్మా! నీవెందుకు ఈ తడిగుడ్డలో?" అంటూ అమ్మ ముఖంవంక తీక్షణంగా చూస్తుంది.

ఆమెకు ఆ క్షణంలో అమ్మముఖం శాంభవీముద్ర వేసిన ముఖంగా, తన గురువు గారైన మల్లెల రత్తమ్మగారి కవళికలు కనిపిస్తాయి. అయినా తనకు భ్రమేమోనని తరచి

చూస్తారు. తరచి చూచిన కొలది తన గురువు మాదిరే కనిపించును. ఆ సమయంలోనే లక్ష్మణాచార్యుల వారికి నృసింహస్వామిగా కనిపించును. (8.204–జీవిత మహోదధి).

"ఆ దృశ్యం చూచిన తరువాత ఆచార్యుల వారికి వారి ఇష్టదైవం నరసింహస్వామి వంటిపైకి వచ్చి, నరసమ్మగారిని అడిగి అన్నం ముద్దను చేతిలో వేయించుకుని, నోటిని తెరచి అందులోంచి జానెడు పొడవున బైటకు వచ్చిన నాలుకతో దానిని నోట్లో వేసుకుంటారు.

ఆ దృశ్యాన్ని చూస్తూనే ఇంట్లో వాళ్ళు గబగబా లోనించి కర్పూరం తెచ్చి వెలిగించి, వారికి హారతి యిచ్చి, రెండు బుంగల నీళ్ళుకూడా తీసుకువచ్చి వారి నెత్తిన గుమ్మరిస్తారు.

కాస్సేపటి తరువాత ఆయన తెలివిలోకి వచ్చి, అమ్మను చూచి ఆమె వొంటినున్న తడిగుడ్డ లిప్పించి, పొడిగుడ్డలు కట్టించి అమ్మను తన యింటికి తీసుకువెడతారు.

ఆరోజు ఏకాదశి. రాత్రి ఏడుగంటలవుతుంది. అమ్మను వారి దేవతార్చన గదిలోకి తీసుకువెళ్ళి తనకెదురుగా కూర్చోబెట్టుకుంటారు. అలా వారిరువురూ సుమారు మూడుగంటలసేపు ఏమీ మాట్లాడకుండా కూచున్న తరువాత ఆచార్యులవారు అమ్మను అడుగుతారు.

"తల్లీ! ఇంతకూ నీవెవరమ్మా? చెప్పు. రెండు మూడు నెలలనుంచి యీ ఆలోచన కలిగింది. ఈరోజుకు అడిగే అవకాశం కలిగింది. యేవమ్మా! మాట్లాడవేం? యెవరమ్మా నీవు? పోనీ, నేనెవరినో చెప్పు. పలుకమ్మా! పలుకగల తల్లీ! పలకని తల్లీ! పలకవేమి తల్లీ?"

దానికి అమ్మ "నీవు పలికే పలుకే నేను నాయనా!" అంటుంది.

ఆ మాటకు ఆచార్యులవారు పులకాంకితులై వెంటనే అమ్మను కౌగలించుకుని,

"నేనే అమ్మ! అమ్మే నేను! నేనే అమ్మ! అమ్మే నేను!" అని అంతటా అమ్మే కనిపించగా "అంతా అమ్మే" అని లేచి వెంటనే నలభైఒక్క కొబ్బరికాయలు కొట్టి, నారింజకాయంత ముద్దకర్పూరం వెలిగించి హారతియిచ్చి "అమ్మా! నీ చేతిమీదుగా "అమ్మ" అని వ్రాసియ్యమ్మా!" అని అడుగుతారు.

దానికి అమ్మ "నాకు చదువు రాదుగా నాయనా!" అంటుంది.

అది విని ఆచార్యులు వెంటనే "నీవు చదువుకోని చదువుతో వ్రాయి" అంటారు.

అప్పుడు అమ్మ ఒక పుస్తకము పెన్సిలు తీసుకుని "ఏమి రాయమంటారు?" అని అడుగుతుంది.

దానికి ఆచార్యులుగారు "వెలితి లేనిదిగా, నీ యిష్టమొచ్చిందిగా రాయమ్మా!" అంటారు.

అప్పుడు అమ్మ పెద్దసున్నా ఒకటి చుట్టుతుంది. అది జానెడు కైవారము కలదిగా వుంటుంది.

ఆచార్యులుగారు వెంటనే ఆ సున్నాను కళ్ళకద్దుకుని "ఎన్ని అర్థాలు గల అక్షరాన్ని యిచ్చావమ్మా!" అన్నారు ఆనందంతో.

"ప్రక్కన ఏ అక్షరం లేనప్పుడు అది వట్టిదేగా" అంటుంది అమ్మ.

"ప్రక్కన అక్షరం లేనప్పుడు ప్రపంచం అంతా ఇదేనని, నేనేనని చూపిస్తున్నావమ్మా!"

"చెప్పినా అది వారి అనుభవం కాదుగా నాయనా!" అంటుంది అమ్మ.

"చెప్పినా నమ్మరమ్మా!" అంటారాయన.

అలా వారిద్దరూ చాలా విషయాలు మాట్లాడుకుంటూ చాలాసేపటి తరువాత అమ్మ యింటికి (చిదంబర్రావుగారింటికి) తిరిగి వస్తూ వుంటారు.

త్రోవలో పెద్ద త్రాచు వారిద్దరి మధ్యనా నుంచుని వున్నట్లు కనబడుతుంది.

లక్ష్మణాచార్యులవారు ఉలిక్కిపడి "అమ్మా! దూరంగా పో... కాటేస్తుంది" అంటారు భయంగా.

"ఆ కాటులో ఘాటు లేదులెండి" అంటుంది అమ్మ.

"త్రాచుపాము అమ్మా! విషం."

"త్రాచుపామేనా?" అంటుంది అమ్మ.

ఆ పాము లక్ష్మణాచార్యులవారి ఎత్తునా లేచి, సరాసరి వారివంకే చూస్తూ వుంటుంది. ఆయన నిశ్చేష్టుడై నిలిచి, చలనం లేనివాడైపోతాడు. కాస్సేపటికి కళ్ళు తెరుస్తాడు.

ఆ పాము అమ్మను చుట్టుకొన్నట్టుగా ఆయనకు కనబడుతుంది.

ఆయన వెంటనే అమ్మ పాదాలమీద పడి–

"నేను పాము అంటే భయము లేని వాడిని. ఈ పామును చూస్తూ ఎందుకింత భయం కలిగింది? ఇది పాము కాదేమో. అయినా నిన్ను చుట్టుకుందేమిటమ్మా?" అంటారు.

దానికి అమ్మ "పాము కాదు నాయనా! నాగేంద్రుడు. ఆ నాగేంద్రుడే నన్ను చుట్టుకుని వున్నాడు. నేను నాగేంద్రుడ్ని చుట్టించుకున్నాను. ఆ నాగేంద్రుడే నాగేశ్వరుడై వస్తాడు. వాడే నాకాధారం. వాడాకారమే నేను" అంటుంది.

భక్త పాఠకులారా! అయిదేళ్ళ వయసులోనే అమ్మ తన భర్త ఎవరో నిర్ణయించుకుంది. ఆవిడ మేనత్త కొడుకు నాగేశ్వరరావుగారే ఆ తరువాతి కాలంలో ఆమె భర్తగా (మనకు నాన్నగారుగా) వస్తారు.

సరే... మళ్ళా ఇప్పుడు ప్రస్తుతంలోకి వద్దాము.

అమ్మ అలా అనగానే అంటే "వారే నాకాధారం" అనగానే ఆచార్యులుగారు పెద్ద పెద్దగా కేకలు వేసుకుంటూ-

"అమ్మా! అమ్మా! ముగురమ్మల మూలపుటమ్మా! నీకాధారమేమిటమ్మా! నీవే ఆధారం" అని అమ్మను కౌగలించుకుని కాస్సేపు అలాగే నుంచుంటాడు.

అప్పుడు ఆ ముగురమ్మల మూలపుటమ్మ ఏం చెప్పిందో చూడండి.

"ముగరమ్మల మూలపుటమ్మ అంటే... ఆదియై, అనాదియై, యీనాటిది అయింది. ముగ్గురు మూర్తులకు తల్లి మూలపుటమ్మ మూడు భాగాలై, అన్ని అవస్థలు (స్థితులు) మూడుగా చేసి, తాను త్రిపుటియై, బాలై, బాలాత్రిపురసుందరియై, మూడు గుణములు, మూడు కాలములు, మూడు పూటలు, అవస్థలు మూడు శరీరభాగాలు మూడు, మూడుమూర్తులై, ముగ్గురు మూర్తులకు భార్యలై, ఆ మూడే సత్వ, రజో, తమో గుణములై, ప్రపంచమై, ఒక భూతములోనుంచి అనేకంగా మారి పంచబడ్డది. అందుకూ నాకాధారం కావలసి వచ్చింది."

భక్త పాఠకులారా! ఈ విధంగా మూడు సంఖ్యను గురించి చెబుతూ తనంటే ఏమిటో, తనలో గల శ్రీరాజరాజేశ్వరి తత్త్వము ఏమిటో కేవలం ఐదు సంవత్సరముల వయసులోనే అమ్మ లక్ష్మణాచార్యుల వారికి ఈ లోకానికి తెలియజేసింది.

"నాకు ఆధారం కావలసి వచ్చింద'న్న అమ్మమాట ఎలా వున్నదంటే, బంగారు పళ్ళెమైనా నిలబడాలంటే గోడదాపు కావాలి. తాను బంగారు పళ్ళెమయితే నాన్నగారు ఆమె నిలబడటానికి ఆధారమైన "గోడదాపు" అన్నమాట.

అంతేకాదు. తాను "అందర్నీ, అన్నిటినీ, తనలో ఇముడ్చుకున్న వృత్తాకారమైన ఈ విశాల విశ్వాన్ని సుమా!" అని కాగితంపై గుండ్రని సున్నాను చుట్టి, ఆచార్యుల వారు వ్రాయమన్న 'అమ్మ' అనే మాటకు అర్థాన్ని తెలియజేసింది.

అంతేనా? ఆ వృత్తానికి తద్వ్యతిరేకమైన అర్థం కూడా తెలియజెప్పింది. ఆ వృత్తాకారపు విశ్వం శాశ్వతమైనా, అందులోగల సమస్త జీవ, వస్తుజాలమంతా అనిత్యం సుమా అనికూడా పేర్కొన్నది.

అందుకే తాను కాగితంపై చుట్టిన సున్నాకు అర్థం చెబుతూ "ప్రక్కన ఏ అక్షరం లేనపుడు అది వట్టిదేగా" అని వివరించింది.

ఇంకొక విషయం-

త్రోవలో కనబడిన నాగేంద్రుడ్ని తన వంటికి చుట్టుకున్న ఉదంతాన్ని, తాను పెద్దయి నాన్నగారు నాగేశ్వరరావుగారిని వివాహం చేసుకున్న తరువాత, అమ్మ జిల్లెళ్ళమూడి కాపురానికి వచ్చాక కూడా చూపించింది.

ఇప్పుడు నవ నాగేశ్వరాలయం వున్న ప్రాంతంలో అప్పట్లో ఒక పూరింట అమ్మ కాపురం వుండేది. అప్పట్లో అమ్మ వంటగది దానికి కొంచెం ఇవతలిగా, ఇప్పుడు అమ్మ పాదుకలు ప్రతిష్ఠించిన చోట వుండేదట.

ఆ వంటగదిలో ఒక పగిలిపోయిన జాడీ వుండేదట. ఆ జాడీలో ఒక పుట్ట పెరిగి అందులోంచి ఎప్పుడూ దివ్యకాంతులు వెలువడేవట. అమ్మ ఆ వంటగదిలోనికి వెళ్ళినప్పుడల్లా ఆ కాంతులు ఆమెపైకి జొరబడి ఆమెను నిలువుగా చుట్టుకుని వుండేవట.

ఆ ఉదంతం ఏమిటో-

అమ్మను అహర్నిశలూ అంటిపెట్టుకుని వుండి, తన జీవితాన్ని అమ్మ సేవకే అకింతం చేసిన 'వసుంధర' అనే మహిళ (ఆమె ఇప్పటికీ తన డెబ్భైవ దశకంలో ఆశ్రమంలోనే వుంటూ, అమ్మకు పూజాదికాలు చేసుకుంటూ. 'వసుంధరక్కయ్య' అని అందరిచేతా పిలువబడుతోంది.)

తాను వ్రాసిన 'శ్రీవారి చరణ సన్నిధి' అనే గ్రంధంలో ఇలా వివరించింది.

(పే. 19-శ్రీవారి చరణ సన్నిధి. జ్ఞాపకాల మడతల్లో (రాగబంధం)

"అమ్మ పాకలో వుండగా వంటగదిలో వున్న పుట్టలో నుంచి సన్నని వెలుతురు వచ్చి, కమ్మని వాసనలు వెదజల్లుతూ వుండేది.

అమ్మ తన దర్శనార్థం వచ్చేవారికి ఆ పుట్టయొక్క మట్టిని తీసి ప్రసాదంగా ఇచ్చేది.

అప్పట్లో అమ్మ నేలమీదనే పడుకునేది. సెలవు తీసుకుని వెళ్ళేవారికి తనచేత్తో పక్కనున్న మట్టిని తీసి, ప్రసాదంగా ఇచ్చేది. ఎంతకాలం వున్నా వాటి సువాసనలు పోయేవి కావు.

క్రమంగా రెడ్డి చినసుబ్బయ్య పరిచయం ఏర్పడిన తరువాత పుట్ట సంగతి అడిగితే చెప్పాడు.

"ఒకరోజు తెల్లవారుఝామున వేడినీళ్ళు కాస్తూ వుండగా విపరీతమైన వెలుగు పూరింటిని నింపింది. ఏమిటా అని లోపలికి పోయి చూస్తే ఓ మూరెడు పొడుగు తెల్లని మెరుపు వెలుగు చిమ్ముతూ అమ్మచుట్టూ గిరగిరా తిరుగుతూ వుంటే కళ్ళు చూడలేని ఆ

వెలుగును చూచి భయం పుట్టి అరచి పడిపోయాను. తర్వాత కాసేపటికి లేచి చూస్తే అంతా మామూలు గానే వున్నది. అమ్మ దగ్గర ఏదో తెల్లగా వుంటే సున్నం కొట్టిన కుంచేమో అనుకుని తీసి పక్కన పెడదామని తీస్తుంటే అది ఎగిరింది. అది ఏదో పామని అమ్మ నన్ను సముదాయించింది కాని, ఆ పామే చాలాకాలం పగిలిన జాడీలో ఎదిగే పుట్టలో వుండేది" అని చెప్పాడు.

భక్త పాఠకులారా! వసుంధరమ్మ చెప్పిన ఆనాటి సంగతులు ఇంకా తెలుసుకోండి.

(పే.20- శ్రీవారి చరణ సన్నిధి) జ్ఞాపకాల మడతల్లో (రాగబంధం)

"ఆ రోజుల్లో అమ్మ నేలమీదనే పడుకునేది. అమ్మచుట్టూ అందరం పడుకునే వాళ్ళం. అమ్మ కళ్ళు మూసుకుని పడుకున్న స్థితిలో హిందీ, ఇంగ్లీషు అన్నిరకాల భాషల్లోనూ మాట్లాడుతూ వుండేది. పాట పాడుతూ వుండేది. ఎక్కడో వింటున్న పాటకు అనుగుణంగా పాదాలతోను, కాలివేళ్ళతోనూ తాళం వేస్తూండేది.

అది గమనించిన మేం అక్కడ వున్న మిగతావారు కూడా అమ్మ యొక్క చర్యను చూచి ఆనందించాలన్న ఆలోచనతో పక్కవారికి చెప్పాలని ప్రయత్నిస్తుంటే వెంటనే మా నోటిని తన హస్తంతో మూసివేసేది. చేత్తో తట్టి తెలియచేద్దామని ప్రయత్నం చేసినా సాగనిచ్చేది కాదు. ఎవరికి ఏది లభ్యమో అంతవరకే. అలా ఎన్నోసార్లు జరిగేది.



**ఈ పిల్లులూ నా పిల్లలే!**

ఆ రోజుల్లో పిల్లి 'మ్యావ్' అనే ధ్వనిలో 'ఓంకారం' ధ్వనించేది. ఆవుదగ్గర కుక్క పాలు తాగేది. కుక్క దగ్గర పిల్లి పాలు తాగేది.

అమ్మ ఇంట్లో గుంజకానుకుని కింద కూచున్నప్పుడు అమ్మ పమిట చెంగుపై ఎలుకలు పిల్లులు ఆడుకుంటూ మంచిస్నేహితుల్లా వ్యవహరించేవి.

భక్త పాఠకులారా! అమ్మ చిన్నతనంలోనూ, తరువాత పెద్దదయి గృహిణిగా వుంటున్నప్పుడూ జరిగిన నాగేంద్రుని వృత్తాంతాలకు అర్థం-

ఈ భూమి తర్వాత ఈ విశ్వంలో అంతటి ప్రాముఖ్యమైనది కాలమేనని తెలుపడమే.

చిన్నతనంలో నేల మీద సున్నాగీసి, ఆ వృత్తాకారం భూమి అనీ, ఆ భూమాతను నేనేనని తెలియజెప్పింది.

అలాగే ఆ భూమితోబాటే ఆ భూమిని ఆవరించి వున్న కాలాన్ని కూడా తానేనని తెలియజెప్పటం కోసమే కాలసర్పాన్ని తన వంటికి చుట్టుకుని కనిపించింది.

ఇంతకన్నా ఏం కావాలి... ఈ భూమి, దానిపైనున్న సకల చరాచర జీవరాశి, దానితోబాటే గమించే కాలప్రవాహం, సమస్తం తన ఉనికేనని తెలియజేయడానికి.

❀ ❀ ❀



# అమ్మ హేతువాదం

శ్రీ అనసూయమాత మహిమాన్వితాన్ని, శ్రీ రాజరాజేశ్వరిదేవి యొక్క దివ్య మాతృత్వాన్ని పుణికిపుచ్చుకున్న ఈ భువిపై వెలసిన అమ్మ, మన హిందూ సంస్కృతిని, సంప్రదాయాన్ని పరిరక్షించడమే కాదు, అందులో అంతర్లీనంగా వున్న హేతువాదాన్ని, కులమతరాహిత్యాన్ని కూడా పెంచి పోషించింది.

పెద్దయ్యాక 'విగ్రహం నిగ్రహం కొరకే' అని ప్రవచించిన అమ్మ తన చిన్నతనంలోనే తనలోగల హేతువాద భావాన్ని వ్యక్తీకరించింది.

అదెలానంటే-

అమ్మకు అప్పుడు నాలుగేళ్ళ వయసు. తల్లి రంగమ్మగారు పోయిన తరువాత, తనవారితో ఆమె కర్మకాండల నిమిత్తం స్వగ్రామమైన మన్నవ వెళ్ళి, తిరిగి బాపట్ల చిదంబర్రావు తాతగారింటికి వస్తుంది.

(పే. 36- జీవిత మహోదధి)

"అలా వచ్చిన తరువాత అమ్మ, తనకన్నా వయసులో కాస్త పెద్దవారయిన పిల్లలతో కలసి బాపట్లలో గల భావనారాయణస్వామి గుడికి వెళ్ళి పొగడచెట్టు క్రింద గంటల తరబడి కూచుని వచ్చేది.

ఆ వయసులోనే ఆ చిన్నిమనసులో అనేకమైన ఆలోచనలు, జిజ్ఞాసలు. అసలు దేముడికి కొబ్బరికాయలు ఎందుకు కొడతారు? దేమునికి పసుపు, కుంకుమలతో ఎందుకు పూజలు చేస్తారు? దేవునికి పెట్టే సొమ్ములు, కట్టిన గుడ్డలు, పెట్టే నివేదనల పాత్రలు, పళ్ళేలు ఎక్కడ తయారయాయి? ఇలాంటి ఆలోచనలతో అక్కడ గడిపేది.

ఈ ప్రశ్నలకు సమాధానాలు రాబట్టాలని అటే వెడుతున్న ఆలయ ధర్మకర్తగారి గుమాస్తా సుబ్బారావుగారిని ఆపి తన సందేహాలను అడుగుతుంది అమ్మ.

దానికి సుబ్బారావుగారు పసుపు నేలలో పుట్టిన మొక్కనుండి కాస్తుందనీ, పళ్ళేలూ అవీ నేలలో దొరికిన లోహాలనుండి తయారు చేస్తారనీ చెప్పి వెళ్ళబోతారు.

అప్పుడు ఆయన్ను ఆపి అమ్మ "ఒక్క మాట వినిపొండి తాతగారూ! యింతకూ పూజ చేయించుకునే దేవుడు ఎక్కడ పుట్టాడు?" అని అడుగుతుంది.

"ఎక్కడా? గుళ్ళో వున్న విగ్రహాలా?" అని అంటాడాయన.

"విగ్రహాలంటే దేవుడు కాడా?" అంటుంది అమ్మ.

"కాకేం దేవుడే" అంటాడాయన.

"మరి నేను దేముడు అంటే గుళ్ళో విగ్రహాలా అంటారేం?" అంటుంది మళ్ళీ.

ఈ ప్రశ్నలతో ఆయనకు విసుగొచ్చి "పిచ్చిప్రశ్నలు. నేను వస్తా. ఫో ఫో... ఇంటికి ఫో" అంటూ వెళ్ళిపోతాడు.

ఆ తర్వాత ముక్తినూతలపాటి శ్రీరాములు అనే ప్లీడరు గుమాస్తా తన స్నేహితులతో అటువచ్చి ఆ సమయంలో అక్కడ వున్న అమ్మను చూసి-

"ఎందుకమ్మా ఇక్కడ వున్నావు? పోదాం పద" అని అమ్మను ఎత్తుకుని, ముద్దు పెట్టుకుని తన స్నేహితులతో-

"ఈ పిల్లకు తల్లిలేదు. చాలా బుద్ధిమంతురాలు. అల్లరి చేయదు" అంటారు.

"ఇంకేం! నీకు పిల్లలు లేరుగా పెంచుకో" అంటారు వారు.

అప్పుడు అక్కడనుండి పోవడానికిష్టంలేని అమ్మ ఆయనతో-

"బుద్ధిమంతురాల నంటిరిగా. ఇక్కడుంటాలే. నీవు చెప్పినట్టు వినకపోయినా బుద్ధిమంతురాల నంటావా? బుద్ధిమంతురాలంటే అసలు ఏమిటి? బుద్ధి కలిగిందనా? బుద్ధి లేని వారుండరుగా! కుక్కకు కూడా బుద్ధి వున్నదిగా" అంటుంది.

దానికి శ్రీరాములుగారు "బుద్ధి అంటే గుణమమ్మా" అంటారు.

"గుణము లేనివి వుండవుగా! అన్నిటికీ గుణములున్నవిగా" అంటుంది అమ్మ.

ఆ మాటకు అతని ప్రక్కనున్న స్నేహితులు,

"ఈ అమ్మాయి చాలా అసాధ్యముగా వున్నదే!" అంటారు.

తరువాత ఆయన అమ్మను క్రిందకు దింపి, ఆమె వేలు పట్టుకుని నడిపిస్తూండగా అమ్మ మెల్లిగా ఆయన చేతినుండి తన వేలును లాక్కుని, అక్కడనుంచి వెనుదిరిగి రాజ్యలక్ష్మి అమ్మవారి గర్భగుడిలోకి వెళ్ళి ఎవరికీ కనబడకుండా ఒక మూలన నుంచుంటుంది. అక్కడ తన ప్రక్కన నడుస్తున్న అమ్మ కనబడకపోయేసరికి ఎక్కడకు పోయిందో ననుకొంటూ శ్రీరాములుగారు, స్నేహితులు వెళ్ళిపోతారు.

ఇక్కడ గుళ్ళో మూలన నుంచున్న అమ్మను చూడకుండా పూజారి తలుపులు వేసి వెళ్ళిపోతాడు.

అమ్మ రాత్రంతా గుళ్ళోనే వుండి రాజ్యలక్ష్మి అమ్మవారి దగ్గరకు వెళ్ళి,

"ఆయన విగ్రహాలన్నాడే ఏమిటో చూద్దాం. విగ్రహాలేనా? దేముడంటే వేరే వుంటాడా? అమ్మవారిని తాకి చూద్దాం" అనుకుని జంకు లేకుండా, ముందుగా కళ్ళకు పెట్టిన డిప్పలను లాగివేసి వాటిల్లో కళ్ళలాంటి గుడ్లు వున్నాయేమోనని చూస్తుంది. యేమీ కనబడవు.

క్రమంగా అమ్మవారికి కట్టిన గుడ్డలన్నీ తీసి తరచి చూడగా అంతా రాయిగా కనబడుతుంది. రంగులు పూసినట్టుగా జిడ్డుగా చేతికి తగులుతుంది. పిలిచినా పలుకదు. కదిలించినా కదలదు. 'యిదేనా దేముడంటే?' అనుకుని మళ్ళీ అన్నీ పెడదామనుకుంటే చేతకాకపోవడం వల్ల వాటిని ఒకప్రక్క పెట్టి,

"అమ్మవారు అన్నీ వున్నపుడు ఒకరకం, తీసేస్తే ఒకరకం. ఈ అలంకారమేనా దేముడు?" అని తీసినవన్నీ దగ్గర పెట్టుకుంటూ వాటిని చూసుకుంటూ,

"ఈ సొమ్ములు చేసినవాడు దేముడా? ఈ చీర దేముడా? ఈ రాయి చెక్కినవాడు దేముడా? వాటిని దేముడు అనుకునేవాడు దేముడా? అసలీ పదార్థములన్నీ యిచ్చిన భూమి దేముడా? ఈ భూమిని కూడా ఎందుకు పూజించకూడదు? అన్నింటికి ఆధారము కదా. అందులో (భూమిలో) పుట్టిన వస్తువులు పెట్టి, ఆమెను కాదని దేనికో పూజ చేస్తూ, అమ్మ (భూమి)ను నిరాకరిస్తూ" అని మట్టిని పట్టుకుని, ఆ మట్టితో-

"అమ్మా! నీలో పుట్టి, నీలో పెరిగి నీలో లయమయ్యే వస్తువులన్నిటికీ పూజ చేస్తూ, నిన్ను గుర్తించనివ్వకుండా చేస్తున్నావా?" అని మట్టితో మాట్లాడుతుంది అమ్మ. మళ్ళీ,

"చైతన్యాలకు కూడా ఆధారంగా వున్న నీవు, సర్వభూతాలకూ ఇంత జడత్వంగా కనబడతావేం?" అనుకుంది.

"ప్రతి వస్తువును అన్వేషించి, విమర్శించి, వివరించి నీతోనే చెబుతాలే" అని మళ్ళా అనుకుంది.

భక్తపాఠకులారా! చూసారుగా భూమాతకు అమ్మ యిచ్చిన నిర్వచనం.

మనలోనూ, మన యెదుట, మన చుట్టూతా ఆవరించుకున్న చరాచర జగతిని నిండివున్న సర్వాంతర్యామిని కనుగొనలేక, ఆయన్ను ఎక్కడెక్కడో గుళ్ళల్లోనూ, వాటిలో గల విగ్రహాల యందూ వెదుక్కుంటున్నాం. అంటే, భూమిలో నుంచే పుట్టిన పదార్థములతో తయారైన ఆ గుళ్ళనూ, విగ్రహాలనూ వాటి పూజకు ఉపయోగించిన పూలు, పళ్ళూ, ప్రసాదాలూ, దీపాలూ, దుస్తులూ, వాటినే దైవంగా భావిస్తూ, వాటిని ప్రసాదించిన భూమాతను మాత్రం నిర్లక్ష్యం చేస్తున్నాం.

పైన అమ్మ చెప్పినట్టు చైతన్యాలకు కూడా ఆధారమైన భూమాత జడత్వంగా వున్నందునే మనం ఆమెను గుర్తించలేకపోతున్నామా?

ఇక్కడ మనమొక విషయాన్ని గుర్తించాలి. హేతువాదమంటే నాస్తికత్వమనే భావం నేటి మన ప్రజల్లో చాలామందిలో జీర్ణించుకుపోయింది. అయితే అసలైన హేతువాదమంటే, అద్వైతభావనతో దైవాన్ని గుడులూ, గోపురాల్లో గాక, సకల చరాచర జగత్తులోనూ

అన్వేషించాలి. దర్శించాలి. ఈ విషయాన్ని మన పురాణ గ్రంథాలు, ముఖ్యంగా పంచమవేదమైన భగవద్గీత కూడా పేర్కొన్నది. అందుకే కదా, మానవ నిర్మితమైన స్థంభంలో నుంచి కూడా మాధవుడు ప్రత్యక్షమై తన విరాట్స్వరూపాన్ని ప్రదర్శించాడు!

అందుకే జిల్లెళ్ళమూడిలో ఒక భక్తుడు అమ్మకు చిన్న శివలింగాన్ని పూజ నిమిత్తం పంపుతానంటే "పంపించు. దాన్నిపూజించనూ వచ్చు. లేదా దానితో కుంకుడు కాయలన్నా కొట్టుకోవచ్చు" అన్నదట. అంటే అంతా భావనలో వున్నదన్నమాట.

అలాగే- "హోమంలో నెయ్యి వేస్తావా అమ్మా?" అని ఋత్విక్కు అడిగితే "నేను ఏం వేసినా వంటింటి గాడిపొయ్యిలోనే వేస్తాను" అన్నదట అమ్మ.

సరే... మళ్ళా గుడిలో, కావాలనే చిక్కుకున్న అమ్మ దగ్గరకు వద్దాం.

అమ్మ ఆ రాత్రంతా గుడిలోనే వుండి, ఉదయం అర్చకుడు వచ్చి తలుపు తీస్తున్న చప్పుడు అవగానే ద్వారం ముందుకు వచ్చి నుంచున్నది.

సరిగ్గా అప్పుడే జరిగింది తమాషా!

తలుపు తీసిన అర్చకుడు తన ఎదుట నుంచున్న అమ్మను చూసి, తాను కొలుస్తున్న రాజ్యలక్ష్మి అమ్మవారే ప్రత్యక్షమైనదని భ్రమించి, వెంటనే "అమ్మా!" అంటూ ఆమెముందు సాష్టాంగపడి వొళ్ళు తెలియని పారవశ్యంతో చాలాసేపు కళ్ళుమూసుకుని అలాగే వుండిపోయాడు. అదే అదనుకుని, అమ్మ మెల్లగా ఆయన ప్రక్కనుండే బయటకు వచ్చి, ఇంటికి పోయింది." (పే.365- జీవిత మహోదధి)

భక్త పాఠకులారా! మనం ఇదివరకే చెప్పుకొన్నాం తల్లిలేని ఆ పసిపాపను (అమ్మను), ఆమె రోజుంతా ఎక్కడకు పోయినా ఎవరూ పట్టించుకునేవారు కాదని. వీధిలోంచి వచ్చిన అమ్మకూడా అంత పెద్ద ఇంట్లోకి, ఎవరికంటా పడకుండా ఏ దొడ్డిలోనో ప్రవేశించి ఏదో ఒక గదిలోపలికో, లేదా మేడమీదకో పోయి పడుకునేది. ఇక తాతగారు చిదంబరరావుగారైతే తన క్లయింట్లతో, కేసులతో రాత్రి పగలు సతమతమవుతూ హడావుడిగా వుండేవారు.

ఇంతకీ ఇక్కడ మనం చెప్పుకోవలసిన విషయం ఏమిటంటే, అమ్మకు పసితనం నుంచే అలవడిన జిజ్ఞాస, హేతువాదం, అద్వైతవాదం వలన పెద్దయిన తరువాత కూడా ఏ దేవునికీ, దేవతకూ పూజలు చేయలేదు. ఇంకా చెప్పవలసి వస్తే చేతిలో పూలు తీసుకుని తనను తానే వాటిని తన పాదాలమీద వేసుకుని పూజించుకునేది.

తనను పూజిస్తున్న భక్తులు ఎవరైనా "అమ్మా! నువ్వే దేవుడ్ని పూజిస్తావమ్మా?" అని అడిగితే,

"నాకు వేరే దేవుళ్ళు ఎవరూ లేరర్రా! మీరే నా దేవుళ్ళు!" అనేదట.

ఒక భక్తుడు అమ్మకు పూజ చేసేముందు అమ్మ పాదాలను కడుగుతూ "ఇది బ్రహ్మ కడిగిన పాదము" అన్నాడట.

అమ్మ వెంటనే "నువ్వు బ్రహ్మావు కాకపోతేగా!" అన్నదట.

ఇక అమ్మయొక్క కులాతీత మతాతీత తత్త్వానికి వస్తే మనం వెనక చదువుకున్నట్లు మస్తాన్, కాశింలతో పాటు మౌలాలీ అనే అతనిని కూడా తన చిన్నప్పుడే భక్తులుగా స్వీకరించి మహిమలను చూపించింది.

ఇక అమ్మలోగల రాజరాజేశ్వరి మాతృహృదయం ముందు కులబేధము, అంటు, శౌచముల వంటివి లేవని చెప్పేందుకు ఈ క్రింది ఉదంతాలు తెలియజేస్తున్నవి.

అందులో ఒకటి ఆమె చిన్ననాట జరిగితే, ఇంకొకటి ఆమె పెద్దయినాక జరిగింది.

ముందుగా చిన్ననాటి ఉదంతాన్ని చూడండి.

అప్పటికి అమ్మకు ఆరు సంవత్సరాలు దాటాయి. అమ్మ తండ్రి సీతాపతిగారు అమ్మను ఎట్లాగయినా ఆమె అమ్మమ్మగారికి అలవాటు చేసేందుకు అమ్మను తెనాలిలో వాళ్ళ అమ్మగారింటి వద్ద వదలి, అమ్మకు చెప్పకుండా ఆమెకు తెలియకుండా మన్నవ వెళ్ళిపోతారు.

మన్నవలో తండ్రి దగ్గరనే వుందామనుకున్న అమ్మకు అది చాలా బాధను కలిగించింది.

ఎందుకంటే, అమ్మ పుట్టిన తరువాత తల్లిని పొట్టన పెట్టుకున్నదనే అభిప్రాయంతో అమ్మను ఆమె మాతామహుల ఇంట ముఖ్యంగా ఆమె పినతల్లులు, పెద్దమ్మలు ఆమెను నిష్టురంగా చూచేవారు. పరుష వాక్యాలతో మాట్లాడేవారు. ఆమె బాధకు అదికూడా ఒక కారణం.

ఆ బాధతోనూ, తండ్రిని చూడాలనే బెంగతోనూ అమ్మ జ్వరం తెచ్చుకున్నది. అలా మూడురోజులు జ్వరాన పడి, మూడోరోజు కాస్త జ్వరం తగ్గగానే అమ్మ వచ్చి, అమ్మమ్మగారింటి వీధి అరుగుమీద నీరసంగా కూచుని రోడ్డున పోయేవారిని చూస్తూ వుంటుంది.

అప్పుడేం జరిగిందో చూడండి. (పే.285- జీవిత మహోదధి)

"రోడ్లు చిమ్ముకునే ఒక పాకీ రేకుల ఎద్దుబండిని తోలుకుంటూ పాకీవాడు, అతనివెంట మూడేళ్ళ తన పిల్లవాడిని నడిపించుకుంటూ, రోడ్డు చిమ్ముకుంటూ పాకీది ఆ రోడ్డున వస్తూ వుంటారు. ఇంతలో బండి ముందుకు పరుగెడుతుంది. బండి పోతున్నదనే ఆదుర్దాతో పిల్లవాడిని వెనుకనే వదలి, రోడ్డు చిమ్ముతున్న తల్లి బండివెంట పరుగెడుతుంది. బండి తోలే పాకీవాడు బండికి ముందు చాలా దూరాన వున్నాడు.

ఇంతలో తల్లిని అందుకోవాలని ఆమెవెంట పరుగెడుతున్న పిల్లవాడు కాలు తడబడి రోడ్డుపై బోర్లా పడి ఏడుస్తూ వుంటాడు.

వాకిట్లో అరుగుమీద ఆ సమయంలో అమ్మ, అమ్మ పినతల్లి కూతురు సావిత్రమ్మ, కుమారుడు కృష్ణమూర్తి, సావిత్రమ్మ అన్న మధు, శాస్త్రిమామయ్య, వెంకట సుబ్బయ్య తాతగారు (అమ్మ మాతామహులు) వుంటారు. పిల్లవాడు పడగానే "అయ్యో పాపం!" అంటారేగాని ఎవరూ పరుగెత్తుకు వెళ్ళి లేవదియ్యరు. సరిగ్గా అప్పుడే పైనుండి రెండు గేదెలు ఆ దారినే పరుగెత్తుకుని వస్తున్నాయి.

అంతే- అది చూచిన అమ్మ, అంత నీరసంలోనూ చప్పున లేచి కన్ను మూసి తెరిచేలోగా పిల్లవాని దగ్గరకు వెళ్ళి పిల్లవాడ్ని లేవదీస్తుంది.

అనుకోని ఈ సంఘటనకు వెంకట సుబ్బయ్యగారు ఆశ్చర్యపడి, "జ్వరముతో వుండి కూడా ఎంత ఉద్రేకంతో పరుగెత్తిందో చూడు. భూతదయ కనబడుతున్నది దీనిలో" అనుకుంటూ లోపలికి వెళ్ళి కుమార్తెను, భార్యను పిలుచుకు వస్తారు.

ఇంతలో అమ్మ పిల్లవాడిని లేవదీసి, భుజాన వేసుకుని గబగబా ఇంటికి తీసుకు వస్తుంది.

పిల్లవాడు పడ్డప్పుడు చూచినవాళ్ళు వాడ్ని లేవదియ్యకుండా ముందుకు వెళ్ళి పాకీదానితో "మీ పిల్లవాడు పడ్డాడు" అని చెబుతారు.

అదివిన్న పాకీ మనిషి వెనక్కు పరుగెత్తుకు వస్తుంది.

అయితే, అమ్మ పాకీది వచ్చేసరికే పిల్లవాడ్ని ఎత్తుకుని యిల్లు చేరుతుంది.

అమ్మ అంతదూరాన వుండగానే తాతగారు, పెదతల్లి అన్నపూర్ణమ్మగారు, అమ్మమ్మ (అమ్మకు అమ్మ జానికమ్మ) ముగ్గురూ నోటిమీద చెయ్యివేసి లబలబా కొట్టుకుంటారు.

"ఇటువంటిది కనుకనే యీరాత రాసింది" అంటుంది జానికమ్మ (అమ్మ అమ్మమ్మ) నిష్ఠురంగా.

ఇంతలో అమ్మ బిడ్డను ఎత్తుకుని వచ్చి, సరాసరి ఇంటి గడప ఎక్కబోతుంటే-

"దిగు, దిగు. అక్కడే వుండు. ఆ పాడుపీడను భుజాన వేసుకొస్తావేం? స్నానం చేసి వద్దువుగాని" అంటుంది జానికమ్మ.

ఆమె అలా అంటుండగానే ఆ పిల్లవాడి తల్లి పరుగెత్తుకొస్తుందక్కడికి.

ఆమెను చూసి అమ్మ "అదుగో సంఘమాత లాంటిది వస్తున్నది" అంటుంది. (అమ్మ దృష్టిలో సంఘమాత అంటే ఈ 'మానవసంఘానికి తల్లి వంటిది' అనే అర్థం కాబోలు. మరి, కన్నతల్లి లాగానే సంఘంలో నివసించే వారందరి మలినాలను అసహ్యించుకోకుండా చేతులతో ఎత్తి పారబోస్తుంది కదా.)

అమ్మ అలా అనగానే అక్కడే వున్న అన్నపూర్ణమ్మ (చిదంబరరావుగారి భార్య),

"ఆ! నీవూ సంఘమాతవే. మహామాటలు నేర్చింది. చిన్నపిల్లలకు పెద్ద శోకమని యేం మాటలవి?" అంటుంది ఈసడింపుగా.

అందుకు వత్తాసుగా జానికమ్మ "మరి ఆ మరిడమ్మ (అమ్మ తండ్రికి మేనత్త) గారి పెంపకం కాదూ?" అంటుంది దెప్పిపొడుస్తూ. (అమ్మ మన్నవలో తండ్రి దగ్గర వున్నప్పుడు మరిడమ్మగారే అమ్మ ఆలనా పాలనా చూచేది.)

ఇంతలో పాకీది వచ్చి బిడ్డకై చెయ్యి చాపి, అమ్మతో "దొరసానీ! నీవు ఎత్తుకు వచ్చావా బిడ్డను? ఎంత అదృష్టవంతుడమ్మ వాడు! బ్రాహ్మలెత్తుకున్నారు" అంది ఆనందంగా.

దానికి జానికమ్మగారు కస్సుమంది. "మా బ్రాహ్మణత్వం మట్టిలో కలిసింది. ఇంకా ఏం మాట్లాడతావులే నీ పిల్లవాడ్ని తీసుకుపో" అంది కోపంగా.

అయితే వెంకట సుబ్బయ్యగారు "ఎందుకు తొందరపడతావు? అయిపోయిందేమో అయిపోయిందిగా. రైల్లో ప్రయాణాలు చేయటంలా?" అంటారు ఆమెను వారిస్తూ.

అయితే జానికమ్మగారి మాటలకు అమ్మ–

"అవును. బ్రాహ్మణత్వం మట్టిలో కలిసింది కనుకనే పిల్లవాడిని ఎత్తుకోలా" అని చురుక్కుమనేలా సమాధానమిచ్చింది.

ఆ మాట మిగతావాళ్ళు వినకపోయినా వెంకట సుబ్బయ్యగారు విని "ఆ మాట ఎంతదూరం వేసిందో చూశారా? బ్రాహ్మణత్వం ఆమెకే వున్నట్లు తేల్చింది" అన్నారు.

"బ్రహ్మతత్త్వమే బ్రాహ్మణత్వం" అని మరిడమ్మ తాతమ్మ అంటుంటే విన్నా" అంది అమ్మ మెల్లగా. మరి రాజరాజేశ్వరి గదా! తన గొప్పదనాన్ని బయటకు చాటుకోదు.

దానికి అన్నపూర్ణమ్మ "మహా బ్రాహ్మణత్వము నీకేగా వచ్చింది" అన్నది ఈసడింపుగా.

ఇంతలో పిల్లవాడి తల్లి ముందుకు వచ్చి, అమ్మ చంకలో వున్న తన బిడ్డవైపు చెయ్యిచాచి "రా అయ్యా!"అని ఎత్తుకోబోయింది. కాని, పిల్లవాడు రాడు సరికదా, అమ్మ కంఠాన్ని గట్టిగా చేతుల్తో వాటేసుకుంటాడు.

అది చూచి అందరూ ఆశ్చర్యపడతారు.

అయితే ఈసారి ఆ తల్లి తన పిల్లవాడినే కాకుండా అమ్మను కూడా వాటేసుకుని–

"నేను కాదమ్మా అమ్మను. నా బిడ్డకు నీవే అమ్మవు" అని తనకు తెలియకుండానే "నాకు కూడా నీవే అమ్మవు" అంటుంది.

జానికమ్మగారు, అన్నపూర్ణమ్మగారు ఆ దృశ్యాన్ని చూడలేక ఇంట్లోకి వెళ్ళిపోతారు.

గట్టిగా వాటేసుకున్న పిల్లవాడిని చూచి తాతగారు అమ్మతో "బలవంతంగానైనా తీసెయ్యమ్మా పిల్లవాడ్ని" అంటారు.

దానికి అమ్మ "నేను వద్దన్నానా? బలవంతంగా లాగే ఓపిక నాకు లేదు. నన్ను వదిలిపెట్టి పొయ్యే వోపిక వాడికి లేదు" అంటుంది.

ఇంతలో జానికమ్మగారు లోపలినుంచి పనిమనిషి చేత ఇలా కబురు చేయిస్తుంది.

"ఆ గౌను కూడా విప్పి (అమ్మను) పాకీదాని ముఖాన విసిరేసి, దొడ్డి వాకిలిని రమ్మను. పంచామృతాలు తాగించి, స్నానం చేయించుదాం" అని.

ఆ మాటను విన్న ఆరు వసంతాల వయసు గల ఆ చిన్నితల్లి (అమ్మ) ఏం సమాధానం చెప్పిందో చూడండి.

"గౌను విప్పి వెళ్ళడమెందుకు? నేను కూడా వెడతాను పాకీదాని వెంబడి. తాకింది నేను. గుడ్డ కాదు. మైల పడ్డది నేను. గుడ్డ విప్పినా మైల ఎక్కడికి పోతుంది? పోనీ చెయ్యివరకూ తీసేద్దామనుకున్నా, భుజం మీద పడుకోబెట్టుకున్నా. పొట్ట తాకాడు. వాళ్ళ అమ్మ వచ్చి మొత్తం తాకింది. అంతకుముందు వాడ్ని ఎత్తుకోవాలనే ఉద్దేశంతో మనసే మైల పడ్డదిగా! అమ్మమ్మ అన్నట్లుగా యిట్లాంటి రాత రాసిందన్నట్లుగా, రాత రాసిన వాడు మైల పడ్డాడు. యిన్నిరకాల మైలలు కలసి సంఘమాతను చేస్తున్నాయి" అంది.

అది వింటున్న వెంకట సుబ్బయ్యగారు ఆనందభాష్పాలు కారుస్తూ, అమ్మ చంకలో వున్న పిల్లవాడ్ని తీసి వాళ్ళ అమ్మకిచ్చి, అమ్మ తొడుక్కున్న గౌను విప్పి, పాకీదానికిచ్చి అమ్మను భుజాన వేసుకుని పొట్టకు హత్తుకుని,

"అబ్బా! కడుపులో మంట, చిచ్చుపెట్టి వెళ్లిపోయింది. ఇవన్నీ చూసుకుంటే ఎంత తృప్తిపడేదో"అని తన కూతుర్ని (అమ్మతల్లి రంగమ్మగారిని) గురించి తలుచుకుంటూ వెనక్కు తిరిగేంతలో పాకీది తన పిల్లవాడిని ఎత్తుకుని అమ్మను ముద్దుపెట్టుకునే ప్రయత్నంలో దానిచేయి తాతగారి వీపుకు తగుల్తుంది.

అది గమనించిన అమ్మ "అయ్యయ్యో! తాతయ్య కూడా మైల పడ్డాడే. పాకీది తాకిన వాళ్ళని తాకడం కాకుండా, పాకీదే తాకింది. తాతయ్య పూర్తిగా మైల పడ్డాడు. ఇంకా మైల ఏమిటి? పాకీయే" అంది హేళనగా.

తాతగారు అలాగే అమ్మను భుజంమీద పడుకోబెట్టుకుని, స్నానానికని దొడ్లో బావి దగ్గరకు తీసుకువెడతారు. అక్కడికి అన్నపూర్ణమ్మగారు (చిదంబరరావుగారి భార్య) ఆవుపాలు, పంచితం తీసుకువస్తుంది అమ్మచేత తాగించడానికి.

ఇంతలో పక్కింటి దుర్గమ్మగారు వచ్చి "అది కాదండీ. దర్భ కాల్చి నాలుకమీద పెడతారు. ప్రాయశ్చిత్తం. చిన్నపిల్లకు అవన్నీ మనమెక్కడ చేస్తాం?" అన్నది.

అది విన్న అమ్మ "పోనీలే మీ నాన్నగారికి పెట్టండి" అని "అమ్మమ్మగారూ! మొన్న మీరు ఆస్పత్రిలో చేరినప్పుడు మీకు మందులిచ్చింది, నీళ్ళు పోసింది ఎవరు? మీరు మంచంమీద బైటకు పోతే బొచ్చ (బెడ్‌పాన్) పట్టింది వాళ్ళే. మీకు నోట్లో మందు పోసింది వాళ్ళే" అంది.

దానికి దుర్గమ్మగారు "బొచ్చ పట్టిన మనిషి వేరు. మందు వేసిన మనిషి వేరు" అంది.

"కాదు... వాళ్ళు కడగా వుండి, కడగా వున్నవాళ్ళకు చాకిరీ చేసి, వాళ్ళకు పురుళ్ళు చేసి, బొచ్చలు పట్టిన వాళ్ళే నీకు మందుపోసారు. నువ్వు యేం పెట్టి కాల్చుకున్నా నీ నాలుక, నీ రక్తం కూడా మైల పడ్డది" అంది అమ్మ.

ఈలోగా వెంకటసుబ్బయ్యగారు స్నానం చేసి, ఆవుపంచితం త్రాగి, మళ్ళీ స్నానం చేసి సాలిగ్రామ తీర్థం త్రాగుతారు.

అలా వారు ఆ మాటా యీ మాటా మాట్లాడుకుంటూ ప్రాయశ్చిత్తానికి వొప్పుకోని అమ్మకు చెంబెడు నీళ్ళు పోసి లోపలకు తీసుకుపోయిన తరువాత అమ్మ తాతగారితో తన తార్కిక, మానవతావాదాన్ని కొనసాగిస్తూ,

"మన మలమూత్రాలు బాగుచేసి, శుభ్రపరచినందుకే కదా దానికింత రచ్చ చేశారు. రాయిమీద నీళ్ళు పోసి, ఆ నీళ్ళు తీసుకొచ్చి, దానిని సాలిగ్రామమంటే అంత పవిత్రతా? ఆవు పంచితానికున్నంత పవిత్రత దానికి లేదూ? కాకపోతే ఆవుపంచితం ఆరోగ్యం కావచ్చు. దానివల్ల కొన్ని ఉపయోగాలుండొచ్చు. మన కడుపులో వున్న అశుద్ధానికి అంటు లేకపోయె. దాన్ని బాగుచేసిన వాళ్ళకు అంటు వచ్చింది. అది (వాళ్ళు) బాగు చేసిన దొడ్లో మళ్ళీ కూచుంటూనే వున్నాము కదా? అసలు అంటు ఏమిటో... అంటు అంటే వదలనటువంటిదని నా ఉద్దేశం" అన్నది.

భక్త పాఠకులారా! ఇదీ అమ్మలో గల మాతృత్వ హేతువాద తత్త్వము. అది హేతువాదము కాదు. సహేతుకవాదము.

ఏ కన్నతల్లికీ తన పసిబిడ్డ ఒళ్ళంతా అశుద్ధం పులుముకు వచ్చినా అసహ్యంకలుగదు. ఆ బిడ్డను ఆప్యాయంగా ఒళ్ళోకి తీసుకుని తన చేతులతో శుభ్రపరచి, సేద దీరుస్తుంది.

అయితే ఆదిపరాశక్తి, రాజరాజేశ్వరి అయిన అమ్మకు కుల, మత, ఉచ్చ, నీచ రహితంగా ఈ లోకంలోని సకల జీవకోటీ బిడ్డలే.

అందుకే ఇంతకుముందు మనం చెప్పుకొన్నట్టుగా అమ్మ, తన నాలుగేళ్ళ వయసులోనే మస్తాన్, మౌలాలీల వంటి ముస్లిం మతస్థులనూ, పెద్దయినాక విదేశీయులైన మిస్టర్

జేమ్స్ కాంపియక్, చెస్టర్‌లండ్, రిచర్డ్, చివరిగా టెరీన్స్ వంటి పాశ్చాత్యులైన క్రిస్టియన్‌లనూ ఆదరించింది. ఆ విదేశీ భక్తులు ఇప్పటికీ తమ సేవలను అమ్మకు అందిస్తూనే వున్నారు.

ఆ విదేశీ భక్తులను గురించి ముందు ముందు ప్రస్తావించుకుందాం.

ఆ చిన్నవయసులోనే రైల్లో పేదవాడైన బాలుడిని ఆదుకుని చివరిగా అతడికి కైవల్యాన్నిచ్చింది.

పైన చదువుకున్నట్లు అందరూ అంటరానివాడని చీదరించుకున్న పాకీపనివారి బిడ్డడిని ప్రమాదం నుండి కాపాడి అక్కున చేర్చుకుంది.

అదీ ఆమెలో గల మాతృత్వం రూపుదాల్చుకున్న రాజరాజేశ్వరీ తత్త్వం!

ఇంకొక విషయం- అపరబ్రహ్మ అయిన ఆమెకు ఈ సృష్టిలో అశుద్ధం కూడా పవిత్రమైనదే. అందుకే ఒకసారి జిల్లెళ్ళమూడిలో తన మామగారి ఆబ్ధికం పెడుతున్నపుడు మంత్రం చదివే బ్రాహ్మణుడు "అన్నం పరబ్రహ్మ స్వరూపం" అని అంటే, అమ్మ "శాస్త్రిగారూ! అన్నం పరబ్రహ్మ స్వరూపం అయితే మరి అశుద్ధమో?" అని అడిగింది.

అంటే, అంతకుముందు పరబ్రహ్మ స్వరూపంగా భావించి, సుగంధభరితమై, కనువిందు చేసే, చవులూరించే ఆ బ్రహ్మపదార్థాన్నే లొట్టలేసుకుంటూ తిన్న మనం, తీరా అది మన పొట్టలో చేరి, తన బ్రహ్మత్వాన్ని మన మనసుకూ, తనువుకూ పంచి పిప్పిగా మారి బయటకు వస్తే, మారిన దాని రూపాన్ని, అది వెదజల్లే దుర్గంధాన్నీ భరించలేక ముక్కూ కళ్ళు మూసుకుంటాం.

ఇదెక్కడి విచిత్రం!! ఇదెవ్వరి విన్యాసం?!

ఇంకెవరివి? ఆ సుందరం, సుగంధం, వికృతం, దుర్గంధం అన్నీ తనదే అయి తానే అయిన ఆ పరబ్రహ్మవి!

ఆ తేడాలన్నీ మానవులమైన మనకేగాని, వాటిని సృష్టించిన ఆ పరబ్రహ్మకు లేవు.

ఆ పరబ్రహ్మమే, మన్నవ వారింట పుట్టి, బ్రహ్మాండం వారింట మెట్టి అపరబ్రహ్మయై మనముందు నిలిచిన అనసూయమ్మ!

అందుకే- శుద్ధానికీ, అశుద్ధానికీ తనకేమీ తేడా లేదంటూ పెద్దయినాకే కాదు, నాలుగేళ్ళ చిరుప్రాయంలోనే తాను బాపట్ల చిదంబరరావు తాతగారింట్లో వున్నప్పుడే తెలియజేసింది అవతారమూర్తి అనసూయమ్మ!

అప్పట్లో వారి ఇంటి పెరట్లో మానవ మలాన్ని విసర్జించే పాకీదొడ్లను ప్రతిరోజూ పాకీవాడు వచ్చి ఊడ్చి శుభ్రపరచేవాడు. ఒకసారి రెండురోజులపాటు ఆ పాకీమనిషి రాక ఆ దొడ్లన్నీ నిండిపోయి, దుర్గంధ భూయిష్టమయి ఇంట్లో వారందరూ

వాటినుపయోగించుకునేందుకు ఇబ్బంది పడుతుంటే, అమ్మ పసిపాప అయినా అసహ్యించుకోక పాకీవాడు ఉపయోగించే చేట చీపురు తీసుకుని, అందులోని మలినాలను ఎత్తి పారబోసి శుభ్రపరచింది. (పే. 88,89- జీవిత మహోదధి)

మరి, తల్లికదా! తను ఆ యింట్లో వారందరికీ బిడ్డ అయినా, వారందరినీ తన బిడ్డలుగానే భావించి, ఇంటి మరుగు దొడ్డిని బాగుచేసి, వారి ఈతి బాధలను పోగొట్టి, కన్నతల్లి వలె సేదదీర్చింది.

అంతేకాదు, పగటిపూట ఆ మరుగుదొడ్డిలోకి తన కూనలతో సహా వచ్చి అందులోగల మానవ విసర్జితాలను తినిపోయే పందిపట్ల కూడా మాతృత్వాన్ని ప్రదర్శించింది అమ్మ.

మనం విసర్జించిన, మనమే అసహ్యించుకునే ఆ పదార్థాన్ని తిని కడుపు నింపుకొంటున్న ఆ సూకరాన్ని చూచి జాలిపడిన అమ్మ, తను తింటున్న అన్నాన్ని ఆకులో వేసుకుని వెళ్ళి ఆ పందికి దగ్గర వుండి తినిపించింది.

అలా రెండు మూడు రోజులు అమ్మ చేతి అన్నం ముద్దలు తిన్న ఆ పంది తరువాతి రోజులో కడుపు నింపుకునేందుకు మరుగుదొడ్డిలోకి పోకుండా అమ్మ చేతి అన్నం తినడానికి అమ్మను వెదుక్కుంటూ వచ్చేదట.

అంటే, ఈ లోకంలో అతి నికృష్టమయిన జీవి కూడా మంచి పదార్థాలు దొరకని పక్షంలోనే, తన కడుపు నింపుకునేందుకు నీచ పదార్థాలను ఆరగిస్తుందన్నమాట.

ఆ విషయాన్ని అమ్మ ప్రత్యేకంగా ఆ అల్పజంతువు అయిన సూకరం విషయంలో ఋజువు చేసింది.

అంతేకాదు, అసలు విషయం ముందున్నది. అదేమిటో తెలుసుకోండి. (పే. 83- జీవిత మహోదధి)

“అమ్మ ఎప్పట్లాగే అన్నము తీసుకుని దొడ్లోకి పంది దగ్గరకు పరుగెత్తుతుంది.

పడుకున్న పంది అమ్మను చూచి (యెవరైనా ఇంటికి వస్తే, ప్రేమగలవారు ఆదరంగా పలకరించినట్లు) లేచి అమ్మ దగ్గరకు వస్తుంది.

అమ్మ అన్నం పందికి పెట్టగానే, అది అన్నం తినకుండా అమ్మనానుకుని పడుకుంటుంది. పిల్లలు వచ్చి తల్లిదగ్గర పాలు త్రాగుతూ వుంటాయి. అమ్మ పంది వెన్ను రాస్తూ తన అరచేతిలో అన్నం పెట్టుకుని పందికి తినిపిస్తుంది. అది తిని పంది నిద్రపోతుంది. దాని తొమ్మిది పిల్లల్లో ఐదు నిద్రపోతున్నాయి. నాలుగు పాలు త్రాగుతున్నాయి. అమ్మ లేచి వెళ్ళి చిన్నగ్లాసు తీసుకువచ్చి ఆ పందిపాలు పిండుతుంది. నాలుగు పిల్లలు పాలు తాగుతుండగా తక్కిన రొమ్ములకు పాలు చేపుకొని వుంటాయి.

అమ్మ, రెండు రొమ్ములు పాలు పిండితే గిద్దెడు వస్తాయి. అమ్మ పాలు తీయబోగా పంది కళ్ళుతెరచి తీసుకోమన్నట్టు అమ్మవంక చూస్తుంది. వెంటనే దాని రొమ్ముల్లోకి పాలు వచ్చి పైకి ఒక్కొక్క చుక్క కనబడుతూ వుంటాయి. అమ్మ గ్లాసు పెట్టి చెయ్యి తగలగానే గ్లాసు నిండుతుంది. అమ్మ గ్లాసు తీసినా పాలు ఇంకా వున్నట్లే వుంటుంది. అప్పుడు అమ్మ నోరుపట్టి యీ రొమ్మున ఒక గుటక, ఆ రొమ్మున ఒక గుటక వేస్తుంది."

భక్త పాఠకులారా! ఇదీ సర్వభూతములయందు అమ్మకు గల సమదృష్టి. ఇటువంటి సమదృష్టి ఒక్క భగవంతునికి తప్ప మానవమాత్రులెవరికీ వుండదు. అమ్మ సాక్షాత్తూ 'భగవత్స్వరూపిణి' అనేందుకు ఇంతకన్నా వేరే దృష్టాంతము అక్కరలేదు.

ॐ ॐ ॐ



శ్రీమత్ సింహాసనేశ్వరి

# ఒక పసిపాపకు అమ్మ ఇచ్చిన దివ్యదర్శనం

పై సంఘటన అమ్మ చిన్నతనంలో జరిగితే ఈ క్రింది సంఘటన అమ్మ పెద్దదయి, పెళ్ళయి, ముగ్గురు పిల్లల తల్లి అయిన తరువాత జరిగింది. (శ్రీమతి బ్రహ్మాండం వసుంధర వ్రాసిన 'మహోపదేశం' గ్రంథం నుండి.)

బాపట్లలో దేశిరాజు రాజమ్మగారనే యోగిని వుండేది. ఆమె పరమ సనాతన పరాయణురాలు. ఆచార వ్యవహారాల విషయంలో పరమ ఛాందసురాలు. వాటిలో ఆమెది పట్టేకాని విడుపులేని తత్త్వం.

ఆమె తన దగ్గరకు వచ్చేవారికి మంత్రోపదేశం చేసేది. దానితో ప్రజలు ఆమెను ఒక మహాత్మురాలిగా, సిద్ధులు కలిగిన యోగినిగా చూడసాగారు. ఎప్పుడైతే ప్రజల నుంచి ఇటువంటి స్పందన లభించిందో ఆమెలో కొంచెం అహం పొడచూపింది.

అయితే, అమ్మ పినత్తగారు, అమ్మలోని గొప్పదనాన్ని గమనించినా, అంతలోనే మాయగమ్మి, అమ్మను సాధారణ గృహిణిగానే భావించి, ఆమెను ఎవరైనా పెద్దవాళ్ళ దగ్గరకు తీసుకువెళ్ళి ఉపదేశం చేయిస్తే ఆమె మరింత రాణిస్తుందనే అభిప్రాయంతో ఆమెను రాజమ్మగారి వద్దకు తీసుకువెళ్ళి ఉపదేశం చేయమని కోరింది.

ఇది జరిగింది 1949 ఆగస్టులో.

తనమటుకు తానొక మహామహితాత్మురాలనని భావించే రాజమ్మగార్కి, ఇరవై ఆరు సంవత్సరముల వయసుగల అమ్మని చూడగానే ఎవరో అనామకురాలిలా, అర్భకురాలిగా కనిపించింది. నిజానికి అమ్మకూడా ఆ వయసులో చాలా అమాయకురాలిలా, అర్భకంగా కనిపించేది.





సామాన్య గృహిణి వలె నీళ్ళు తోడి, తీసుకు వస్తున్న జగజ్జనని

ఇంకా చెప్పవలసి వస్తే, అమ్మ, తాను పుట్టినప్పటి నుంచీ ఎన్నో మహిమలనూ, నిదర్శనాలనూ చూపినా, అసలు "నేను నేనైన నేను' అనీ, 'అన్ని నేనులూ నేనే' నని తన అవతార ప్రకటన చేసింది మాత్రం తనకు ముప్పైఅయిదు సంవత్సరాల వయసు వచ్చిన తరువాతనే.

అంతవరకూ తాను చూపిన మహిమలేవీ తనకు ఆపాదించుకోకుండానే గడిపింది. గుప్తంగానే తన అవతార కార్యక్రమాన్ని కొనసాగించింది.

ఆ విధంగానే రాజమ్మగారి వద్దకు వచ్చి, ఆమెను చూచిన అమ్మ, తాను ఆమె దగ్గర మంత్రోపదేశం తీసుకునే బదులు ఆమెకే తాను ఉపదేశం చేసే పరిస్థితిని కల్పించి, ఆమెలోని అహాన్ని అణచి, ఆమె అంతట ఆమే తనకు దాసోహమైనట్టు చేసింది. అదే అమ్మ చేసే శిక్షణ కార్యక్రమం!

రాజమ్మగారి వద్దకు వెళ్ళగానే అమ్మ, ఆమెచేతిలో తాను తెచ్చిన పటిక బెల్లం పెట్టబోయింది. రాజమ్మగారు దానిని అందుకొనక క్రిందన పెట్టమన్నారు. అమ్మ ఆమె పాదాలను తాకి నమస్కారం చేయబోగా, ఆమె తన పాదాలను వెనక్కు తీసుకున్నారు. పైగా తన పాదాలను ఎవరైనా తాకితే వారి దోషాలు తనకంటుకుంటాయన్నది.

అమ్మ అప్పుడే గట్టిగా నిశ్చయించుకున్నట్టుంది ఆమెను మార్చాలని.

అందుకే, తమ యింటిలోనే మూడురోజుల పాటు అమ్మను వుంచుకుని, తనకు మంత్రోపదేశం చేసే పనిలో భాగంగా రాజమ్మగారు అన్న ప్రతీమాటకూ ఎదురు చెప్పీ, ఆమె చేసే ప్రతీపనినీ తన సహజసిద్ధమైన హేతువాదంతో ప్రశ్నించీ, ఆమెను ఒక విధమైన గందరగోళంలో పడవేసింది అమ్మ.

అంతకుముందు రాజమ్మగారి వద్దకు వచ్చిన భక్తులందరూ ఆమెకొక మహిమాన్వితాన్ని ఆపాదిస్తే... అమ్మ తనకన్నా పెద్దదయిన రాజమ్మగారిని ఒకవంక గౌరవిస్తూనే ఆమె చెప్పిన మంత్రోపదేశ క్రతువునంతా కొట్టిపారవేసేది.

ఇక ఇప్పుడు ఆమె ఆచార వ్యవహారాలన్నీ అర్థం లేనివని, కులమత బేధం లేకుండా తోటి మానవుల్నీ, అలాగే సకల జీవులనూ కారుణ్యదృష్టితో, సమభావంతో చూడాలనీ చెప్పేందుకు సిద్ధమయింది.

అందుకే రాజమ్మగారు మంత్రోపదేశం చేసేముందు ఆ క్రతువులో భాగంగా అమ్మనోటిలో పెట్టిన అన్నంముద్దను, ఆ సమయంలో తనప్రక్కనే వున్న మూడు సంవత్సరాల వయసుగల తన చిన్నకొడుకు రవి నోటిలో పెట్టి, అతనిచేత సగం కొరికించి, మిగిలిన సగం తన నోటిలోపెట్టుకోబోతుండగా, మరి అది కాకతాళీయమో, లేక అమ్మ సంకల్పమో తెలీదు కాని హఠాత్తుగా ఈ క్రిది సంఘటన జరిగింది. (పే. 33-మహోపదేశం.)

"అప్పుడు అమ్మ చిన్నకుమారుడైన రవి ప్రక్కనే వున్నాడు. అతనికి మూడు సంవత్సరముల వయసు. అమ్మ అతని నోటిలో ముద్దపెట్టి, అతనిచేత కొరికించి, తిరిగి ఆ ముద్దను తీసుకుంటూ వుండగా, ఒక పిల్లి వచ్చి ఎగబడి ఆ ముద్దను కొరికింది. ఒక ప్రక్కగా ఎరుపు, తెలుపు, నలుపు మచ్చలు గల రాజమ్మగారి పెంపుడు కుక్క వచ్చి విస్తట్లో వున్న అన్నం మీద పడ్డది. పిల్లి కొరికిన అన్నమూ, కుక్క తిన్న అన్నమూ కలిపి ముద్దచేసి అమ్మ నోటిలో పెట్టుకున్నది.

అది చూచి రాజమ్మగారు "అయ్యో! అయ్యో!" అని అరిచింది.

ఇంతలో వాకిట్లోనుంచి "అమ్మా! మధుకరం" అన్న కేక వినిపించింది.

అమ్మ: అమ్మా! బిచ్చగాడు వచ్చాడు.

రాజమ్మ: తలుపు తీయమ్మా! బిచ్చగాడు కాదులే. బ్రాహ్మణ వటువు. రోజూ వస్తాడు.

అమ్మ: రోజూ వస్తే బిచ్చగాడు కాడా? బ్రాహ్మణుడైతే కాడా?"

అని అడుగుతూ అమ్మ వెళ్ళి తలుపుతీసి చూచి...

"మీరన్నట్లు కాదు. వాడు మామూలు బిచ్చగాడేనమ్మా!" అంది.

రాజమ్మ "సరే, అన్నం తీసుకుని వెళ్ళి వెయ్యమ్మా!" అంది.

అమ్మ విస్తట్లో అన్నం చేత్తో పట్టుకుని, బయటకు వెళ్ళి బిచ్చగానితో "పట్టునాయనా!" అన్నది. అతను చేతిలో వున్న బిడ్డను క్రిందికి దించి జోలెలో వున్న గిన్నెను పట్టుకున్నాడు. అమ్మ అన్నం వేస్తుండగా పిల్ల ఆశకొద్దీ అతని చేతిలో గిన్నెను లాగింది. గిన్నెతో సహా పిల్ల క్రిందపడి కెవ్వుమన్నది. అమ్మ ఆ పిల్లను ఎత్తుకుని సముదాయిస్తూ లోపలకు తీసుకువచ్చింది.

ఆ పిల్లను చూచి ఉలిక్కిపడి రాజమ్మగారు "అయ్యో! పిల్లను లోపలకు తీసుకు వచ్చావేం?" అంది. అమ్మ అది వినిపించుకోనట్టు తన చేతిలో ముద్ద పిల్లనోటిలో కొంతపెట్టి మిగతాది తను తింది.

అది చూచిన రాజమ్మగారి ముఖం అసహ్యతా స్ఫోరకంగా మారింది. తరువాత "ఇంతకూ ఈ పిల్ల ఎవరు?" అంటూ బయటకు వచ్చింది.

బైట బిచ్చగాడిని చూచింది.

పాకీవాడు! నోటినిండా అన్నం కుక్కుకున్నాడు. వాడిని చూచిన రాజమ్మగారు మరింత కళవెళపడి,

"ఓరీ! నీవంటరా? హరి హరీ! ఇన్నాళ్ళనుంచి కనిపించడం లేదేమిరా? ఇవ్వాళే వచ్చావు నీవు" అంది.

"నే...నే... దొరసానమ్మా!" అన్నాడు వాడు. నోటినిండా అన్నంతో మాటలు కూడా సరిగా రాక. ఇంతలో అమ్మ కూడా పిల్లనెత్తుకుని బైటకు వచ్చింది.

రాజమ్మ అమ్మతో "వాడి కడుపాత్రం చూడు" అంది.

దానికి అమ్మ "అది కడుపాత్రం కాదమ్మా! ఆకలి. దాని ప్రభావం మీకు తెలీదు" అంది.

రాజమ్మగారు వినిపించుకోకుండా పాకీవాడితో, "దొడ్డి చిమ్మడానికి రావడం లేదేమిరా?" అంది.

దానికి వాడు "బొత్తిగా మీ పాకీది లెగవడం లేదండీ!" అన్నాడు.

ఇంతలో అమ్మ, తన చంకనున్న పిల్లను వాడికందిస్తూ,

"మీ అమ్మాయిదిగో. ఏడుస్తున్నది తీసుకో" అంది.

అందుకు బిచ్చగాడు "పిల్లమాట మరిచేపోయా తల్లీ! గిన్నెనిండా బువ్వ పెడితివి. పొట్టనిండె" అన్నాడు.

అమ్మ పిల్లను వాడికందించింది. వాడు "కింద దించమ్మా!' అన్నాడు. అయితే ఆ పిల్ల అమ్మ భుజం గట్టిగా పట్టుకుని వదల్లేదు. అమ్మ పిల్ల రెండు రెక్కలు పట్టుకుని వాడిచేతుల్లో వుంచింది.

అది చూచిన రాజమ్మగారి కన్నులు ఎర్రబడ్డాయి. సహజగుణం చావదు మరి! ఆమె కోపంతో, బాధతో వణికే కంఠంతో "కొంపదీసి ఇది వాడి పిల్లేనా ఏమిటి?" అంది.

దానికి అమ్మ "క్రిందపడి వుంటే తీసుకువచ్చా. వాడి పిల్ల అవునో కాదో తెలీదు. నా పిల్ల అనిపించింది. ఎత్తుకున్నాను" అంది నిర్వికారంగా. అమ్మ మనసులాగే మాట కూడా నిర్వకారంగానే వున్నది.

భక్త పాఠకులారా! ఆ పాకీవాని పిల్లకు అమ్మదగ్గర ఏం కనబడ్డదో... అమ్మ, రాజమ్మలు ఈ సంఘటన గురించే కాస్సేపు మాట్లాడుకున్న తరువాత లోపలకు వెళ్ళాక, తన పిల్లను తీసుకుని వెళ్ళిపోయిన ఆ పాకీవాడు పిల్లను తీసుకుని మళ్ళీ వచ్చి,

"అమ్మా! చిన్నమ్మగారి కోసం పిల్ల ఏడుస్తున్నది. ఒక్కసారి బైటకు వచ్చి వెళ్ళమనమ్మా!" అని వీధిలోంచి అరిచాడు.

అది విని అమ్మ, రాజమ్మగారు బయటకు రాగానే ఆ పిల్ల తండ్రి చంకలోనుండి జారి వచ్చి అమాంతం అమ్మ పాదాలమీద పడి చాలాసేపు అలాగే వుండిపోయింది. ప్రాణం పోయిందేమోనని తండ్రి భయపడ్డాడు. ఇదిచూచి, వచ్చేపోయే జనం గుమికూడారు.

ఇదంతా చూచిన రాజమ్మగారు చేసేదేమీ లేక రెండు చేతులమధ్య తలపెట్టుకుని నిస్సహాయంగా కూచుండిపోయింది.

ఇంతలో రాజమ్మగారి కుమారుడు బాపారావు వచ్చి ఈ దృశ్యాన్ని జనాన్ని చూచి "ఏమిటిదంతా?" అని అరచి లోపలకు వెళ్ళిపోయాడు.

అప్పుడు అమ్మ కాళ్ళమీద పడివున్న పిల్ల లేచి మళ్ళీ కాస్సేపు అమ్మవంక పరీక్షగా చూసి "అమ్మా" అని పెద్దగా కేకవేసింది.

అంతకుముందు తండ్రి చంకలోనుంచి జారి, అమ్మ పాదాలమీద పడినప్పుడు, ఇప్పుడు లేచి మళ్ళీ అమ్మవంక చూచినప్పుడు మరి ఆ పిల్లకు అమ్మముఖంలో ఏం కనబడిందో "అమ్మా!" అని అమ్మవంక చూస్తూ కేకవేసి "చక్రం కావాల"ని అడిగింది.

అప్పుడు ఆ పిల్ల తండ్రి అమ్మతో "ఏమిటి దొరసానీ! చక్రం కావాలంటున్నది?" అని అడిగాడు.

అందుకు అమ్మ "ఏమో నాయనా! నా దగ్గర యేమీ లేదు. వట్టి చేతులేగా" అన్నది అమాయకంగా.

దానికి బిచ్చగాడు "అయితే ఇందాకటినుంచి యేమి చూచి వుంటుంది? అమ్మా! ఈ పడుకోవడమేమిటి? ఈ ఏడుపేమిటి? ఎవ్వరి దగ్గరకు వచ్చే బిడ్డకాదే!" అంటూ అమ్మదగ్గర బిడ్డకు ఏం జరిగిందో, అమ్మలో ఏం కనబడిందో తెలియని అయోమయస్థితిలో పడిపోయాడు." (పే.36–మహోపదేశం)

భక్త పాఠకులారా! దీనికి కారణం ఏమిటో మనం తెలుసుకోవచ్చు. ఆ పిల్ల అమ్మను చూడడానికి రెండోసారి వచ్చినప్పుడు ఆ పసిదానికి అమ్మ తన విశ్వరూపాన్ని చూపించి వుండవచ్చు. అది చూస్తూనే ఆ పిల్ల, తన తండ్రి వొడినుంచి జారిక్రిందపడి, అమ్మ పాదాలపై వ్రాలి స్పృహ తప్పి, చాలాసేపు వుండిపోయింది. తర్వాత చాలాసేపటికి లేచి, అమ్మవంక తదేకంగా చూచినప్పుడు అమ్మ తలవెనుక కాంతులీనే ఒక వలయం గిరగిరా తిరుగుతూ కనబడివుంటుంది. అది, ఆ పిల్లకు ఆడుకునే చక్రంలా కనబడి వుంటుంది.

అందుకనే "అమ్మా!" అని అరిచి ఆ చక్రం కావాలని అమ్మను అడిగింది.

అది చక్రమనే సంగతి చూచిన ఆ పిల్లకు, దానిని ప్రదర్శించిన ఆ జగన్మాత (అమ్మ)కు మాత్రమే తెలిసిన దేవ రహస్యం!

అయాచితంగా ఆ అమ్మలగన్న అమ్మయొక్క దివ్యదర్శనం పొందిన ఆ పసిపాప ఎంత అదృష్టవంతురాలు?!!

సరే... ఇప్పుడు మళ్ళీ రాజమ్మగారి విషయానికి వస్తే, ఆ తరువాత జరిగిన సంఘటనల్లో అలా అనేకన్నా అమ్మ జరిపించిన లీలావినోదంలో రాజమ్మగారు అమ్మను పరిపూర్ణ అవతారమూర్తిగా గ్రహించి, ఆమెకు దాసోహమనటం, తను ఆమెకు మంత్రోపదేశం చేయటంకాక, తానే తన అహాన్ని పారదోలి, అమ్మవద్ద 'మహోపదేశం' పొందటం జరిగింది.

భక్త పాఠకులారా! ఇదీ అమ్మయొక్క శిక్షలేని శిక్షణ. ఎటువంటి అహంకారులనైనా వారిని శిక్షింపక, కేవలం వారిలోని అహాన్ని మాత్రమే నశియింపజేసి, వారిని సరియైన మార్గంలోనికి నడిపించేది అమ్మ.

అటువంటి శిక్షణలో భాగంగానే, తూర్పు గోదావరిజిల్లా చెందుర్తి కరణంగారు పెమ్మరాజు సత్యనారాయణమూర్తి గారి ఉదంతాన్ని గురించి ఇప్పుడు తెలుసుకుందాం.



అమ్మకు పూరింటిని కట్టించి యిచ్చిన
శ్రీ అధరాపురపు శేషగిరిరావుగారు

# అమ్మ యొక్క దుష్టత్వ శిక్షణ

చెందుర్తి గ్రామకరణం గారైన పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారు బాలోపాసకుడు. ఇదేగాక ఆయన ఇంకా ఏవేవో శక్తుల్ని పూజించి సిద్ధులు సంపాదించాడనీ, వాటితో మెస్మరిజం చేసి అందరి రోగాలనూ నయం చేస్తాడనీ, అసలు ఆయన తాకితే చాలు ఎటువంటి రోగమైనా నయమవుతుందనీ ప్రజల నమ్మిక. ఆయన చనిపోయిన వారిని బ్రతికిస్తాడని కూడా ప్రతీతి.

ఆయన కూడా వారి నమ్మకాన్ని ఆధారంగా చేసుకుని అహంకారియై, తనవద్ద గల సిద్ధులతో వ్యాపారం చెయ్యటం మొదలుపెట్టాడు.

అదే ఊపులో సాక్షాత్తూ, అమ్మకు మేనత్త భర్త అయిన శ్రీబ్రహ్మాండం సుబ్బారావు గార్కి జబ్బు చేసి, ఆయన అవసాన దశలో వుండగా, ఆయనను తన మంత్రబలం చేత బ్రతికిస్తానని డంభాలు పలుకుతాడు.

దానిని నమ్మి ఆ యింటివారు సుబ్బారావుగార్ని బాపట్లలో చిదంబరరావుగారి ఇంటికి చేర్చి అక్కడనే వున్న పెమ్మరాజు సత్యనారాయణమూర్తిగారి చేత తీర్థమిప్పించి మెస్మరిజం చేయించేవారు.

అయినా సుబ్బారావుగార్కి జబ్బు తగ్గలేదు సరికదా మరింత ఎక్కువయింది. చివరికి ఆయన చిదంబరరావుగారింట్లోనే కాలం చేశారు. అక్కడే వున్న అమ్మ ఆయనకు అహర్నిశలూ సేవ చేసింది.

సుబ్బారావుగారు కాలం చేయడానికి ముందే ఆయన తన పెద్దకుమారుడైన శ్రీ నాగేశ్వరరావు (నాన్నగారు)ని వివాహం చేసుకుంటానని అమ్మదగ్గర వాగ్దానం తీసుకున్నారు. అప్పటికి అమ్మ వయసు తొమ్మిది సంవత్సరాలు.

ఆయన చనిపోయిన తరువాత ఆయన శవాన్ని చిదంబరరావుగారి ఇంటి ఆవరణలోనుంచగా, ఆ శవం దగ్గరనే వున్న అమ్మ డాబాపై నుంచుని క్రింద జరుగుతున్న అంతిమ సంస్కారాలను చూస్తున్న పెమ్మరాజు సత్యనారాయణమూర్తి గారివైపు తలెత్తి చూస్తుంది.

ఆ తరువాత ఏమైందో ఈ క్రింద చదవండి. (పే.321- జీవిత మహోదధి)

"పెమ్మరాజు సత్యనారాయణగారు కిందికి చూచినపుడు ఆ చూపు అమ్మవైపు పడుతుంది. సరిగ్గా అదే సమయంలో క్రిందనుండి తనవైపు చూస్తున్న అమ్మ, సాక్షాత్తూ తాను కొలిచే బాలాత్రిపురసుందరి వలెనే వుండి, పకపకా నవ్వుతూ చెయ్యి పైకెత్తి వస్తాని

చూపుతూ 'యేమిటి నీముఖం నీవు చేసింది? బ్రతికిస్తానని వస్తివే?' అని అన్నట్టు కనబడి, వెంటనే ఆ రూపము మారి, లోగడ తాను చేస్తున్న కృత్రిమమైన పనులన్నీ అమ్మముఖంలో తనే చూస్తారు.

తరువాత అమ్మకూడా శవంతోబాటు శ్మశానానికి బయల్దేరుతుంది. అయితే అక్కడ వున్న పెద్దలందరూ "రాకూడదు. వద్దు వద్ద"ని కేకలు వేస్తారు. అందువల్ల అమ్మ అక్కడే వుండిపోతుంది.

అలా వారు "వద్దు పొమ్మని" అమ్మను కేకలు వేసే సమయంలో సత్యనారాయణగార్కి ఆ రూపం దున్నపోతుమీద కూచున్న యమధర్మరాజులా కనబడి, మళ్ళీ మామూలు అమ్మగా కనబడుతుంది.

సత్యనారాయణగారు ఇదంతా తన 'మనోభ్రమ' అనుకుంటారు. అలా 'భ్రమ' అని ఆయన అనుకోగానే, అమ్మ వర్చస్సులో 'కాదు' అన్నట్టుగా తోస్తుంది.

అంతలో అమ్మ, సుబ్బారావుగారి పిల్లలు పైన ఏమి చేస్తున్నారోనని మేడమీదకు వస్తుంది. అమ్మ వచ్చే సమయానికి పిల్లల దగ్గర సత్యనారాయణగారు అటు తిరిగి లోపలికి వచ్చి కూచుంటారు.

అమ్మ మామూలుగా మేడమీదకు వచ్చి "నమస్తే స్వామీ!" అంటుంది.

కాని, ఆయన బిత్తరచూపులు చూస్తూ, అమ్మ తన దగ్గరకు సమీపించగా భయపడుతూ లేచి, పక్క గదిలోకి పోతారు.

అమ్మ వెళ్ళి ఏడుస్తున్న పిల్లల్ని ఓదార్చి వాళ్ళతో ఆ కబురూ యీ కబురూ చెబుతూ వాళ్ళకు ధైర్యం చెబుతుంటే ప్రక్కగదిలో వుండి ఇవన్నీ ఆలకిస్తున్న సత్యనారాయణగారు 'యీ ధీమాగల మాటలు వింటుంటే ఏదో అసాధ్యంగానే వుంది' అని అమ్మను గురించి తనలో అనుకుంటారు. "చిదంబరరావుగారు వచ్చిన తర్వాత చెప్పాలి. ఒక్కళ్ళూ గుర్తించినట్లు లేదు ఈ పిల్ల విధానం. తల్లి వుంటే ఆనందపడేది పాపం!' అని అనుకుంటూ "ఇందాకటల్లే వుందో, మార్పుగా వుందో వర్చస్సు చూద్దాం" అని అనుకుని బయటకు వస్తారు.

అమ్మ మామూలు పిల్లగానే కనబడుతుంది. అది చూశాక "అయితే తను చేసే ఉపాసనా లోపం చేత యిన్ని మార్పులుగా కనబడుతున్నది. యీ అమ్మాయి సామాన్యంగానే వున్నది" అనుకుంటారు మళ్ళీ.

ఆ రాత్రి అందరూ భోజనాలు చేసి, పడుకుని నిద్రపోతున్నా మేడమీద గదిలో పడుకున్న సత్యనారాయణగార్కి నిద్రపట్టదు. అటూ యిటూ తిరుగుతూ వుంటారు.

అమ్మ క్రింద పడుకుని వుంటే ముఖములో ముఖము పెట్టి చూస్తాడు. నిద్రపోయింది గదా అని మెల్లగా ప్రక్కలో కూచుంటాడు. ఆయన కూచున్న కాస్సేపటికి చిదంబర్రావుగారు లేచి కూచుంటారు.

అమ్మ ప్రక్కన కూచున్న సత్యనారాయణగార్ని చూసి "ఎందుకు అమ్మాయి దగ్గర కూచున్నారు?" అని అడుగుతారు.

"అమ్మాయి కాళ్ళ తీపులతో బాధపడుతుంటే మెస్మరిజం (అంటే మంత్రాలు) చేద్దామని కూర్చున్నా" అని సమాధానమిస్తాడాయన.

అమ్మ ఏమీ మాట్లాడకుండా పడుకుని వుంటుంది.

తర్వాత సత్యనారాయణగారు అమ్మ కాళ్ళమీద చెయ్యివేసి రుద్దుతూ వుంటారు.

అప్పుడు పడుకుని వున్న అమ్మ చటుక్కున లేచి,

"మీరు పెద్దవారు. నా కాళ్ళు పుచ్చుకుంటారేం?" అంది సత్యనారాయణగారితో.

దానికాయన "బాధగా వున్నదని పట్టుకున్నానమ్మా!" అన్నారు.

"ఎవరికి బాధ?" అన్నది అమ్మ.

"నీకేనమ్మా!"

"నా బాధ మీకు చెప్పుకోలేదుగా. అయినా మీరు పట్టుకుంటే బాధలు తగ్గుతాయేంటి?"

"ఆ తల్లి దయవల్ల తగ్గుతుందమ్మా!" అన్నారాయన తను కొలిచే బాలాత్రిపురసుందరి నుద్దేశించి.

"మరి మామగారికి తగ్గించలేదేం?" అన్నది అమ్మ.

"ఆయుర్దాయం లేనివారికి తగ్గదు" అన్నారాయన.

"ఆయుర్దాయం లేకపోతే చచ్చిపోతారు. మీరు చేసే మెస్మరిజం బాధానివారణకు గదా? బ్రతికి వున్నంత వరకైనా బాధలు తగ్గలేదుగా" అన్నది.

"అయ్యబాబోయ్! ఇదేమిటి? అసాధ్యపు పిడతలా వుందీపిల్ల" అనుకున్నారాయన.

ఇంతలో చిదంబర్రావుగారు లేచి "ఏమిటమ్మా! ఏమిటా గొడవ?" అంటారు అమ్మతో.

భక్త పాఠకులారా! ఇంతవరకూ మనం అమ్మలోని సరళత్వాన్ని,ఆమె మాటల్లోని మాతృత్వాన్ని మాత్రమే చూశాం. ఇప్పుడు ఆమెలోని పరుషాన్నీ, మాటల్లోని కటుత్వాన్నీ చూడబోతున్నాం. చూడండి.

తాతగారు అడిగిన 'ఏమిటా గొడవ?' అనే ప్రశ్నకు అమ్మ ఘాటుగా సమాధాన మిచ్చింది.

"ఏముంది? ఈయన అడక్కుండానే అందరి బాధలు అర్థం చేసుకుంటారట. ఈ ఆవరణలో ఎవరెవరు ఏయే బాధలతో వున్నారో చెప్పమనండి, కనీసం నివారణ యెట్లా వున్నా."

"అయినా ఇంత గొడవ ఎందుకొచ్చింది పెద్దవారితో?" అన్నారు చిదంబరరావు గారు.

"పెద్దవారు పెద్దవారు కాకపోవటంతో వస్తుంది. వీరు ఉపాసకులట! ఉపాసకులు. ఉపాసనంటే యిదేనా? యేం, మూర్తిగారూ? మాట్లాడరేం? బాల ఉపాసన అంటే, చిన్నపిల్లల ఉపాసనా?" అని గొంతు పెద్దదిచేసి గద్దిస్తూ,

"ఇదేనా ఉపాసన అంటే? పలకరేం? వచ్చే వాళ్ళందరికీ మీరు చేసే మెస్మరిజం యిలాగే వుంటుందేమో. మీరు ఉపాసన మానుకున్నా సరే, వివరించి చెప్పినా సరే" అని లోగొంతుకతో ఆయనకు మాత్రమే వినబడేట్లు,

"మర్యాదగా వుంటే వుండాలి. లేకుంటే మేడ దిగు" అని తాతగారితో "ఏమిటి తాతగారూ! ఇలాంటి వారందరినీ పోగుచేశారు?" అంది.

భక్త పాఠకులారా! ఆ తొమ్మిదేళ్ళ పసిపిల్లలోని ఉగ్రరూపం ఒక్కసారిగా బైటపడే సరికి ఆ సత్యనారాయణమూర్తిగారి పరిస్థితి చూడాలి! తానొకటి తలిస్తే దైవం (అమ్మ) వేరొకటి తలిచింది. మనిషి గజగజ వణికిపోతున్నాడు.

ఇక చదవండి మళ్ళీ.

సత్యనారాయణగారు మంచానికి గజం దూరంగా నిలబడి చేతులు కట్టుకుని, తలవంచుకుని మౌనంగా దుఃఖముతో నుంచుంటాడు.

అమ్మ తాతగారి పక్కలోకి వెళ్ళి పడుకుని,

"అయ్యగారి ఉపాసనంతా వూరుకెళ్ళింది. దివాళాకోరు ముఖం వేసుకుని బిక్కముఖముతో చూడు ఎట్లా నుంచున్నాడో అయ్య" అంది.

దానికి చిదంబరరావుగారు "అసలు యేమిటమ్మా యీ గొడవ? యేమి చేసాడేమిటి? నీకు కోపం రావడమంటే సామాన్యము కాదమ్మా! ఏదో విలయముంటుంది" అన్నారు.

"ఆc... యేమన్నా చేస్తేనా" అంది అమ్మ.

"అబ్బో! మాయమ్మగారు విజృంభించిందే!"

"అవసరమైతే యేదన్నా చేస్తా. నా కోసరమే కాదు ఇట్లా ఎంతమందిని వేధిస్తున్నాడో"

"ఇదా తిరుగుడు? ఇందుకా కోపమొచ్చింది? నీ అగ్నితత్త్వాన్ని యెవరేమి చేస్తారమ్మా?"

"అయితే జలతత్త్వాన్ని చేస్తారన్నమాట."

"అది కాదమ్మా నేనన్నది. నీ జోలికి యేమొస్తార్లే అంటున్నాను. వాళ్ళని చెయ్యమని కాదు."

"ఇంతకూ ఈయన సంగతి తేల్చండి ముందు. మేడ దించండి ముందు" అంది అమ్మ కోపంగా.

"తెల్లవారనియ్యి అమ్మా" అన్నారు చిదంబరరావుగారు.

గజగజ వణికిపోతూ నుంచున్న సంత్యనారాయణగారిని చూచి "నిలువునా నుంచున్నాడు. పడుకోబెట్టండి, పడతాడేమో" అంది అమ్మ.

అప్పుడు చిదంబరరావుగారు సత్యనారాయణగారిని చూసి "స్వామీ పడుకుంటారా?" అని అడిగారు. దానికి సత్యనారాయణగారు పలకరు.

"పడుకోండయ్యా! పడుకోండి" అన్నారాయన, మౌనంగా నుంచున్న సత్యనారాయణగారిని చూసి.

"దిగండయ్యా! మేడ దిగండి" అన్నది అమ్మ వెంటనే.

"ఏమిటమ్మా! తెల్లారనియ్యరాదూ? ఏదో ఒకటి చేద్దాం" అన్నారు చిదంబరరావుగారు.

ఇక లాభం లేదనుకుందేమో అమ్మ లేచికూచుని,

"తాతగారూ! ఆయన, నేను, నువ్వు కూచుని అసలు ఉపాసన అంటే ఏమిటో తేల్చుకుందాం. ఆలస్యం చేస్తే ఆయన బాగుపడటానికి అవకాశం లేదు" అంది.

"ఈ పూటే బాగుపరచదలచావా?" అన్నారు తాతగారు.

దానికి అమ్మ "బాగుపడేరోజు వస్తేనేగా, ఆయనకు అటువంటి దుర్బుద్ధి పుట్టింది" అంది.

అప్పుడాయన "అయ్యా! మూర్తిగారూ! ఇటు కూచుందాం రండి" అంటూ సత్యనారాయణమూర్తిగారిని పిలిచారు.

అప్పుడు సత్యనారాయణమూర్తిగారు మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి అమ్మ, తాతగార్ల దగ్గర కూచుంటారు.

ఆయన కూచున్నాక చిదంబరరావుగారు "ఏమిటమ్మా! మాట్లాడు" అంటారు అమ్మను చూసి.

అందుకు అమ్మ "మాటలతో యేమి బాగుపడతారు! మాటలతో బాగుపడే స్థితి వుంటే శాస్త్రాలతో బాగుపడేవాడు. ఆయనకు అనుభవము కావాలి గాని, మాటలు

అక్కరలేదు. మీరు వుండండి తాతగారూ నేను అడుగుతాను” అని “మూర్తిగారూ! అసలు ఉపాసన అంటే యేమిటి?” అంటుంది.

దానికి సత్యనారాయణమూర్తిగారు దాదాపు పావుగంటసేపు మాట్లాడరు. ఈ పావుగంటలో ఆయన చేసినవన్నీ కళ్ళకు తట్టుతూ వుంటాయి. ఒక్కో దృశ్యం కనపడ్డప్పుడల్లా ఉలిక్కిపడతాడు. పావుగంట అయిన తరువాత “అమ్మా! భయమేస్తుంది” అంటాడు.

కాస్సేపు పోయిన తరువాత “అమ్మా! భయము అమ్మా! భయము” అంటూనే వుంటాడు.

చివరకు అమ్మ ఒడిలో తను పసివాడైనట్టుగా వుంటుంది. ఇటువంటి పసిబిడ్డలను కదా నేను మోసము చేశానునుకుంటాడు. వెక్కి వెక్కి ఏడ్చి అమ్మ రెండుపాదాలు పట్టుకుంటాడు.

అలా ఆమె పాదాల మీద పడగానే అతనికి పొద్దున్న సుబ్బారావుగారి శవము దగ్గర చూచిన బాలాత్రిపురసుందరి రూపం మళ్లీ కనబడుతుంది.

అంతే... “అమ్మా! జగన్మాతా! నీవేనా! నిన్ను అర్థం చేసుకోలేకపోయినానమ్మా! కాని, ఇంత ప్రత్యక్షంగా అనుభవాలు ఇవ్వటం కోసమే యిన్ని లోపములు చేయించావా నాచేత?” అంటూ ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తాడు, అలాగే ఆమె పాదాలమీద పడి.

అప్పుడు అంది అమ్మ. “బాలాత్రిపురసుందరి అంటే, బాల. అంటే ‘పుటక’ త్రిపురసుందరి అంటే... బాల్య, యౌవ్వన, కౌమార స్థితులు కలిగినటువంటిది, యీ బాలాత్రిపుర సుందరి. సృష్టి యొక్క స్థితి గతులు, త్రికాలములు. త్రిపురసుందరి కాలము అయినపుడు కాళి. త్రికాలాలు ఆమె రూపమే. ఆమె అంటే... చేతులు, కాళ్ళు, చీరె, రవిక కలిగిన ఆమె కాదు. శక్తి. శక్తి అంటే ప్రతి దానిలోను గర్భితమైన శక్తి. వస్తువుకు, శక్తికి విడదీయలేని శక్తి. ఆ శక్తే ఆమె!”

దానికి చిదంబరరావుగారు “ఇదివరకే అన్నావు గదమ్మా! వస్తురూపము పురుషత్వము అనీ, దానిలో వున్నది శక్తి అనీ. రెండింటినీ విడదీయలేని స్థితి ‘శ్రీవిద్య’ యని పుస్తకాలు చెబుతూనే వున్నాయి” అన్నారు.

దానికి అమ్మ “విడదీయలేని స్థితి కాదు. ఆ రెండింటి సంయోగములో వుండే సంధికాలమే- అదే... అవాఙ్మానస గోచరము” అని వివరించింది.

భక్త పాఠకులారా! ఈ విధంగా తెల్లవారుఝామున మూడు ముప్పావు వరకూ వారి సంభాషణ కొనసాగింది.

అయితే అమ్మ ఆయనకు ఇచ్చిన షాకుతో, శిక్ష కాకుండా ఆయనకు ఇచ్చిన శిక్షణతో సత్యనారాయణమూర్తిగారికి జ్ఞానోదయం అయి పశ్చాత్తాపంతో మనిషి నిలువునా కుమిలిపోయాడు.

అమ్మ చిదంబరరావుగారితో "తాతగారూ! 'శిక్ష' అంటే క్రమశిక్షణలో పెట్టడమేనా?" అని అడుగుతున్న సమయాన సత్యనారాయణమూర్తిగారు ఆమె మాటలు వింటూనే లేచి, క్రిందకు వెళ్ళి తయారయి, వెళ్ళిపోయేముందు అమ్మ దగ్గరకు మేడమీదకు వచ్చి, ఆమెకు సాష్టాంగ నమస్కారము చేసి గడగడ వణుకుతూ,

"ఈ అల్లుని త్వరగా నీలో కలుపుకో తల్లీ! జీవితమంతా తప్పులే" అన్నాడు.

దానికి అమ్మ "అల్లుడని కాదు. మీ బోటివారే ఇలా చేస్తే, మా బోటి చిన్నవాళ్ళు చెడిపోతారని మీ తప్పును మీకు తెలియపరచి, మీరు శిక్ష అనుకోవద్దు- శిక్షణ యిచ్చి, మీ పేరు సార్థకం చేద్దామని ఈ రాత్రి బయటపడ్డాను. నాకు ఇదివరకు యీ సంగతి తెలియకపోలా! నాకు ఏదైనా ఆధారం లేనిది మాట్లాడను. మీరు బాగుపడటం కూడా నాకోసమని బాగు చేస్తున్నాను. మానవుల్లో పొరబాట్లు లేనివారు లేరు. పొరబాట్లతో కూడిందే మానవత్వం. దైవము అనేపేరు పెట్టుకుని, వాడిపేరుతో అనేకమందిని యీరకమైన మోసము చేస్తే బాధ అనిపించింది కాని, సామాన్యులు చేస్తే బాధలేదు" అని ఆయనకు హితబోధ చేసి పంపించింది.

భక్త పాఠకులారా! ఇదీ అమ్మలోని దుష్టత్వ శిక్షణ. పైన చెప్పుకొన్నట్లు ఈ సంఘటన జరిగినపుడు అమ్మకు కేవలం తొమ్మిది సంవత్సరాల వయసు.

ఒక్కరోజు కూడా బడికి వెళ్ళి చదువుకోని అమ్మకు ఇంత వైదిక పరిజ్ఞానం ఎలా వచ్చింది? ఎలా అబ్బింది? అని అంటే... దానికి జవాబు స్త్రీ రూపం ధరించి దివి నుండి భువికి దిగి వచ్చిన అమ్మలోని ఆదిపరాశక్తిత్వం. ఆ శక్తి శ్రీరాజరాజేశ్వరిలోని అమ్మత్వాన్ని కూడా కలుపుకొని దుష్టశిక్షణకు బదులు దుష్టత్వ శిక్షణను కొనసాగిస్తోంది. 'కొనసాగిస్తోంది' అని ఎందుకనవలసి వస్తోందంటే ఆమె దేహం చాలించినా కూడా మన మధ్యనే తిరుగుతున్నది. మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో సహా మన ప్రతి కదలికనూ ఆమె నిశితంగా గమనిస్తూనే వుంటోంది. దానికి తగ్గట్టుగా మనల్ని నడిపిస్తూనే వుంటుంది.

ఆమె దేహ పరిత్యాగానంతర లీలలను గురించి మనం ముందు ముందు ముచ్చటించుకుందాం.

పోతే, పైన అమ్మ చెప్పినట్లు వస్తువుకీ, దానిలో చేరి సంయోగము చెందిన శక్తికీ గల సంధికాలము అవాఙ్మానసగోచరము.

అంటే, మానవులు ఆదిగా గల సకల జీవకోటిలో, ఈ భూమిపై గల సకల చరాచర పదార్థములలో శక్తి అనేది సంయోగము చెందియున్నది. అది కంటికి కనబడనిది. ఊహ కందనిది.

ఆ వస్తువును భూమి అని అనుకుంటే, ఆ భూమిలో ఇమిడియున్న శక్తిమాత్రం వివిధ రూపములు చెందియున్నది.

అది వివిధ రకములైన రుచులలో, రంగులలో మనకు బహిర్గతమవుతున్నది.

అందుకే ఒకే మట్టి (భూమి)లో పుట్టిన చెరుకు గడకు తీపిదనం, మిరపకాయకు కారం, చింతకాయకు పులుపు, వేపకాయకు చేదు, కాయధాన్యాలకు చప్పదనం, భూమినుండి ఉబికి వచ్చే మంచినీటికి దాహార్తిని తీర్చే కమ్మదనం, అదే భూమిని ఆనుకుని తనలో ఇముడ్చుకున్న సముద్రపు నీటికి ఉప్పన... ఈ షడ్రుచులకు మూలకారకం ఏది? శక్తే!

అంతేనా? భూమినుండి మొలకెత్తిన పూలచెట్లలో ఒక్కొక్క చెట్టుకు ఒక్కోరకమైన ఒక్కో రంగుతో, వివిధ సువాసనలను విరజిమ్మే, వివిధ అందాలతో కనువిందు చేసే కోమల కుసుమాలను అందజేసేది ఎవరు? ఆ శక్తే!

అదే విధానం ఈ పుడమి యందు గల మానవాది జీవకోటికి కూడా వర్తిస్తుంది.

ఆ వస్తువు పురుషుడైతే అతనిలోగల శక్తి స్త్రీ స్వరూపం. ఇక్కడ పురుషుడు అనే పదానికి అర్థం లింగబేధం లేకుండా స్త్రీ, పురుషులిద్దరికీ వర్తిస్తుంది. ప్రతీ పురుషునిలోను స్త్రీ, ప్రతీ స్త్రీలోనూ పురుషుడు అంతర్లీనంగా వుంటారు. అంటే పురుషునిలో స్త్రీ తత్త్వం, స్త్రీలో పురుష తత్త్వం కలగలిసి వుంటాయన్నమాట. ఆ తత్త్వమే శక్తి.

అదే సూత్రాన్ని ఈ సకల విశ్వానికి ఆపాదిస్తే, ఆ పురుషుని విశ్వవిభునిగాను, ఈ భువనమందలి సమస్త ప్రకృతినీ ఆతనిలో గల స్త్రీ శక్తిగానూ చెప్పుకోవచ్చును.

అమ్మ చెప్పినట్లు... ఆ విశ్వ విభుడు, ఈ భువన సౌందర్యముల సంయోగమునందేర్పడిన సంధికాలము అవాఙ్మానస గోచరమైన శ్రీవిద్య! ఆమెయే శ్రీ లలితాదేవి రూపంలో ఆవిర్భవించిన శ్రీ మాతాశ్రీ మహారాజ్ఞి! ఆమెయే మన జిల్లెళ్ళమూడి అమ్మ!

అటువంటి శ్రీ మాతను పట్టుకుని బాలోపాసకుడైన పెమ్మరాజు సత్యనారాయణమూర్తి అనబడే సిద్ధుడు అమెవద్ద తన గొప్పతనాన్ని చూపించబోయి బొక్కబోర్లా పడ్డాడు.

అంటే, సూర్యుని ముందు దివిటీ వెలిగించే ప్రయత్నం చేశాడు.

దీనిని బట్టి మనకు అర్థమయిందేమిటంటే... మన లోకమాతకు (అమ్మకు) బాల్యం నుంచే ఇటువంటి గారడీ విద్యలంటే గిట్టవని.

అందుకే, అమ్మకు వివాహమయి, జిల్లెళ్ళమూడి పాకయింట్లో వుండి పూజలందు కుంటున్న కాలంలో ఒక బాబాగారు అమ్మ దగ్గరకు వచ్చి తన సిద్ధులను ప్రదర్శించ బోయారు.

పాపం! ఆయన మంచివాడే. తన సిద్ధులను ధనార్జన కొరకు గాక, భక్తుల ఈతిబాధలను నయం చేయడానికే ఉపయోగించేవాడు. వారు సంతోషంతో ఇచ్చిందే పుచ్చుకునేవాడు.

అయినా ఆయనలో కాస్త కీర్తి కాంక్ష పొడచూపడం వల్ల అమ్మ దగ్గర తన సిద్ధులను ప్రదర్శిద్దామని తన శిష్యపరివారంతో సహా వచ్చి అమ్మకు హారతినివ్వడానికి కొట్లో కొన్న కర్పూరాన్ని గాక, తన అరచేతిలో కర్పూరాన్ని సృష్టించి హారతినివ్వ బోయాడు.

కాని, అది వెలగదే! అలా ఒకటి రెండుసార్లు ప్రయత్నించినా ఆ కర్పూరం వెలగలేదు. ఆయనకు కంగారుతో చెమటలు పడుతున్నవి.

అమ్మ అదంతా చిరునవ్వుతో మౌనంగా పరికిస్తూనే వుంది. కడకు ఆయన మూడోసారి ప్రయత్నం చేయబోగా అప్పుడు అంది అమ్మ.

"ఎందుకు నాన్నా ఈ వృధా ప్రయాస? అర్థరూపాయి ఇస్తే కొట్లో కర్పూరం లభిస్తుంది కదా!" అన్నదట చిన్నగా నవ్వుతూ.

మరి ఆ నవ్వులో ఆయనకు పరిహాసమే కనిపించిందో, హెచ్చరికే వినిపించిందో తెలీదుగాని, ఆయన ఓటమిని అంగీకరించి తలవంచుకున్నారు.

ఆ తరువాతి కాలంలో ఇటువంటి చిల్లర విద్యలను ప్రదర్శించి, భక్తులను మత్తులో ముంచి, కీర్తి కండూతులను పెంచుకుని, ధనార్జన చేసే నకిలీ బాబాలనూ, మంత్ర తంత్రాలను ప్రదర్శించే వారినీ నిశితంగా విమర్శిస్తూ, తన దగ్గర కూచున్న భరద్వాజగారితో అమ్మ ఇలా అంది. (పే.17,18,19- శ్రీవారి చరణ సన్నిధి.)

"గురువుల మంటూ ఆ పేరిట వారు చేసే అత్యాచారాలు వింటూ వుంటే కడుపు తరుక్కుపోతుంది. ఇప్పుడు ఎక్కడ చూచినా ఇదేమాట. నలుగురికి ఉపదేశం చేయగానే చాలు, వాడొక గురువై కూచుంటాడు. వాడికి చుట్టూ ఒక పదిమంది శిష్యులు. గురువు, శిష్యులని పైకి పటాటోపంగా కన్పించడం తప్ప, ఆ గురువు చెప్పేదేమిటో, చేసేదేమిటో ఆ శిష్యులకు తెలీదు. తను చెప్పినదాన్ని ఆ శిష్యులు ఎంతవరకు ఆచరిస్తున్నారో ఆ గురువుకు తెలియదు. పైగా వాళ్ళు చెప్పేదేమిటి? ఈ దేవుడు మంచివాడు కాదు, ఆ దేవుడు మంచివాడు. అంటే... వాడొకవేళ ఏ రాముడినో, ఏ ఆంజనేయస్వామినో ఎవర్నో

ఒకర్ని తాము కొలుస్తున్న ఇష్టదైవాన్ని, ఆ పేరు చెప్పి ఆ దేవుడి మంత్రం తప్ప మరొక మంత్రం జపిస్తే నెత్తి అణుస్తుందనీ, అది తప్ప వేరొకటి చేస్తే ఆ చేసేవాళ్ళకు అపకారం జరుగుతుందనీ, ఇట్లా చెబుతూ భయపెడుతూ వుంటారు. ఇక ఈ భక్తులు దానికి నిజంగా భయపడి, చివరకు రెండింటిలో మనసు నిలవక ఉభయభ్రష్టులౌతారు. ఇంకా ఘోరం ఏమిటంటే, ఉపదేశం పొందాలని తమ దగ్గరకు వచ్చే ఆడవాళ్ళను ఇది అడ్డుపెట్టుకుని నాశనం చేయడం.

ఈ ఏడ్పులెందుకు? చేసేది ఏదో బహిరంగంగా ఏడిస్తే ఫరవాలేదు. ఇదీ, ఈ ముసుగు కప్పుకొని, కాషాయ వస్త్రాలను తగిలించి వీరు ఆడుతున్న ఆటలు. చూస్తుంటే ఈ మధ్య ఈ ఘోరాలు ఎక్కువయ్యాయి. అట్లా నాశనం చెయ్యబడ్డవాళ్ళు నాదగ్గరకు వచ్చారు కూడా. వాళ్ళు చెప్పేవన్నీ వింటూవుంటే ఎంత జాలి వేసిందో నాన్నా! మరి ఎక్కడ బాధ వుంటుందంటే... 'శీలమే ముఖ్యం, పాతివ్రత్యమే ధర్మం' అనుకున్నవాళ్లను ఇట్లా చేస్తున్నారా? అని వింటూంటే చాలా బాధ కలుగుతూంది."

భక్త పాఠకులారా! విన్నారుగా. డంబాచారాలతో మోసం చేసే గురువులు, స్వామీజీలు, అమ్మలు... నేడేకాదు, నాడు కూడా వున్నారని దీనిని బట్టి తెలుస్తోంది.

ఇంకొక విషయం ఏమంటే, "నేనే అపర దత్తావతారుడ్ని" అని, దేవుని పేరు చెప్పుకొని, ఆ దేవునికి కూడా లేని ఆడంబర జీవితం గడుపుతూ, ఎ.సి. గదులలో నివాసం, ఎ.సి. కార్లలో ప్రయాణం, ఇంకా అనుకూలిస్తే, అంటే... ఖర్చులు పెట్టి తీసుకువెళ్ళే భక్తులుంటే ఫ్లైట్స్‌లో విహంగయానం చేసే నకిలీ బాబాలు, గురువులు, స్వాములు, అమ్మలు అటు భక్తుల్ని దోచేస్తూ, ఇటు ప్రజల్ని దగా చేస్తూ స్వర్గసుఖాలను అనుభవిస్తున్నారు.

కాబట్టి భక్త పాఠకులారా! మీకు మున్ముందు ఎక్కడైనా మన 'అమ్మ' (అనసూయమ్మ) లాంటి అమ్మలు, షిరిడి సాయినాథుడు, రమణ మహర్షి వంటి బాబాలు, స్వాములు మహర్షులు కనిపిస్తేనే వారిని కొలిచి తరించండి కాని, పై నుదహరించిన బాబాలు, స్వాములు, అమ్మల వంటి నకిలీల లీలలను నమ్మి, వారిపట్ల ఆకర్షితులై ఇల్లూ, వళ్ళూ గుల్ల చేసుకోకండి.

తస్మాత్ జాగ్రత్త!

# అమ్మ మాతృత్వ ప్రకటన

భక్త పాఠకులారా! ఇంతవరకూ మనం అమ్మయొక్క మాతృత్వ మమకారానికి కులమత వివక్షలు లేని విషయాన్ని గురించి తెలుసుకున్నాం.

అటువంటి వివక్షలేమి పైన చెప్పుకొన్నట్లు అమ్మకు నాలుగైదు సంవత్సరాల వయసు నుండి మాత్రమే కాదు ఆమెకు ఏడ్నర్థం వయసులోనే అదీ మానవుల పట్లనే కాదు, నోరులేని మూగజీవాల పట్లకూడా వుండేది.

ఆ వైనాన్ని తెలుసుకోండి. (పే.23-జీవిత మహోదధి)

"అప్పుడు అమ్మ వయసు ఇరవై మాసములు.

తెనాలిలో అమ్మమ్మ (అమ్మతల్లి రంగమ్మ) గారింటినుండి అమ్మ, అమ్మమ్మ మన్నవ గ్రామమునకు తిరుగు ప్రయాణము చేయుటకై తెనాలి రైల్వేస్టేషన్‌కు ఒంటెద్దు బండి ఎక్కి ప్రయాణమయిరి. దారిలో వారికి కాషాయ గుడ్డలు కట్టుకున్న ఘోషాయి కనబడి అమ్మను చూసి అమ్మమ్మతో-

"నీ బిడ్డ భగవంతుడు. నీకు జన్మ లేదు" అని అదృశ్యమాయెను.

ఇంతలో బండిని త్రోలే మనిషి బండిని రోడ్డుపై ఆపి, అమ్మమ్మ చెప్పిన పళ్ళు కొనేందుకై పండ్లకొట్టు వద్దకు వెళ్ళగా రోడ్డుపైన ఆగివున్న యీ బండిని ఎదురుగా వచ్చే ఇంకొక బండి తగిలి, ఈ బండి కాడి పైకి లేచి బండి వెనుకకు వ్రాలినా అమ్మ, అమ్మమ్మ క్రిందకు జారిపడకుండానే వుందురు. కాడి మామూలుగా ఎద్దుమెడపైనే వుండును."

భక్త పాఠకులారా! ఎద్దు మెడకు కట్టివున్న కాడి ప్రమాదవశాత్తూ పైకి లేస్తే, బండి వెనక భాగం క్రిందకు (వెనుకకు) వొరిగితే, అందులోని వ్యక్తులు క్రిందకు జారిపడిపోతారు. అంతేకాదు, ఎద్దుమెడకు కట్టివున్న కాడి పైకి లేచినప్పుడు, ఎద్దు కూడా ఆ కాడితోబాటే పైకి లేచి తద్వారా ఎద్దుమెడకు ఉరి బిగుసుకుపోయి వూపిరాడక అది చనిపోయే పరిస్థితి కూడా ఏర్పడుతుంది.

అయితే బండిలో ఏడ్నర్థం వయసులో నున్న అమ్మ ఆ యెద్దును కూడా తన బిడ్డగా భావించి, బండిని పైకి లేవకుండా యథాస్థితిలో వుంచి, అటు యెద్దును కాపాడి, ఇటు తానూ, తన తల్లీ సురక్షితంగా బయటపడేలా తన మహిమను చూపించి చక్రం అడ్డేసింది.

సరే... తరువాత ఏమయిందో చదవండి.

"ఇదేమీ తెలియని బండివాడు వచ్చి, తను కొన్న పళ్ళను రంగమ్మగారికిచ్చి, బండిని తోలుకుని వెళ్ళి వాళ్ళను స్టేషన్ దగ్గర విడచును. అతను తెచ్చియిచ్చిన పళ్ళలో ఆ పసిపాప (అమ్మ) రెండుపళ్ళు బండివాని చేతిలో పెట్టును. బండివాడు సంతోషంతో అమ్మను ముద్దుపెట్టుకుని వెళ్ళిపోవును.

తరువాత అమ్మ, రంగమ్మగారు స్టేషన్ బ్రిడ్జి ఎక్కి వెడుతుండగా, అంతవరకూ అమ్మ చేతిని పట్టుకున్న రంగమ్మగారు సగం దూరం పోయాక అమ్మ చేతిని వదిలిపెట్టి ముందుకు పోతుంది.

వెనుకనుంచి చిట్టి చిట్టి పాదాలతో బుడిబుడి అడుగులు వేసుకుంటూ వస్తున్న అమ్మ, ఆ బ్రిడ్జి మీదనే ఒక కుంటి అబ్బాయి, గుడ్డి అమ్మాయి, ఇంకొక పాలిచ్చే తల్లీ పిల్ల కూచుని అడుక్కొనుచుండగా, అమ్మ వారిని చూచి జాలిపిడి 'తన చేతిలో డబ్బు వుంటే ఎంతైనా వారికిద్దునే' అని బాధపడి, తన చేతినున్న బంగారు గాజును తీసి ముగ్గురు బిడ్డల ఆ తల్లి (ఆమెకూడా గుడ్డిదే) చేతిలో పెట్టి, తను అక్కడే వుంటే తనవాళ్ళు వచ్చి తనచేతి గాజు కనబడకపోతే, ఆ గుడ్డి ఆమెను కొడతారేమోనని వూహిస్తూ అక్కడనుంచి బయల్దేరి వెడుతూంటే అంతలో తను కనబడకపోయేసరికి కంగారు పడుతూ రంగమ్మగారు ఎదురు వచ్చి అమ్మను ఎత్తుకుని ప్లాట్‌ఫారం మీదకు వెళ్ళిపోతుంది.

పాపం! తన చంకలో బుద్ధిగా ఇమిడిపోయిన తన ముద్దులపట్టి చేసిన ఘనకార్యం ఆమెకేం తెలుసు?

నిడుబ్రోలు స్టేషన్‌లో రైలు దిగాక గాని అమ్మచేతినున్న గాజు పోయిందని, రంగమ్మగారు, స్టేషన్‌కి వారిని తీసుకువెళ్ళేందుకు వచ్చిన ఆమెభర్త (సీతాపతిగారు) గుర్తించలేదు. గుర్తించాక పోనీలే గాజుపోతే పోయింది, పిల్ల బాగుందని వారు సమాధానపడ్డారు. అయితే, అమ్మ ఏమీ మాట్లాడలేదు."

భక్త పాఠకులారా! నిండా రెండేళ్ళు లేని బుడిబుడి అడుగులు వేసే వయసులోనే, రోడ్డు ప్రక్కన అడుక్కునే వాళ్ళను చూచిన మన చిన్నారి చిట్టితల్లి (అమ్మ) బుజ్జి మనసు జాలితో నిండిపోయి, తన చేతినున్న బంగారుగాజును వాళ్ళకు 'గుప్తదానం' చేసిందంటే... అంతకుముందు తాము కొనుక్కుని తెప్పించుకున్న పళ్ళలో రెండుపళ్ళు ఆ తెచ్చిన వానికిచ్చి అతని సేవాఋణాన్ని తీర్చుకున్నదంటే... ఆ వితరణ వెనుకనున్న మాతృహృదయం ఎవరిది?

సాక్షాత్తూ మాతృత్వం మూర్తీభవించిన శ్రీరాజరాజేశ్వరీ దేవిది! మరి రాజరాజేశ్వరిదేవి అంటే... సాక్షాత్తూ మన అమ్మే కదా!

దీనిని బట్టి మనం తెలుసుకోవలసిన ఇంకొక విషయం భగవంతునికి మనం చేసే ఏ చిన్నసేవనూ ఆయన వుంచుకోడు. దానికి రెట్టింపు ప్రతిఫలాన్ని మనకు ముట్టజెప్పి తీరతాడు.

అలాగే మనం ఆయన, లేక ఆమెపట్ల చూపే ఆరాధనా భావం "దేవా!" అని ఆర్తితో పిలిచి, కొలిస్తే చాలు ఆ దేవుడు లేక దేవత మనలను ఎక్కడ వున్నా వెదుక్కుంటూ వచ్చి మరీ తన కరుణామృత ధారలలో తడిపి పునీతులను చేస్తారు.

ఆ మాతృహృదయం అటువంటిది! (లింగబేధం అనేది మానవులకే గాని భగవంతునికి లేదనేది మనం ఇక్కడ గ్రహించాలి.)

అటువంటి మాతృప్రేమనే తన ఏడవ ఏట అమ్మ గుండేలురావు అనే రామభక్తునికి పంచి, ఆయనను తరింపజేసింది– వెనక మన్నవలో కృష్ణభక్తుడైన పున్నయ్యగారికి కృష్ణుని రూపంలో కనిపించి తరింపజేసినట్లు.

గుండేలురావుగారు గుంటూరు నివాసి, చింతపల్లి రామచంద్రరావుగారి అన్నగారు. ఆజన్మ బ్రహ్మచారి. శ్రీరామ భక్తుడు.

ఆయన గుంటూరు బ్రాడీపేటలో మన అమ్మ మేనత్త వెంకట సుబ్బమ్మగారింటి ప్రక్క వాటాలో వున్న అన్న రామచంద్రరావు గారింట్లో వుంటున్నారు. ఆయన గత ఇరవై సంవత్సరాల నుంచీ పక్షవాతంలో బాధపడుతూ మంచంలోనే వున్నారు. ఆతని తమ్మునికి రెండో వివాహం అవటం వలన ఆ కుటుంబంలో ఆయన్ను ఎవరూ సరిగ్గా చూసేవారూ, పట్టించుకునేవారూ లేరు.

అమ్మ మేనత్త వెంకటసుబ్బమ్మగార్కి పురిటిలో సుస్తీగా వుందంటే అమ్మ, మరిడమ్మబామ్మ (అమ్మ తండ్రికి మేనత్త) గారితో కలసి ఆమెను చూసేందుకు వెళ్ళింది.

అయితే అది అమ్మకు ఒక సాకు మాత్రమే. మేనత్త పేరు చెప్పి, ఆమె వెళ్ళింది కేవలం గుండేలురావుగారి కోసమే. ఆయన్ను పునీతుల్ని చేయడం కోసమే!

అయితే, అంతకుముందు గుండేలురావుగార్కి కాని, ఆయన తమ్ముడు రామచంద్రరావుగార్కి కాని అమ్మ ఎవరో తెలియదు. అదీ అసలు సంగతి. కాబట్టి అమ్మ కేవలం గుండేలురావుగారి కోసమే గుంటూరు వెళ్ళిందన్నమాట.

అప్పుడేమయిందో ఇక చదవండి (పే.272– జీవిత మహోదధి)

"అమ్మ, వాకిట్లో బండి దిగి వెళ్ళటమే సరాసరి గుండేలురావుగారి మంచం వద్దకు వెడుతుంది. అమ్మ, తాతమ్మ ఆ యింటికి పోతూ బజార్లో నారింజ పళ్ళు కొనుక్కుని వెడతారు. అమ్మ అందులో ఒక పండు తీసుకుని వెళ్ళి గుండేలురావుకు మాత్రం ఇస్తుంది.

చేతికి యిస్తే వలుచుకో లేనంటాడు ఆయన. అప్పుడు అమ్మ పండు వలిచి ఆయన నోట్లో తొనలు పెడుతుంది.

అంతేకాదు, అన్నీ మంచంలోనే గడుపుతున్న ఆయన మంచంలో ఒంటేలుకు పోసిన గుడ్డలూ అవీ తీసి, మంచిగుడ్డలు వేసి ఆయన్ను పడుకోబెడుతుంది.

గుండేలురావుగారు మానసికంగా భక్తతుకారాం లాంటివారు.

ఆయన (గుండేలురావు) 'తన భక్తి ఫలించింది రాముడు ఈ రూపంగా వచ్చి తనను రక్షిస్తున్నా'డనుకుంటాడు.

బహుశా తన వ్యాధిని కూడా తగ్గించవచ్చుననుకొని పైకి మాత్రం "నా బాధను నివారణ చేయడానికి వచ్చావా? నాయనా! రామచంద్రా!" అని నంగిమాటలతో అంటాడు.

అమ్మ ఆయనకు కావలసినవన్నీ చేసి, బయటకు వచ్చి మేనత్తగారింట్లోకి (వాటాలోకి) వెడితే మేనత్త, అమ్మ వయసు వారే అయిన ఆమె పిల్లలు సుందరి, ఆదిలక్ష్మి వచ్చి "నువ్వు వచ్చి ఇంతసేపయినా ఇంట్లోకి రాలేదేం?" అని అడుగుతారు.

దానికి అమ్మ "గుండేలురావుగారి దగ్గర కూచున్నా" అంటుంది.

అది విన్నవారు వెంటనే "ఎబ్బే... ఆయన దగ్గర వాసన. అన్నీ మంచంలోనే. ఆయన దగ్గర కెందుకెళ్ళావు?" అంటారు.

దానికి అమ్మ "నాకు ఆయన దగ్గరనే కూచోవాలనిపిస్తోంది" అంది.

అంతేకాదు. ఇంట్లో మేనత్త వాళ్ళందరికీ చెప్పేసింది. "నాకు ఆకలిగా లేదు. నన్ను వెతకవద్దు. నేను గుండేలురావుగారి దగ్గరే వుంటా. నాకు ఎప్పుడు ఆకలి అయితే అప్పుడు వస్తాను" అని చెప్పి మళ్ళీ గుండేలురావుగారి దగ్గరకే వెళ్ళిపోతుంది.

అలా వెళ్ళిన అమ్మ పదిహేను రోజులపాటు ఎక్కువ కాలం గుండేలురావుగారి దగ్గరే గడుపుతుంది. మధ్య మధ్యలో ఆకలి వేసినపుడు, స్నాన పానాదులకు మాత్రమే ఇంట్లోకి వచ్చేది.

పదిహేడవ రోజున ఆయన అమ్మ సన్నిధిలోనే చచ్చిపోతారు.

ఈ పదిహేను రోజులు ఆయన చాలా హాయిగా ఆనందంగా కాలం గడుపుతారు. పోయే సమయందాకా యే ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా గడుపుతారు.

అమ్మ కనబడిన నాటినుంచీ గుండేలురావుగారు తనలోనుంచి అమ్మలోకి యేదో చేరుతున్నట్టు, అమ్మలోనుంచి దివ్యశక్తి తనలోకి వస్తున్నట్టు భావిస్తారు. పోయే సమయంలో అన్నను పిలిచి, అమ్మను, అన్నను దగ్గరకు రమ్మని అమ్మ రెండు చేతులు తన ముఖముమీద పెట్టుకుని అన్నగారి చెయ్యి చేతిలో పెట్టుకుని,

"నేను యీ అమ్మలో కలిసిపోతున్నా. వచ్చినప్పటి నుంచీ క్రమేపీ కలుపుకొంటున్నది. నేనేదో అంటున్నాననుకోవద్దు సత్యం. అమ్మ సామాన్యురాలు కాదు. అసాధారణం సాధారణమైన తత్వంగా వచ్చింది. బంధువులెవరూ అర్థం చేసుకోలేదనుకుంటాను. అర్థం చేసుకోకపోతే మాన్లె. వ్యర్థురాలిగా కూడా చూడొచ్చు. ఇటువంటి వాళ్ళ స్థితి యిట్లాగే వుంటుంది. నీవు యీ అమ్మను నమ్ముకో... వాళ్ళు అంతా నమ్మినా నమ్మకపోయినా నేను యిన్నేళ్ళ నుంచి రామచంద్రమూర్తిని నమ్ముకున్నందుకు యీ రూపంగా వచ్చాడు. అమ్మ యింకా నన్ను కొంతకాలం వుంచదల్చుకుంటే అమ్మను అందరకూ అర్థమయేటట్లు చెప్పిపోతాను. ఈ పదిహేను రోజులనుంచి అన్నానికి వేళకు పోకపోతే పిల్చినవాళ్ళు కూడా లేరు. తింటున్నట్టు కూడా లేదు. అక్కడ యెవరున్నారు? ముసలమ్మగారు బంధువుల యిళ్ళకు తిరుగుతున్నది. సుబ్బమ్మగారు సుస్తీగా వుంది. ఇక వున్నది వంటమనిషేగా" అంటారు.

ఇంతలో గుండేలురావుగార్కి ఇంట్లోంచి తినేందుకు అన్నం వస్తుంది. ఆ వచ్చిన అన్నాన్ని గుండేలు రావుగార్కి అమ్మ తినిపిస్తానంటుంది. అయితే, రామచంద్రరావుగారు "చిన్నపిల్లవు నీకెందుకులేమ్మా! వద్దు" అని అంటారు.

దానికి గుండేలురావుగారు "అట్లా అనవద్దు. ఒక్క మెతుకుపెట్టనియ్యి. నీవు మాత్రం యెవరు నమ్మినా నమ్మకపోయినా నీ జీవితమున్నంతవరకూ అమ్మ పాదాలను నమ్ముకో. నేను ఏదో అన్నాననుకోవద్దు. అనుభవంతో చెబుతున్నా. చిన్నపిల్ల. యేదో పిచ్చివాడు చెబుతున్నాడులే అనుకోవద్దు. బ్రతికివుంటే కొంతకాలానికి నీవే వింటావు. అటువంటి అనుభవాన్ని అనుభవించాను. బహుశా నాకు కాలంకూడా తీరిపోయిందనుకుంటా. అందుకే అమ్మ వచ్చింది."

అంటూ ఇంకా ఆయన ఏదో చెప్పబోతూ వుంటే అమ్మ కొంచెం అన్నం కలిపి నోట్లో వేస్తుంది. అది తినలేక మింగుతాడు. "మంచి తరుణం వచ్చినవారు నమ్ముతారు" అంటూ కన్నుమూసి అమ్మలో కలిసిపోతాడు.

అది చూచి రామచంద్రరావుగారు ఘొల్లుమంటాడు. అందరూ ఇరుగూ, పొరుగూ పరుగెత్తుకువచ్చి "ఏం? ఎక్కువైందా?" అని అడిగుతారు.

దానికి అమ్మ "ఏమీలేదు. సమయమొచ్చింది" అంటుంది నెమ్మదిగా.

భక్త పాఠకులారా! ఇదీ గుండేలురావుగారి విషాదాంత నాటకం? కాదు, కాదు ఆ నాటకం సుఖాంతమే.

లేకుంటే- ఎవరూ చూచేవారు, చేసేవారు లేక మలమూత్రాదుల మధ్య, ముసిరే ఈగలు, దోమలతో నరకయాతన అనుభవిస్తూ ఏ అర్ధరాత్రి వేళనో ఎవరికీ ఏమీ చెప్పుకోలేని దుర్భరస్థితిలో కన్నుమూసేకన్నా...

చివరిరోజులలో అమ్మ శుశ్రూషలో సుచిమంతుడై, ఆమెలోని దివ్యశక్తిని పొంది, చివరి క్షణంలో ఆమెచేతి ముద్దను తిని హాయిగా ఆమె సమక్షంలో కన్నుమూసాడు ఆ రామభక్తుడు! ఆ రాముడే అమ్మ!

అటువంటి మహాప్రస్థానం, సుఖాంత జీవితం ఎవరో అదృష్టవంతులకు గాని దక్కదు మరి.

సరిగ్గా అటువంటి సంఘటనయే అమ్మకు వివాహమయిన తరువాత ఆమె పదిహేనవ ఏట బాపట్లలో జరిగింది. లేదు... అమ్మే జరిపించింది.

అయితే ఈసారి నాటకం విషాదం నుంచి సుఖాంతం కాదు. విషాదానికి అంతమై, సుఖానికి ప్రారంభమయింది.

అదేమిటో తెలుసుకుందాం.

❀ ❀ ❀




తెల్లని పెద్ద ఆలయం అమ్మ గర్భాలయం
పక్కన చిన్న రంగుల ఆలయం హైమ గర్భాలయం
ప్రవేశంలో అమ్మ ఒకప్పుడు నివసించిన పూరిల్లు. ప్రస్తుతం సిమెంట్‌తో స్లాబ్ చేయబడింది.
చివరిగా కుడి పక్కన వున్న గోపురం అమ్మ పాదుకాలయం

# "రహి"కి ప్రసాదించిన పునర్జీవితం

బాపట్ల రైల్వేస్టేషన్ దగ్గర వున్న ప్రభుత్వాస్పత్రి గోడప్రక్కన రోడ్డుపై చావుబ్రతుకుల్లో పడివున్న ఒక అనాధను అమ్మ ఏ విధంగా కాపాడి అతనికి పునర్జీవితాన్నిచ్చిందో ఈ క్రింది సంఘటన చెబుతోంది. చదవండి.

(పే.48- మాతృశ్రీ తత్త్వసౌరభం- రచయిత్రి, డా॥బి.యల్.సుగుణ. ప్రిన్సిపాల్- ఓరియంటల్ కాలేజి- జిల్లెళ్ళమూడి.)

"అమ్మకు పదిహేనేళ్ళ వయసులో క్రొత్తగా కాపురానికి వచ్చిన రోజుల్లో మంచినీళ్ళకోసం బిందె తీసుకుని బాపట్ల రైల్వేస్టేషన్ దగ్గర ఆస్పత్రి సమీపంలో వున్న కుళాయి దగ్గరకు అమ్మ రోజూ వస్తూ వుండేది.

ఆస్పత్రి గోడ ప్రక్కన మూడురోజులుగా ముసుగు కప్పుకొని ఒక మనిషి పడుకుని వుంటాడు. ఎవరూ ఆ సంగతి పట్టించుకోరు. కాని, అతని దగ్గరకు వెళ్ళి ఏమైనా కదలిక వస్తుందేమోనని అమ్మ చూస్తుండగా, ఆ దారిన ఎవరో ఒక మనిషి పోతూ "నీకెందుకు? చిన్నపిల్లవు. ఆ అబ్బాయి నాలుగు రోజులనుండీ వున్నాడు. చచ్చిపోయినట్లున్నాడు. పెద్ద పెద్దవాళ్ళంతా వూరుకుంటే నీకెందుకూ?" అని మందలించి వెడతాడు.

కాని, అమ్మ ఆ మాటలేమీ పట్టించుకోక మెల్లగా అతని ముసుగు తీస్తుంది. జ్వరం మండిపోతూ వుంటుంది. అతనికి కళ్ళు అంటుకుపోయి, పుసులు గట్టి నీళ్ళు కారుతూ వుంటాయి. ఆ స్థితి చూచి, అమ్మ తానే డాక్టరుని పిలుచుకువచ్చి, అతనిని హాస్పిటల్‌లో చేర్పించి తన చీర పమిట చెంగు చించి, దుర్వాసనతో నున్న అతని శరీరాన్ని తడిగుడ్డతో తుడిచి, లేవదీసి కూచోబెడుతుంది. తను ఆసరాగా నిలబడి, తన వేళ్ళతో అతని పళ్ళు తోమి ముఖం కడుగుతుంది.

అది చూచి డాక్టరుగారు "అబ్బా! చేతిలో పట్టుకోకమ్మా! మన నోట్లో నీళ్ళే మన చేతిలో పోసుకోకూడదు" అని ఎంతగా వద్దని వారిస్తున్నా, అమ్మ ఏ మాత్రం అరమరికలు లేని ఆదరణతో దుర్వాసన కలిగివున్న అతనికి అన్ని సపర్యలను చేస్తుంది. సమాజపరంగా కానీ, కుటుంబపరంగా కానీ ఎన్నో ఆంక్షలు వున్న ఆ రోజుల్లోనే కులమతాలు పాటించకపోయినా, వయోబేధం, లింగబేధం లేకుండా సపర్యలన్నీ చేసింది. అతని మీద మమకారం చంపుకోలేక, మంచినీళ్ళకు వచ్చే వ్యాజంతో ఇంట్లో వాళ్ళకి తెలియకుండా పత్యం తెచ్చి, ఆ అన్నం కలిపి నోట్లో పెట్టేది.

అతని కంటివెంట అప్రయత్నంగా నీరు కారటం చూసి అమ్మ ఎడంచేత్తో అతని తల తన భుజంమీద ఆనించుకుని "ఎందుకు నాన్నా! గొంతు నొప్పిగా వుందా?" అంటుంది. ఇంకా పెద్దగా ఏడుస్తాడతడు అది విని.

అది చూసి డాక్టరుగారు "మీ తల్లీకొడుకులను చూస్తుంటే నాకు వస్తున్నాయి కన్నీళ్ళు" అని కళ్ళు తుడుచుకుంటాడు.

ఆ తరువాత అతని వివరాలు అడిగితే, తెలుగు రాదేమో హిందీలో "మేరా నామ్ రహి" అంటాడు. అతడు ముస్లిం. ఇంగ్లీషు ఏమైనా వచ్చేమోనని డాక్టరుగారు "మీ ఊరు ఏది?" అని ఇంగ్లీషులో అడుగుతారు. "మెదక్ జిల్లా" అంటాడు అతను.

అమ్మను చూపి "ఈమె ఎవరు?" అంటారు డాక్టరు.

"మా అమ్మ" అంటాడు రహి.

"ఈ అబ్బాయితో పూర్వ పరిచయం వుందా అమ్మా?" అని అమ్మను అడుగుతారు డాక్టరుగారు.

"ముసుగు కప్పుకున్న అతని రూపాన్ని మీకంటే మూడురోజులు ముందునుంచీ చూస్తున్నాను. మీకంటే ఒక అరగంట ముందు ఆ ముసుగు తీసి చూశాను" అని చెప్పింది అమ్మ.

"నాకు నమ్మకం లేదు బ్రతుకుతాడని. రాత్రి ఒంటిగంట, రెండు ఆ ప్రాంతంలో బహుశా పోవచ్చు. నేను వెంటనే చెట్టుక్రింద పడవేస్తాను. దగ్గరకు పోవడానిక్కూడా వీలులేకుండా వాసన వేస్తున్నాడు" అన్నాడు డాక్టరుగారు.

అయితే, డాక్టర్‌కే బ్రతుకుతాడని నమ్మకంలేని వ్యక్తి, అమ్మ ఆదరణతో కోలుకోవడం అందరినీ ఆశ్చర్యపరిచింది. డాక్టర్‌గారు అమ్మతో "ఒక అనాధకు, దిక్కులేని వాడికి, దిక్కు నీవై తల్లికంటే ఎక్కువగా సేవ చేశావు. ఇదంతా నాకు పాఠంగా వున్నదమ్మా!" అన్నారు.

ఆ తరువాత 'రహి' జీవితం అమ్మసేవకే అంకితం అయింది. ఎంతగా అంటే, ఏది అవసరమైతే అది నేర్చుకుని, అన్నీ తానే అయి అమ్మసేవలోనే ధన్యజీవి అయాడు."

భక్త పాఠకులారా! చూచారుగా... అమ్మ రూపంలో సాక్షాత్తూ దివినుండి భువికి దిగివచ్చిన మాతృస్వరూపిణి రాజరాజేశ్వరియే తనబిడ్డ 'రహి' దిక్కులేక, చావు బ్రతుకుల్లో రోడ్డుప్రక్కన పడివుంటే లేవదీసి, సేదదీర్చి ఎలా ఆదుకున్నదో.

అందుకనే... అమ్మ భక్తకోటిలో ఒకరైన శ్రీ శంకర శ్రీ రామారావు అనే ఆయన ఆమెను–

"జిల్లెళ్ళమూడిలో స్త్రీరూపధారిణియై, దిగివచ్చి నిలిచినది దివ్యమాతృప్రేమ" అని ఆమె మాతృత్వాన్ని వర్ణించి పాట రాశారు.

అంటే, నిరాకారమైన మాతృప్రేమ సాకారమై అమ్మరూపంలో వచ్చి మనముందు నిలిచిందన్నమాట!

# వసుధైక కుటుంబం

భక్త పాఠకులారా! ఆ విధంగా అమ్మ పుట్టినప్పటినుంచే గాక, యుక్తవయస్కురాలై, వివాహమయిన తరువాత కూడా తన మహిమాన్వితంతో బాటు మాతృత్వాన్ని కూడా, మానవాళితోబాటు సకల చరాచర జీవరాశికి పంచి, పెంచి పోషించింది.

అయితే వివాహమైన తరువాత ఆమె మాతృతత్త్వం క్రొత్తపుంతను త్రొక్కింది. ఆ పుంతలోనించే "గుప్పెడు బియ్యం' పథకంతోబాటు అన్నపూర్ణాలయం అవతరించింది.

తన ముప్పై ఐదవ సంవత్సరాన అమ్మ తన అవతారప్రకటన చేసిన తరువాత, అంతకుముందు కంటే తనను చూడవచ్చే భక్తుల సంఖ్య ఎక్కువ కావటం, దానితో వచ్చిన వారందరికీ వండిపెట్టడం ఇటు అమ్మకు శ్రమభారం, అటు నాన్నగారికి ఆర్థిక భారం అధికం కావటం వలన, తన వద్ద వుండే భక్తుల ప్రోద్భలంతో, 15-8-1958వ సంవత్సరములో, కొంత తమ స్వంతసొమ్ము మరికొంత భక్తుల విరాళములతో అన్నపూర్ణాలయం ఆవిర్భవించి, భక్తుల సేవా కార్యక్రమంతో నిరతాన్నదానం మరింత విస్తృత పరిధిలో కొనసాగింది.

అసలు అమ్మలో అన్నపూర్ణాలయ ఆవిర్భావ బీజం ఎప్పుడు పడిందో తెలుసా?

అమ్మకు ఆరు సంవత్సరాల వయసులో, ఆమె బాపట్లలో చిదంబరరావు తాతగారింట్లో వుండగా, అందరికోసం ఒక భోజనశాల, గుడిలేని వూళ్ళో ఒక దేవాలయం కట్టించాలనే ఆలోచన ఆమెలో ఆమె బజారున నడిచి వెడుతుండగా దారిలో కనబడిన ఒక దృశ్యాన్ని చూచిన తరువాత మొలకెత్తింది.

అదేమిటో ఈ క్రింది ఉదంతాన్ని చదివి తెలుసుకోండి. (పే. 242- జీవిత మహోదధి).

"ఒకరోజు చిదంబరరావుగారి కుమార్తె భారతి అమ్మను బజారుకు వెళ్ళి దారపు వుండలు, సూది తీసుకురమ్మని ఆమె చేతిలో నాలుగు అణాలు పెట్టి పంపిస్తుంది.

అమ్మ సరేనని, ఆ డబ్బులు తీసుకుని బాపట్లలో ఇన్‌కంటాక్స్ ఆఫీస్ మీదుగా వెడుతూ వుండగా డబ్బాలు మ్రోగించుకుంటూ "కుంటివాళ్ళం, గుడ్డివాళ్ళం అమ్మా!"అని కొందరు బిచ్చగాళ్ళు ఎదురొస్తారు. అమ్మ తన చేతిలో వున్న కాస్త డబ్బు వాళ్ళకు యిచ్చి, మరికొంత దూరం వెడుతుండగా దోవలో బ్రహ్మాండం వారి సత్రము కనబడుతుంది.

ఆ సత్రములో కొందరు బిచ్చగాళ్ళు అన్నాలు తింటూ వుంటారు. అది చూచిన అమ్మ–

"స్వతంత్రంగా మన యింట్లో మనమున్నట్లుగా మీరు ఇక్కడ వున్నారే. ఇది మీ యిల్లా?" అని వారిని అడుగుతుంది.

దానికి ముష్టివాళ్ళు "మా యిల్లు కాదమ్మా! ఇది సత్రం" అని అంటారు.

"సత్రం అంటే స్వతంత్రమా?" అని మళ్ళా అడుగుతుంది అమ్మ.

ప్రక్కన ఎవరో కుర్రాడుపోతూ "చక్కని నిర్వచనం. అంతేకాని అమ్మా! కొన్నింటికి అధికార్లు వుంటారు. మొదట్లోనే వాటికి ఏర్పాట్లు వుంటాయి. వాటిలో కొన్ని బీదలకని, కొన్ని భాగ్యవంతులకని వుంటాయి. ఇంతకూ నువ్వు ఎవరి అమ్మాయివి?" అని అడుగుతాడు.

దానికి అమ్మ "ఎవరు దగ్గరకు తీస్తే వారి అమ్మాయిని" అని చెప్పి "ఈ ఎదురుగా వున్నదేమిటి?" అని ఒక గుడిని చూపిస్తూ అడుగుతుంది.

"అది ఆంజనేయస్వామి దేవాలయం. దత్త మఠం. అవికూడా బ్రహ్మాండం వారివే" అని చెబుతాడు ఆ అబ్బాయి.

అప్పుడనుకుంటుంది అమ్మ...

"ఎక్కడా దేవస్థానం లేని వూళ్ళో దేవస్థానం, సత్రం లేని వూళ్ళో సత్రం కట్టిస్తే ఎంత బాగుంటుందో. వాళ్ళంతా అడుక్కొచ్చుకున్నా, అందరూ కలిసి తింటూంటే చూడు ఎంత బాగుందో! ఈ వూళ్ళో అందరూ కలిసి, అందరి ఆస్తీ కలుపుకొని యెవరు చేసే వృత్తి వాళ్ళు చేస్తూ, ఒకే యింట్లో వుంటే ఎంత బాగుంటుందో? అయినా ఒకే యింట్లో వుంటే చోటు చాలదుగా. అందుకే తల్లి ఒకటయి, జాగాలుగా ఇచ్చి పంపిస్తుంది. ప్రపంచానికంతటికీ ఒకటే తల్లి అయి, తలా ఒక వృత్తి చూపించి యిచ్చివేసింది తలా ఒక చోటుని."

భక్త పాఠకులారా! తెలిసిందిగా. ఆనాడు బాపట్లలో బ్రహ్మాండం వారి సత్రమును, అందులో కూచుని సామూహికంగా అడుక్కుని తెచ్చుకున్న భిక్షాన్నమును పంచుకుని తింటున్న ఆ బిచ్చగాళ్ళను, ఆ బ్రహ్మాండం వారి గుడులను చూచిన, ఆరేడు సంవత్సరాల వయసుగల ఆ మన్నవ వారింటి చిట్టితల్లి, బాపట్లయే ఒక వసుధైక కుటుంబంగా మారితే ఎంత బాగుంటుందో అని ఆశపడింది.

అలా ఆశపడిన ఆ చిట్టితల్లే తన దైవిక సంకల్పంతో (మరి, సంకల్పమే దైవం అంది కదా) ఆ తరువాతి కాలంలో ఆ బ్రహ్మాండం వారింటికే కోడలయి, జిల్లెళ్ళమూడిలో బ్రహ్మాండమైన అన్నపూర్ణాలయాన్ని, దానిచుట్టూ అందరింటి పేరుతో తను ఊహించిన ఒక చిన్న వసుధైక కుటుంబాన్నీ, ఆలయ సముదాయాన్నీ ఏర్పరచి, దాని ఎల్లలను ప్రపంచమంతటా విస్తరింపజేసిందంటే... చిన్ననాట ఆమెలో మొలకెత్తిన ఆ సామ్యవాద బీజము సామాన్యమైనది కాదు. ప్రపంచ సామ్యవాదులనే అబ్బురపరచే అసామాన్యమైన, మానవరూపు దాల్చి మనముందు నిలచిన కల్పతరుబీజమది!

ఆ కల్పతరువే, తదనంతర కాలంలో తన చిటికెన వ్రేలిమొనతో గోవర్ధన గిరినెత్తి, అటు గోవులనే కాక ఇటు తన ఆశ్రితులైన గోపాలురను కూడా కాపాడిన చిన్ని కృష్ణునిగా మారి, అద్భుతాలను సృష్టించింది... మరి!

❀ ❀ ❀



# ఆదర్శ గృహిణి అమ్మ

అమ్మ పుట్టినప్పటినుంచి ఇంతవరకూ మనం అమ్మలోని మాతృమూర్తిని, ఆమె అవతార మహిమాన్వితాన్ని గురించి మాత్రమే తెలుసుకున్నాం.

అది అమ్మ జీవననాణేనికి ఒకవైపున వున్న బొమ్మ! కాని, ఆమె వివాహమైన తరువాత ఆ నాణేనికి వెనుకవైపు ఒక బొరుసు ఏర్పడింది. అదే నాన్నగారు. ఒక వ్యక్తి స్త్రీ గాని, పురుషుడు గాని వివాహమైన తరువాత ఆమె లేక అతని సంపూర్ణ గార్హస్థ్య జీవితానికి బొమ్మ ఎంత ముఖ్యమో బొరుసుకూడా అంతే ముఖ్యం.

ఇది ఈ సృష్టిలో ఒక్క మానవజీవితానికి మాత్రమే వర్తించే నగ్నసత్యం!

నిజానికి అమ్మ దేవత అయినా, మానవదేహధారణ చేసినందుకు ఆమెకూ ఇది వర్తిస్తుంది. వర్తించింది.

అందుకే అమ్మ ఒక సామాన్యస్త్రీగా, ఒక సాధారణ గృహిణిగా తన బిడ్డలతో బాటు ఈ లోకమందలి సకల మానవాళిపై, ఈ సకల చరాచర జగత్తులో గల జీవరాశిపై తన మాతృత్వ నిర్వహణను కొనసాగించింది. అయితే దాని మధురిమను అందరికీ, అన్నిటికీ పంచాలంటే తన జీవిత భాగస్వామి అయిన భర్త (నాన్నగారి) సహకారంకూడా ఎంతో అవసరం.

పోతే, ఒక సామాన్య గృహస్థు, గ్రామ కరణంగారైన శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావుగారు (నాన్నగారు) అమ్మ వద్దకు వచ్చే భక్తులకు చేసే అన్న వితరణను, అలాగే అమ్మ తన భక్తులను చిన్నా, పెద్దా తేడా లేకుండా తన ఒడిలోకి తీసుకుని లాలించే పద్ధతిని 'అమ్మతనంగా' భావించి, విశాల హృదయంతో ఆయన అమ్మకు అందించిన సహకారం చాలా గొప్పది.

మొదట్లో ఒక సామాన్య గృహస్థుగా ఆయన దానిని స్వాగతించలేకపోయినా క్రమేపీ అమ్మ అంటే ఏమిటో, ఆవిడ ఎవరో తెలిసిన తరువాత అమ్మకు ఆయన



ఆది దంపతులు అమ్మ, నాన్నగారు

అందించిన సహకారం అంతా ఇంతా కాదు. తన కరణీకం వల్ల వచ్చే స్వల్ప ఆదాయంతోనే ఆయన అమ్మ చేసే అన్నవితరణకు, ఇతర కార్యక్రమాలకు ఎంతగానో తోడ్పడేవారు. అందుకే ఆయన్ను అందరూ 'నాన్నగారు' అని సంబోధించేవారు.

అమ్మకూడా నాన్నగారి అడుగుజాడలలో నడుస్తూ, అహర్నిశలూ ఆయనను కనిపెట్టుకుని వుండి, సేవలు చేసేది.

ఈ అందరింటిలో అందరికీ అమ్మ దేవత అయితే అమ్మకు నాన్నగారు దేవుడు!

అందుకే ఉదయం లేవగానే అమ్మ తన మంగళసూత్రాలను కళ్ళకద్దుకుని, వాటిని శుభ్రజలంతో అభిషేకించి ఆ అభిషేకజలాన్ని కూడా కళ్ళకద్దుకుని, దానిని తీర్థంలా స్వీకరించేది.

తర్వాత ఆయన వెనుకనే వుండి, ఆయనకు పరిచర్యలు చేసి, కచేరీకి పంపిన పిమ్మటనే తన పనిలో నిమగ్నమయేది.

రోజంతా అమ్మ తన పనులతో, తన దర్శనార్థం వచ్చే భక్తులతో, వారు చేసే పూజలతో హడావిడిగా వుంటే నాన్నగారు తన కచేరీ వ్యవహారాలతో బిజీగా వుండేవారు.

పగలల్లా తనను చూడవచ్చే భక్తులతో పూజలూ, అర్చనాదికాలూ చేయించుకుని రాత్రి అందరూ అన్నాలు తిని నిద్రించిన తరువాత, అమ్మ నాన్నగారి దగ్గరకు వెళ్ళి ఆయన కాళ్ళు పిసికి నిద్రపుచ్చేది.

పగటిపూట చుట్టూ ఎంతమంది భక్తులు కొలువుదీరి కోలాహలంగా వున్నా, బయట నాన్నగారి అడుగుల చప్పుడు వినబడితేచాలు ఆ కొలువు నిశ్శబ్దమైపోయేది. నాన్నగారు గదిలోకి రాగానే అమ్మ చప్పున లేచి నుంచుని వారికి ఆహ్వానం పలికి వారికి కావలసినవి చూసేది.

భక్తులు తనకొరకు ఏది తెచ్చినా "ముందు నాన్నగారికి ఇచ్చిరా" అనేదట.

నాన్నగారు కూడా అమ్మపట్ల అంతే అనురాగంతో, అక్కరతో వుండేవారు. తరువాత రోజులలో ఒక్కోసారి మిగతా అందరి భక్తుల వలెనే ఆయన కూడా అమ్మను 'అమ్మా' అని సంబోధించేవారట.

అందుకే ఒక సందర్భంలో అమ్మ...

"ఒక స్త్రీ పతివ్రతగా పరాకాష్ఠకు చేరవలెనంటే తన భర్తచేత కూడా 'అమ్మా!' అని పిలిపించుకోవాలి" అని అన్నది.

నాన్నగారు ప్రతిరోజూ బైటకు వెళ్ళేటప్పుడు అమ్మచేత బొట్టు పెట్టించుకుని వెళ్ళేవారు.

అంతేకాదు. ఆయన పనిమీద గ్రామంతరం వెడితే అమ్మ సూక్ష్మరూపంలో ఆయన వెంటే వుండి ఆయనను అతి జాగరూకతతో నడిపించేది. ఆయన బయటి వూరిలో ఏవైనా తన ఆఫీసు కాగితాలను మరచిపోతే "అదుగో మీ ఆఫీసు కాగితాలను మర్చిపోయారు. వాటిని తీసుకోండి" అనే అమ్మ మాటలు ఆయన చెవులబడేవి. అప్పుడాయన జాగ్రత్తపడేవారు.

చివరకు ఆయన పరమపదించినపుడు అమ్మ కొన్ని గంటలపాటు ఆయన భౌతికదేహం ప్రక్కన, ఆయన గుండెలపై చేయివేసి పడుకుని ఆయనకు దైవత్వాన్ని ప్రసాదించి, అనసూయేశ్వరాలయంలో ఆయన దేహాన్ని సమాధి చేయించింది.

ఈ సంఘటన- రమణమహర్షి తన తల్లి మరణించినపుడు ఆమె దేహం ప్రక్కన కూచుని, ఆమె తలపైనా, గుండెలపైనా చేతులు వేసి, కొన్ని గంటలపాటు తపస్సు చేసి తల్లికి దైవత్వాన్ని ప్రసాదించి, ఆమెను రమణాశ్రమంలోని 'మాతృభూతేశ్వరాలయం"లో సమాధి చేయించిన వైనాన్ని గుర్తుకు తెస్తుంది కదూ!

నాన్నగారు సమాధి చెందిన కొద్దికాలానికే అమ్మకూడా 12.6.1985న తన దేహాన్ని విడచి ఆయన ప్రక్కనే ఆలయప్రవేశం చేసింది.

ఇప్పటికీ జిల్లెళ్ళమూడిలోని అనసూయేశ్వరాలయంలో అమ్మ, నాన్నగార్ల అంతరాలయం ముందు ప్రతిరోజూ ఇద్దరికీ ఉదయంపూట ఏకాదశ రుద్రాభిషేకం, ఉత్సవ సమయంలో విశేష పూజలు జరుగుతూ వుంటాయి.

❀ ❀ ❀



అనసూయేశ్వరాలయంలో మూల విరాట్ అమ్మ అనసూయాదేవి.
(క్రిందనున్న అమ్మ, నాన్నగార్ల లోహ విగ్రహాల క్రింద వారి సమాధులున్నవి)

# హైమవతీదేవికి దైవత్వ సిద్ధి

జిల్లెళ్ళమూడి "అందరింటి'కి అనసూయాదేవి 'అమ్మ' అయితే, ఆమె కుమార్తె హైమవతీదేవి ఆ 'అందరింటికి' అక్క!

పుట్టుకతోనే పూవు పరిమళించినట్లు, హైమ పుట్టుకతోనే తల్లిలోని మార్దవాన్ని, మమతానురాగాలను, మృదుమధుర స్వభావాన్ని పుణికిపుచ్చుకుంది. అంతేకాదు, అందరి ఆడపిల్లలవలె కాక అసామాన్యమైన పద్ధతిలో పెరిగిందామె.

చిన్ననాటినుంచే తల్లివలె సహనాన్ని, ఓర్పునీ ప్రదర్శిస్తూ, తనకన్నా చిన్నవాళ్ళయినా పెద్దవారైనా "ఏం బాబూ! ఏం నాయనా!" అని సంబోధిస్తూ వారి కష్టాలకు చలించిపోయి వారిని తగు విధంగా ఓదార్చుతూ, వారికి స్వాంతన చేకూర్చేది. ఆమె పలకరింపుతోనే ఆ బాధితులు సగం బాధను మర్చిపోయేవారు.

కేవలం మనుషుల బాధలకే కాదు, నోరులేని మూగజీవాల బాధలకు కూడా విపరీతంగా చలించిపోయేది హైమ!

అమ్మ దివినుండి భువికేతెంచిన దేవత అయితే, హైమ భువిపైనే దేవతారూపం దాల్చి నిలిచింది.

అయితే పుట్టుకతోనే ప్రతీ వ్యక్తిలోనూ దైవీసంపత్తి వికసించదు. ఒకదేవత కడుపున పుట్టిన వారికే ఆ లక్షణాలు వస్తాయి.

ఇదంతా చూస్తుంటే, అమ్మ తన నిరంతర విశ్వ పరిపాలనలో తనకు చేదోడు వాదోడుగా వుండేందుకే హైమ అనబడే ఈ సురపారిజాతాన్ని సురలోకం నుండి ఏరికోరి తెచ్చి తన కడుపున వికసింపచేసుకున్నదా అనిపిస్తుంది.



అమ్మ వలన దైవత్వం పొందిన హైమ!

ఇదే భావాన్ని జిల్లెళ్ళమూడిలో అమ్మ భక్తురాలైన ఇందిర అనబడే క్రీ.శే.ఇందిరాప్రియదర్శిని (ఈమె క్రీ.శ.2012 సెప్టెంబర్ నెలలో పిన్నవయసులోనే అమ్మయందు

ఐక్యమయింది.) తన మరణానికి ముందు హైమను "అందరింటి' అక్కగా అభివర్ణిస్తూ వ్రాసిన ఈ క్రింది గేయాన్ని "విశ్వజనని" పత్రిక ద్వారా, ఆమె అక్క కుమారి విశాల మనకందించింది. చదవండి.

## అందరింటి అక్క

1. అందరింటి అక్కనూ, అమ్మకన్న హైమనూ
కనులు తెరచి చూడగా మనసు పులకరించదా!
తనువు పరవశించదా! "అందరింటి"

2. చిలకల పలుకుల్లో కోయిల పాటల్లో
పూసిన పూలల్లో తెలిమంచు చినుకుల్లో "అందరింటి"

3. సాగే మబ్బుల్లో వీచేగాలుల్లో
పాపల నవ్వుల్లో ఇంద్రధనసు రంగుల్లో "అందరింటి"

4. అమ్మలోని హైమా! అమ్మలాంటి హైమా!
అమ్మకోరి తెచ్చుకున్న సుర పారిజాతమా! "అందరింటి"

5. వ్యధాభరిత హృదయులను చేరదీయు హైమా!
సేదదీర్చి శాంతినిచ్చి వరములిచ్చు హైమా! "అందరింటి"

6. పాలవంటి మనసున్నా పాలరాతి శిల్పమా!
కోరి కొలుచుకున్న వారి కొంగు బంగారమా! "అందరింటి"

భక్త పాఠకులారా! పైన చూడండి. హైమ పలుకులు చిలకపలుకులట. ఆమె పాటలు వసంత కోయిల గొంతులో వినిపిస్తాయట. ఆమె దరహాసం, పూసిన పూలవంటిదే కాదు, తెలిమంచు చినుకు వంటిదట. అమ్మలోంచి వచ్చిన హైమ, అమ్మ కోరి సురలోకం నుండి తెచ్చుకున్న కుసుమ సుమ పారిజాతమట!

పాలవంటి మనసుగల ఈ హైమవతీదేవి అమ్మవలన దైవత్వం పొంది, తన సమాధిపైన నిలువెత్తు పాలరాతి శిల్పంగా మారకముందు ఎందరో అశాంత, వ్యధాభరిత హృదయులను చేరదీసి వారిని తన వాత్సల్యంతో ఓలలాడించింది. వారికి సేదదీర్చి శాంతినిచ్చింది.

అటువంటి అశాంతభరిత హృదయులలో కీ.శే.ఎక్కిరాల భరద్వాజగారొకరు. వారికి చిన్నప్పుడే మాతృవియోగం కలిగి మాతృప్రేమకు పరితపించే ఆయనను, తనకన్నా వయసులో పెద్దవారైనా, తన కన్నబిడ్డలా చేరదీసి, లాలించి, మాతృప్రేమతో ఆయనకు స్వాంతన చేకూర్చింది హైమ.

హైమ తన చిన్నతనం నుంచే ఏవేవో శారీరక రుగ్మతలతో బాధపడుతున్నా ఆ బాధల ప్రభావాన్ని ఇతరులపై చూపకుండా, వారితో తన సహజ స్వభావంతో సాత్వికంగానే మాట్లాడేది.

అటువంటి 'స్వభావమాధురి' కనుకనే అమ్మ తన విశ్వపరిపాలనలో హైమకు మాత్రమే స్థానం కల్పించింది.

హైమకు అమ్మ అంటే ప్రాణం! అమ్మనామం ఆమెకు కర్ణపేయము! అందుకే "అమ్మా! నీ నామం ఎల్లప్పుడూ నా చెవిని పడేట్టు చేయవమ్మా?"అని హైమ కోరగానే అమ్మ సరేనని ఆమె కోరినట్లు,

"జయహో మాతా! శ్రీ అనసూయా!

రాజరాజేశ్వరి! శ్రీ పరాత్పరి!"

అనే తన నామం నిరంతరం హైమకు వినబడేలాగా ఏర్పాటు చేసింది.

అదే నామసంకీర్తన, నాడు అమ్మ నివసించిన పూరింటికి (నేడది అదే ఆకారంలో సిమెంటు స్లాబుతో పక్కాగా తయారయింది) హైమ సమాధి మందిరానికి మధ్యన గల వసారాలో భక్తుల సమూహంచే రేయింబవళ్ళు చేయబడుతోంది.

అంతేనా! హైమ అకాలంలో దేహత్యాగం చేసిన తరువాత అమ్మ ఆమె దేహంలో తిరిగి ప్రాణప్రతిష్ఠ చేసి, ఆమెకు దైవత్వాన్ని కలుగచేసి, సజీవ సమాధి చేసి, దేవతగా కొలువు దీర్చి, దానిపై ఆలయాన్ని నిర్మించి, ఆమెను భక్తుల పాలిటి కొంగు బంగారంగా తీర్చిదిద్దింది.

స్వయంగా తానే ఆమెకు మొదటి భక్తురాలై కొలిచి పూజాదికాలు చేసింది.

అదే నేటి హైమాలయం అనబడే మహిమాలయం.

అవును. అది నిజంగా మహిమాలయమే. మహిమలంటే మంత్ర తంత్రములతో కూడిన మహిమలు కావు. కారుణ్యదృక్కులతో, సహేతుకమైన మన ఈప్సితములను ఈడేర్చే వరాల జల్లు. మన ఈతిబాధలను కడతేర్చే ఔషధాలయం. అందులోని ఔషధం, హైమ కురిపించే కరుణామృత ధారయే!

ఆ విధంగా హైమను ఒక ధన్వంతరిగా తీర్చిదిద్దింది అమ్మ.

అందుకే హైమకు దైవత్వాన్ని కలిగించిన తర్వాత అమ్మ చెప్పిన మాటలివి:-

"నేను హైమకు దైవత్వాన్ని కలిగించాను."

"హైమ మీద మీకు గల ప్రేమకంటే, హైమకు మీ మీద ప్రేమ ఎక్కువ."

"అందుకే హైమయే మనకు దారి అనుకుని నామం చెయ్యండి."

నామం అంటే, కేవలం 'జయహో మాతా! శ్రీ అనసూయా! రాజరాజేశ్వరి! శ్రీపరాత్పరి!" అనే అమ్మ నామమే కాదు-

"ఓం హైమ! నమో హైమ! శ్రీ హైమ! జై హైమ!" అనే హైమ నామం కూడా.

అందుకే కీ.శే. ఇందిర గేయంలో పేర్కొన్నట్లుగా పైన పేర్కొన్న హైమ నామాన్ని ఉచ్చరిస్తూ 111 (నూటపదకొండుసార్లు) హైమవతీ దేవియొక్క గర్భగుడి చుట్టూ తిరిగితే మన సహేతుకమైన కోర్కె ఏదైనా నెరవేరి తీరుతుంది. అలా కోరి ఆమెను కొలుచుకున్న వారికి తన పాలవంటి మనసుతో కొంగుబంగారమవుతుంది హైమ అనబడే హైమవతీ దేవి! ఇది ఈ రచయిత స్వానుభవం కూడా.

అందుకే అనసూయేశ్వరాలయంలో వలెనే హైమాలయంలో కూడా విశేష పూజలు, అభిషేకాలు నిత్యం జరుగుతూ వుంటాయి.

అంతేకాదు, అనసూయేశ్వరాలయంలో భక్తులు కళ్యాణాలు, శుభకార్యాలూ చేయించుకుని "అనసూయ వ్రతం" చేయించుకున్నట్లే, హైమాలయంలో కూడా భక్తులు శుభకార్యాలు, పూజల అనంతరం "హైమవతీ వ్రతం" చేసుకుంటారు.

అంతటి మహిమ కలది - అమ్మచే దైవత్వం పొంది, దేవతగా ప్రతిష్ఠింపబడి, స్వయంగా అమ్మచేత అర్చింపబడిన ఈ హైమవతీదేవి!

కనుకనే వరుసకు అమ్మ సోదరుడు, హైమకు మేనమామ అయిన 'రాజుబావ' అనబడే శ్రీ మన్నవ బుచ్చిరాజుశర్మ గారు-

అందరి హృదయాల వెలుగు హైమా!
ఎందు దాగినావో తెలుపుమమ్మా!
ఈ జగతికి పావనమై
ఈ ప్రగతికి జీవనమై
అమరమైన అమ్మలాంటి హైమా!
మా హృదయపు మందిరముల నిలచీ
మామది ఏవో పిలుపులు పిలచీ
యుగయుగాల భావనలో
జగ జగాల సాధనలో
నిత్యమైన సత్యమైన హైమా!

జాలిలోన జీవితమే చిలికీ
కాలపురుష కరములలో నలిగి
తారలలో తారకవై
మాలో ధృవతారకవై
నిలిచినట్టి నీలికనుల హైమా!



**హైమాలయంలో మూలవిరాట్- హైమవతీదేవి**
**ఈ విగ్రహం క్రిందన హైమ సమాధి**

అంటూ, తాము విరచించిన "అమ్మ ప్రసాదించిన అనుభవసారము" "లోచూపు" అను గ్రంథము (శ్రీ విశ్వజననీ పరిషత్- జిల్లెళ్ళమూడి వారి ప్రచురణ)లో హైమను కీర్తించినారు.

❀ ❀ ❀

# అమ్మ విదేశీ భక్తులు

అమ్మకు ఆసేతు హిమాచలం స్వదేశంలోనే కాదు, విదేశాలలో కూడా భక్తులున్నారు.

వారిలో కొందరు, కొన్ని ఆధ్యాత్మిక పత్రికలలో అమ్మను గురించి ప్రచురింపగా చదివి అమ్మపట్ల ఆకర్షితులైనవారు, మరికొందరు హిందుదేశ విశిష్టతను మన ఆధ్యాత్మిక గురువులు, స్వాములు, అమ్మలను గురించి విని, చదివి, వారిలో ఒక గురువును, తమ ఆధ్యాత్మిక జీవనానికి గమ్యమును వెదుక్కుంటూ వచ్చినవారు వున్నారు.

వారిలో ఈ రచయితకు తెలిసినంతవరకు నలుగురు వున్నారు. వారు 1. మిస్టర్ జేమ్స్ కాంపియన్, 2. మిస్టర్ రిచర్డ్ షిఫ్‌మన్, 3. మిస్టర్ గార్డన్ వెస్టర్‌లండ్, 4. మిస్టర్ టెరీన్స్.

వీరిలో మిస్టర్ రిచర్డ్, వెస్టర్‌లండ్‌లు అమెరికాకు చెందిన వారైతే మిస్టర్ జేమ్స్, టెరీన్స్ ఇంగ్లాండ్‌కు చెందినవారు.

మిస్టర్ జేమ్స్ కాంపియన్ అమ్మ దగ్గరకు వచ్చిన తరువాత కర్నాటకలోని మైసూర్‌లో స్థిరపడినారు. జిల్లెళ్ళమూడి అమ్మ సంస్థకు ఎన్నో విధాల సాయపడినారు. ఇక్కడ మాతృశ్రీ డిజిటల్ సెంటర్ (MDC) ఏర్పరిచి, అందులో అమ్మయొక్క వివిధ సందర్భాలలో తీసిన ఛాయాచిత్రాలను దగ్గర దగ్గర మూడువేల వరకూ సేకరించి డిజిటైజ్ చేసి వున్నారు.

అమ్మ వున్నప్పుడు ఆయన ఇక్కడే వుండి ప్రతిరోజు అమ్మ సన్నిధిలో ఉదయం పూట సుప్రభాతం, సాయంత్రం పూట సంధ్యావందనం (హారతి)ల తెలుగు లిపిని తన మాతృభాష (ఆంగ్లం)లో రాసుకుని శ్రద్ధగా శ్రావ్యంగా ఆలాపన చేసేవాడు. ఇక్కడే తనకు ఒక భవనాన్ని కట్టుకుని ఆయన ఇప్పటికీ అప్పుడప్పుడు ఇక్కడకు వచ్చిపోతూ సంస్థకు తన సహాయ సహకారాలను, సలహాలను అందిస్తూ వుంటాడు. హైమాలయం ఏర్పడిన తొలిరోజుల్లో అక్కడి పూజాదికాలను తానే స్వయంగా పర్యవేక్షించేవాడు.

అయితే ఆయనకు తన గురించి ప్రచారం ఇష్టం లేకపోవడం వలన ఆయనను గురించి ఇంతకన్నా వివరాలను అందజేయలేకపోతున్నాను. నేను వ్యక్తిగతంగా వెళ్ళి అడిగినా ఆయన తన వివరాలను నాకు అందజేయలేదు.

అయితే ఈ గ్రంథంలో ప్రచురించిన అమ్మ యొక్క వివిధ ఛాయాచిత్రాలను డిస్క్‌లో తీసుకుందుకి మాత్రం ఆయన అనుమతించారు. అందుకాయనకు ఇందుమూలముగా కృతజ్ఞతల నందజేస్తున్నాను.

ఇక రెండవవారైన మిస్టర్ రిచర్డ్ షిఫ్‌మన్. ఆయన అమెరికా నుంచి జిల్లెళ్ళమూడికి అమ్మ దేహధారిణిగా వుండగానే వచ్చి ఇక్కడ సుమారుగా మూడు సంవత్సరములు నివసించి అమ్మను ఆమె తత్త్వాన్ని నిశితంగా అధ్యయనం చేసి ఆమెనుగురించి 'మదర్ ఆఫ్ ఆల్' అను తన ఆంగ్ల గ్రంథంలోని 'విశ్వజనని' అనే అధ్యాయంలో వివరించారు. దానిని, కీ.శే.తంగిరాల కేశవవర్మ అనే అమ్మ భక్తులు తెనిగించగా "శ్రీవిశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి' వారు ప్రచురించారు. ("విశ్వజనని" 'తెనుగు పుస్తకం మదర్ ఆఫ్ ఆల్ గ్రంథంలోని ఒక చాప్టరుకు తెనుగు అనువాదం.)

విశ్వజననీ తెనుగు గ్రంథములో లభ్యమైన రచయిత పరిచయ వాక్యాలను ఇక్కడ యథాతథంగా పాఠకుల ముందు వుంచుతున్నాను.

"రిచర్డ్ షిఫ్‌మన్ అమెరికా దేశం న్యూయార్క్ నగరంలోని సంపన్న కుటుంబానికి చెందిన పట్టభద్రుడు. పురాతత్వశాఖలో 'మానవ పరిణామ వికాస శాస్త్రాన్ని' అభ్యసించినవాడు. విద్యార్థిదశలో ఆధునిక పాశ్చాత్య యువకుల వలెనే విలాసవంతమైన జీవితాన్ని గడిపి, దానిలో తృప్తిని పొందలేక భారతీయ సంస్కృతీ సంప్రదాయలకు ఆకర్షితుడై భారతదేశానికి వచ్చి, ఆసేతు హిమాచలం పర్యటించి, దైవీశక్తి సంపన్నులైన ఎందరో మహానుభావులను, యోగులను దర్శించి, తను అన్వేషిస్తున్న 'సత్యపదార్థాన్ని' జిల్లెళ్ళమూడి అమ్మలో చూచిన తాత్వికుడు. పత్రికా రచయితగా, సత్యసందర్శనం చేసిన జిజ్ఞాసిగా, తన సునిశిత పరిశీలనా దృష్టిని, అనుభవాన్ని, తృప్తిని, నైపుణ్యాన్ని "మదర్ ఆఫ్ ఆల్" అనే ఆంగ్ల గ్రంథంలో వివరించిన మేధావి. అన్నీ వున్న విస్తరి అణిగిమణిగి వుంటుందన్నట్టు అన్ని లక్షణాలున్నా, అతి నిరాడంబరంగా జీవనం సాగించే బాటసారి. జిల్లెళ్ళమూడిలోని మాతృశ్రీ మెడికల్ సెంటర్ నిర్వహణలో తన వంతు సహాయ సంపత్తులను ఉదారంగా, విశేషమైన మానవతా దృక్పథంతో అందజేశారు.

భక్త పాఠకులారా! ఇదీ మిస్టర్ రిచర్డ్ షిఫ్‌మన్ గారి పరిచయం.

సరే, ఇప్పుడు మిస్టర్ రిచర్డ్ షిఫ్‌మన్ అమ్మపట్ల ఎటువంటి అవగాహనకు వచ్చాడో, అమ్మపట్ల ఆయన అభిప్రాయమేమిటో ఆయన మాటల్లోనే తెలుసుకుందాము. (పే.1- విశ్వజనని)

"దక్షిణ భారతదేశంలో జిల్లెళ్ళమూడి గ్రామంలో ఒక అమ్మ వున్నది. ఆమె తన పిల్లలకు అన్నం పెడుతుంది. వారిని అనారోగ్యంలో సాకుతుంది. వారిని మందలిస్తుంది. అప్యాయంగా బుజ్జగిస్తుంది. ఆపదలో ఓదారుస్తుంది. సుఖదుఃఖాలలో వారి కన్నీరు తుడుస్తుంది. అమ్మ దాదాపు అందరివలెనే వుంటుంది. చూపులోగాని, తీరులో గాని

మామూలు గుంపునుంచి విడదీసేందుకు ఏ రకమైన విశేషంగాని, వ్యక్తిత్వ లక్షణంగాని కనపడదు. అయినా ఒక్క విశిష్ట లక్షణం కూడా లేకపోయినట్లయితే, ఇప్పటి వలె ఆమె వేలాదిమందిచేత ఆరాధింపబడరు కదా, కనీసం గమనింపబడి వుండేవారు కాదు.

అందరి తల్లుల నుంచి అమ్మను విడదీసి చూపుతున్న ఆ ప్రత్యేక లక్షణం ఏమిటి? ఒక్కమాటలో చెప్పాలంటే, సామాన్యంగా మనం ఆపేక్ష, ఆప్యాయతలను పరిధులు గీసుకుని గర్భవాసాన పుట్టినవారినే మనం సంతానంగా భావిస్తాం. కాని అమ్మ అలాకాదు. సర్వమూ తన సంతతిగానే భావిస్తుంది. సకల మానవులు, జంతువులు, వస్తువులు, ఆలోచనలూ, గుణాలూ సర్వమూ అందరినీ, అన్నిటినీ, ఎక్కడున్నా గాఢమైన ఆపేక్షతో, ప్రేమాదరాలతో, దయతో, తల్లి తన కన్నబిడ్డను చూచిన రీతిలో పరామర్శిస్తుంది.

సమస్త విశ్వంలో దేనినీ అమ్మ జడంగా చూడదు. చైతన్య రహితంగా చూడదు. ఈ అనంత సువిశాల చైతన్య ప్రవాహంలో, నామరూపావస్థా వైవిధ్యంతో, ఎడతెరిపి లేకుండా తన సంతానాన్నే చూస్తుంది. అమ్మలో మూర్తీభవించి భాసిల్లే సంపూర్ణమైన ప్రేమ, ఏకత్వ దృష్టి మానవ జీవితంలో పొందదగిన మకుటాయమాన ఘన విజయాలు.

మొదటినుండీ అమ్మ ఒకే విధంగా వున్నది. అదృష్టవంతులైన ఏ కొద్దిమందో అమ్మ చిన్నతనంలోని ఉన్నతస్థితికి తార్కాణంగా నిలిచారు.

తరచూ ఎందరికో అమ్మ బాల్యంలో అద్భుతమనిపించే అసాధారణ దర్శనాలు కనిపించేవి. అమ్మను కృష్ణపరమాత్మని వలె, రాజరాజేశ్వరీదేవి వలె, క్రీస్తు భగవానుని వలె, ఇంకా ఎన్నో దేవతా రూపాలలో ఎందరెందరో దర్శనానుభూతులు పొందారు.

సర్వ సాధారణంగా చాలామంది ఆ పసికందులో పరమ పవిత్ర వ్యక్తిత్వాన్ని, మహోన్నత మాతృత్వాన్ని గుర్తించారు. అర్ధ శతాబ్ది క్రితం ఏ లక్షణాల మూలంగా అమ్మవైపు ఆకర్షితులైనారో, అవే లక్షణాల వలన అసంఖ్యాకులైన యాత్రికులు నేడు జిల్లెళ్ళమూడికి ఆకర్షితులవుతున్నారు.

సంప్రదాయకులైన హిందువులు అమ్మను ఆదిశక్తి అవతారంగా భావించి అమ్మను శాస్త్రోక్తరీతిలో పూజించుకునేందుకు వస్తారు.

ప్రారంభంలో ఏ వుద్దేశ్యంతో మనం అమ్మను చూచేందుకు వచ్చినా తిరిగి తిరిగి మళ్ళీ మళ్ళీ రావటానికి మాత్రం అందరికీ ఒకటే కారణం. అమ్మలో మనం మహోత్కృష్టమైన ప్రేమకు, ఉన్నతమైన ఆధారమునకు మూలాన్ని చూడటమే కారణం. 'అమ్మ' అనే పదానికి ఎంతో నిజమైన గొప్పదైన భావాన్ని అమ్మలో చూస్తాం.

అమ్మ సాన్నిధ్యంలోకి మనం మొదటిసారి వచ్చినపుడు మనలను ఆమె అంతకు ముందే ఎరిగి వున్నట్టుగా, మనం ఏమాత్రం కొత్తవారం కానట్లుగా అచ్చెరువు గొలిపే పరిచిత దృష్టితో గమనిస్తుంది.

అమ్మ తనచుట్టూ వున్నవారిని చూస్తుంటే, ఆ చూపులో, హావభావాలలో తల్లి కనబరిచే ఆసక్తి గోచరిస్తుంది.

ఆ దృష్టి పరమ సన్నిహితమూ, ఉపశమన కారకమూ అయినది. ఆ చూపులో అజ్ఞాతమైనదేదో మనలో జాగృతమై కదలుతుంది. చాలామంది చెప్పలేని భావోద్వేగానికి లోనై విలపిస్తారు. మరికొందరు పరమ ప్రశాంతత మృదువుగా అవతరించటం అనుభవిస్తారు."

భక్త పాఠకులారా! తెలిసిందిగా, అమ్మను గురించి రిచర్డ్‌గారి అభిప్రాయమేమిటో. జీవితంలో సత్యాన్ని అన్వేషించే వారికి జిల్లెళ్ళమూడి చివరి మజిలీ! అసలు ఇక్కడినుంచే ప్రతీ వ్యక్తికీ క్రొత్తజీవితం ప్రారంభమవుతుంది. నిజానికి జిల్లెళ్ళమూడి ప్రయాణం ప్రతి వ్యక్తికీ తన ఆత్మవైపు చేసే ప్రయాణం వంటిదని రిచర్డ్‌గారి అభిప్రాయం.

అసలు అమ్మను ప్రథమ పర్యాయంలో చూడగానే ఆయన వ్యక్తపరచిన అభిప్రాయం ఏమిటో చూడండి.

ఆయన మొదటిసారిగా అమ్మను చూచింది నెల్లూరులోని డా॥ యస్.వి.సుబ్బారావుగారి క్లినిక్‌లో అనారోగ్యంతో అమ్మ వైద్యం చేయించు కుంటున్నప్పుడు. ఆమెను చూడడానికి ఆయన బాపట్ల నుండి నెల్లూరుకు రైల్లో ప్రయాణమవుతూ, అంతకుముందు అమ్మ పుస్తకాలలో చదివిన "అమ్మ వాక్యాలను" మననం చేసుకున్నాడు.

అవి ఇవి:

"ఎప్పుడో మిమ్మల్ని కనిపెంచాను. ఇప్పుడు కనిపించాను."

"నా కొలత ఎవరికీ తెలియదు. అందరి కొలతలూ నేనే."

"నన్ను మరుగు పరుచుకునేందుకో తెర. నా మారువేషాన్ని ప్రదర్శించుకునేందు కింకో తెర. ఎప్పుడూ తెరవెనుక తెర వుంటూనే వుంది."

"మాటలతో గాని, పెన్నిధితో గాని ఎవరూ తెరను తొలగించి జొరబడలేరు"

పాఠకులారా! ఈ మాటకు అర్థం, తమ వాక్చాతుర్యంతో గానీ, ధనంతో గానీ తనను జయించలేరని.

అలా రైల్లో ప్రయాణం చేస్తున్నంతసేపూ, అమ్మను గురించి ఆలోచిస్తూ, ఆమె సూక్తులను మననం చేసుకుంటూ, నెల్లూరు చేరి అమ్మను చూచిన మరుక్షణమే రిచర్డ్‌గారు ఆమెపై వ్యక్తపరచిన అభిప్రాయం చూడండి. (పే.23- విశ్వజనని)

"నిజానికి అమ్మ యాభయ్యోపడి చివరన వున్న స్త్రీగా ఏమాత్రమూ కనిపించ లేదు. తన సన్నిహిత స్నేహితులతో రహస్యాలు పంచుకుంటున్న వెడల్పు కళ్ళ పసిపిల్లలో కనిపించే స్వచ్ఛమైన ప్రతిఫలనశీలతా, నిర్మలమైన అమాయకత్వం అమ్మముఖంలో వున్నాయి."

భక్త పాఠకులారా! ఇలా రిచర్డ్‌షిఫ్‌మన్‌కు అమ్మతోగల అనుబంధం, అనుభవాలను గురించి చెబుతూ పోతే అది ఒక ఉద్గ్రంథమవుతుంది. అది తెలుసుకోవాలనుకుంటే మీరు ఆ పుస్తకాన్ని శ్రీ విశ్వజనని పరిషత్, జిల్లెళ్ళమూడి వారి నుంచి తెప్పించుకుని చదవాల్సిందే. అంత చక్కని పుస్తకం అది. అమ్మచేత అది ఎంతగానో కొనియాడబడింది కూడా.

చివరిగా మనం అమ్మ రిచర్డ్‌తో సంక్షిప్తంగా మనిషి ఎలా ఏమి చేస్తే, ఏమి ఆలోచిస్తే హాయిగా వుండగలడో చెప్పిన విషయాన్ని ఆయన మాటలలోనే విని తెలుసుకుని ఈ ప్రకరణను ఇంతటితో ముగిద్దాం. (పే.96- విశ్వజనని)

"అన్ని చింతలూ నువ్వు కర్తననుకోవడంతోనే పుడుతున్నాయి. ప్రతి విషయమూ నువ్వు స్వయంగా చేసిందేనని ఆలోచించినపుడు నీకు బరువైన బాధ్యత వున్నట్లు నువ్వే అనుకుంటావు. ఆ బాధ్యతను భగవంతుని మీదకు విసరివేస్తే నీవు హాయిగానూ, ఉపశమనం పొందినట్లుగానూ అనుభూతిని చెందుతావు."

భక్త పాఠకులారా! అమ్మ పైన చెప్పిన విషయానికి రిచర్డ్‌గారి అభిప్రాయం చూడండి.

"భగవంతుని భుజాలమీద బాధ్యత వేయటమంటే దానినుండి (బాధ్యతనుండి) తప్పించుకోవటం కాదు. ప్రత్యక్షంగా వున్నది గుర్తించడం మాత్రమే. వేర్పాటు పొందిన నా స్వంత అహంకారం (అంటే పెడత్రోవను పట్టించే అహంకారం) కన్నా, విశ్వంలో ఉత్కృష్టమైన శక్తి పనిచేస్తున్నదని, నా ప్రయత్నపు జయాపజయాలు చివరికి నా అధీనానికి అతీతంగా వుంటాయని గుర్తించడమే."

భక్త పాఠకులారా! భగవంతుని మీద భారం వేయడమంటే మానవప్రయత్నం లేకుండా నిర్వ్యాపారంగా వుండమని కాదు. ఒక కార్యాన్ని సాధించడానికి మన ప్రయత్నం మనం చేసి ఫలితాన్ని భగవంతునికి వదిలివేయాలి. అంతేకాదు. మన వృత్తి వ్యాపారాలను కూడా కేవలం దైవ కార్యాలుగా భావించి, అంటే- వాటి ఫలితాలు మంచివైనా చెడువైనా,

అవి లభించినా, నష్టపడినా వాటిని భగవదర్పణ చేస్తేచాలు. వాటి ఫలితాలను మనకు అనుకూలంగా భగవంతుడే మన కందిస్తాడు.

దానినే గీతలో కర్మసన్యాస మన్నారు. అంటే మనం కర్మచేసి ఫలితాన్ని భగవంతునికి వదిలివేయడమన్నమాట. ఇంకా విపులంగా చెప్పుకోవాలంటే మనం చేసే కర్మ మంచిదయితే భగవంతుడు మనకు సానుకూలంగానే స్పందిస్తాడు. చెడుదయితే స్పందించడు.

దానికి రిచర్డ్‌గారు రమణమహర్షి ఉపమానం కూడా ఉదహరించారు.

అంటే, మనం రైలు ప్రయాణం చేసినప్పుడు రైలు కంపార్టుమెంటులోనికి మన సామానును చేత్తో పట్టుకునో నెత్తిపై పెట్టుకునో మోసుకువెడతాం. తరువాత సామానును కంపార్టుమెంట్‌లో మనం కూచున్న బెర్త్ క్రిందనో లేదా పై బెర్త్‌లోనో వుంచుతాం. అంటే, వాటి బరువు బాధ్యతలను రైలు పెట్టెకే అప్పగిస్తాం కాని, అక్కడకూడా వాటిని మన చేత్తో పట్టుకునో నెత్తిమీద మోస్తోనో వుండలేం కదా. రమణమహర్షి చెప్పిందదే!

దానినే రిచర్డ్‌గారు ఎలా వివరించారో చూడండి. (పే.97-విశ్వజనని.)

"భగవంతుడే గమ్యంగా వెళ్ళే రైలులో దారి చూపే కండక్టరు లాంటి వాడే గురువు. ప్రయాణీకులు ధైర్యంగా వుండేట్లు చేయటం, వారి దోషాలూ, భంగపాట్లూ, వారి రక్షణలూ వీటి నన్నిటినీ వదిలి హాయిగా, బిగింపులు సడలిపోయి విశ్రాంతచిత్తంతో వుండేట్లు చేయడం గురువు కర్తవ్యం.

రమణ మహర్షి ఉపమానం వాడితే, రైలు కంపార్టుమెంట్‌లోని అడుగు భాగం తన మూటాముల్లే భరిస్తుందని తెలుసుకోవడంలో విఫలుడై, ప్రయాణం మొత్తం తన సామానును తన నెత్తినే ఎంతో అస్థిరంగా వుంచుకునే అజ్ఞాని అయిన ప్రయాణీకుని వలె మనమున్నాము."

భక్త పాఠకులారా! చూచారుగా అమ్మ నిర్వచనాన్ని రిచర్డ్‌గారు విశ్లేషించిన తీరు.

ఆయన తన ఆధ్యాత్మిక జీవితాన్వేషణలో అనేకవేల మైళ్ళ దూరం నుండి అనేక ఖండాలను, మహాసాగరాలను దాటుకుంటూ పుణ్యభూమి అయిన మన భారతదేశానికి వచ్చి, మన దేశాన్ని ఆసేతు హిమాచలం దర్శించి, చివరకు దక్షిణ భారతదేశపు జీవగర్రగా భాసిల్లుతున్న జిల్లెళ్ళమూడిని తన ఆధ్యాత్మిక జీవన మార్గానికి చివరి మజిలీగా ఎంచుకుని, అమ్మయొక్క దయాసముద్రంలో మునిగి తేలి, పునీతుడైన పుణ్యమూర్తి రిచర్డ్ షిఫ్‌మన్!

ఆయనకు జేజేలు పలుకుదాం.

# మిస్టర్ గార్డన్ వెస్టర్‌లండ్-యు.ఎస్.ఎ.

మిస్టర్ గార్డన్ వెస్టర్‌లండ్, అమెరికా దేశపు ఆధ్యాత్మికవాది.

ఆయన శ్రీరమణ మహర్షి అనుయాయుల చేత నడపబడుతున్న "ది మౌంటెయిన్ పాత్" అనే జర్నల్ ద్వారా మొదటిసారిగా అమ్మను గురించి తెలుసుకుని, ఆమెపట్ల ఆకర్షితుడై ఆమెను పరోక్షంగా సేవించుకుని, జిల్లెళ్ళమూడిలో అమ్మయొక్క 'అందరింటి'కి తన దేశమునుండే ఎంతో ఆర్థిక సహాయమును చేసిన మహోన్నతుడు.

నిజానికి అమ్మ దేహ ధారణతో నున్నప్పుడు ఆమెను అతడు ఎన్నడూ స్వయంగా వచ్చి చూడలేదు. ఆమె మహాసిద్ధి పొందిన తరువాతనే ఆయన మనదేశానికి వచ్చి జిల్లెళ్ళమూడిని సందర్శించాడు.

అయితే ఆయన ఇప్పటికీ అమ్మను బ్రహ్మగానే కాదు, బ్రహ్మముగా అంటే- విశ్వమంతటా నిండియున్న అనంతాత్మగా కూడా భావిస్తూ సేవిస్తున్న ధన్యజీవి!

ఈ గ్రంథ రచయిత అమ్మను గురించి ఆయన అభిప్రాయమును కోరిన వెంటనే అమెరికా నుంచి ఇ-మెయిల్‌లో తన అమూల్యమైన అభిప్రాయమును పంపిన మహానుభావుడు! నిరాడంబరుడు.

అమ్మను గురించి ఆంగ్లములో పంపిన ఆయన అభిప్రాయమును (ఇ-మెయిల్ కాపీని) ఇక్కడ యథాతథంగా అందించడమైనది.

దానితోబాటే తెలుగులో దాని స్వేచ్ఛానువాదాన్ని కూడా ప్రచురించడమైనది.

పాఠకులు చదివి ఆస్వాదించగలరు.



*మిస్టర్ గార్డన్ వెస్టర్‌లండ్*

**Mr. Gordon Westerlund**
7313 Unicorn Cir
Ventura, CA 93003

Greeting V.S.N. Murthy:

Thank you for your request of a few words about Amma.

I first read about HER in "The Mountain Path" journal put out by Ramana Maharshi's group. ~~Amma~~ MOTHER

I've felt that, Anasuya Devi protected me many times, when very life could have been taken. Also, when I've been sick, SHE has made me well, I believe.

It seems that it is usually through name ~~and~~ and form that we become aware of The Nameless and formless.

P.2

I feel that Amma -
was & still is with and
at once is without
name and form.

Many times I
sensed that She was
with me and
watching over me
especially when I
lived & walked through
a ~~high~~ high crime rate in
Portland, Oregon U.S.A.

I have never met
Amma in human flesh.
but at times I could
sense HER Presence with
me while SHE was still
alive in Jillellamudi. ~~[illegible]~~
When I read that Amma
had passed away, I felt
that SHE was still very alive
well & had merged more into HER

Memo from -
DR. E. BLAIR McLEAN

Infinite lasting SELF - which is one with BRAHMAN & BRAHMA. - I really like HER sayings. "mind, matter and the Hight Goal are one. What is there that does not have the Highest in it? Everything is of Him - So let anyone say of anything, 'This is the Highest (Goal)'. And Only THAT which is all, is MOTHER. (Amma). A wise One is one who becomes a (Universal) Mother.

**GORDON WESTER LUND C**
7313, Unicorn Circle,
Ventura CA, USA
Zip Code : 93003-634613
e-mail : gwesterl@westmont.edu



The Living Way of Opulence

1-805-687-1886

ఈ గ్రంథ రచయిత కోరిన వెంటనే మిస్టర్ గార్డన్ వెస్టర్‌లండ్ (యు.యస్.ఎ.) అమ్మను గురించి తెలిపిన అభిప్రాయమునకు స్వేచ్ఛానువాదము.

వి.ఎస్.ఎన్.మూర్తికి శుభాకాంక్షలు.

అమ్మను గురించి కొన్ని మాటలు నన్ను చెప్పమని మీరు కోరినందుకు కృతజ్ఞతాభి వందనములు.

నేను ప్రథమముగా అమ్మను గురించి తెలుసుకున్నది శ్రీ రమణ మహర్షి అనుయాయులచే ప్రచురింపబడిన "మౌంటెన్ పాత్"అను వ్యాస సంపుటినుండి.

అమ్మ అనసూయాదేవి నన్ను చాలాసార్లు నా ప్రాణాపాయస్థితి నుండి రక్షించినదనీ, ముఖ్యముగా నేను తీవ్రమైన అనారోగ్యముతో బాధపడుతున్నపుడు, అమ్మ నాతోనే వుండి నన్ను సేదదీర్చి ఆరోగ్యవంతునిగా చేసినదని నా ప్రగాఢ నమ్మకం! దృఢ విశ్వాసం!

అప్పుడే కాదు, ఇప్పటికీ ఆమె నాతోనే అదృశ్యరూపములో వున్నదని భావిస్తున్నాను.

అమ్మ విశేషమైన కరుణ వలన ఆమెయొక్క సగుణ, నిర్గుణ స్థితులు నా అనుభవములోకి వచ్చినవి.

అయినప్పటికీ ద్వంద్వాతీత అయిన అమ్మ నాకు భౌతికమైన రక్షణ కలిగించినది.

ముఖ్యముగా నేను యు.ఎస్.ఎ., ఓరగాన్ రాష్ట్రం, పోర్ట్‌ల్యాండ్‌లో నివసిస్తున్న సమయంలో, నేనొక తీవ్రమైన నేరపూరిత వాతావరణంలో గడిపినపుడు, అమ్మ అదృశ్యముగా నన్ను కనిపెట్టుకుని నాతోనే వున్నదనే భావం నాలో కలిగినది.

అమ్మ శరీరధారిణిగా వున్నప్పుడు నేనెన్నడూ ఆమెను చూడలేదు, కలవలేదు.

అయితే ఆ సమయంలోనే (దేహధారిణిగా వున్నపుడే) తరచుగా ఆమె సన్నిధిని నా సమక్షంలో అనుభూతిని పొందేవాడిని. అమ్మను నిరాకార రూపంలోనే సేవించేవాడిని.

ఆమె దేహము వదలినదని నేను విన్నప్పుడు ఆమె ఇంకా సజీవముగానే వున్నదని, అయితే ఆమె అనంతాత్మ బ్రహ్మత్వం చెంది, ఈ విశాల విశ్వమంతటా ఆమె నిత్యమై, సత్యమై బ్రహ్మంగా నిండివున్నదని సగుణం నుండి నిర్గుణమై భాసిల్లినదని నా భావన.

"మనసు, పదార్థము, అత్యున్నత గమ్యము" అంతా ఒకటేనన్న ఆమె సూక్తులను నేను నిజంగా ఇష్టపడతాను.

పై మూడింటిలో ఔన్నత్యము లేనిదేది?

అంతా ఆయన (బ్రహ్మ)లోనే నిబిడీకృతమై వున్నది.

కనుక ఎవరేమి చెప్పినా, దేనిని గురించి చెప్పినా ఇదే అత్యున్నత గమ్యము. అదే, అంతటా నిండివున్న ఆ బ్రహ్మమే అమ్మ రూపంలో బ్రహ్మమై వున్నది. కనుక ఆమె కేవలం బ్రహ్మయే కాదు, బ్రహ్మము కూడా.

ఆమెను ఒక 'విశ్వమాత' అని భావించుటయే మానవుని విజ్ఞత.'

భక్త పాఠకులారా! అమ్మను గురించి వెస్టర్‌లండ్ గారి అభిప్రాయం తెలిసిందిగా.

ఎక్కడి ఇండియా! ఎక్కడి ఆంధ్రప్రదేశ్! అందులో వున్న ఎక్కడి జిల్లెళ్ళమూడి!

అలాగే ఎక్కడి అమెరికా ఖండం! ఎక్కడి కాలిఫోర్నియా! ఎక్కడి వెంచురా సిటీ!

అమ్మ సర్వాంతర్యామి కాకపోతే, అమ్మ ఈ సమస్త భూమండలాన్ని ఆవరించియున్న బ్రహ్మ పదార్థము (బ్రహ్మము) కాకపోతే మనదేశమునకు వచ్చి అమ్మను ఒక్కసారి కూడా చూడక, కేవలం తనదేశంలోనే వుండి, అహర్నిశలూ అమ్మనే తలుచుకుంటూ, మానసికంగా ఆమెనే కొలుచుకుంటున్న గార్డన్ వెస్టర్‌లండ్ వంటివారిని అహర్నిశలూ కనిపెట్టుకుని వుండి ఆయనను ఆపదలనుండి, అనారోగ్యం నుండి అమ్మ ఎలా కాపాడగలదు?

అలాగే, వెస్టర్‌లండ్‌గారి పై లేఖ చాలు పరబ్రహ్మ అపరబ్రహ్మ అమ్మేనని చెప్పడానికి.

అమ్మ తన అనుయాయుల ద్వారా ఆయనకు ఎన్నోసార్లు ఫోన్‌చేసి ఇండియాకు వచ్చి తనను కలవమని కోరింది. దానికి ఆయన ఇచ్చిన సమాధానమేమిటో తెలుసా?

ఈ రచయిత కర్ణాకర్ణిగా అమ్మ భక్తుల నోటినుండి విన్నదానిని బట్టి ఆయన ఏమన్నారంటే...

"అమ్మా! నేను ఇండియాకు వస్తే చాలా డబ్బు ఖర్చవుతుంది. దానికి బదులు ఆ ధనాన్ని మీకు ఇస్తే దానితో మీ సంస్థ అవసరాలు కొన్ని తీరుతాయి కదా" అని ఆ ఖర్చుకు సరిపడా ధనాన్ని అమ్మకు పంపేవాడు.

ఆ విధంగా ధనాన్ని ఆదా చేసి అమ్మకు పంపి సంస్థకు తనవంతు సహాయం చేశానన్న తృప్తి ఆయనది!

ఇంకొక కారణం, తాను అమ్మను వచ్చి చూడకపోయినా సర్వాంతర్యామి అయిన అమ్మే అహర్నిశలూ తనతో వున్నదన్న ప్రగాఢ విశ్వాసం ఆయనది!

ఆ తృప్తి, విశ్వాసాలే ఆయన్ను జగజ్జననికి మరింత చేరువ చేసినవి.

అందుకే... "తృప్తే ముక్తి, విశ్వాసమే భగవంతుడు" అంది అమ్మ.

తరువాత కాలంలో అమ్మ దేహత్యాగం చేసిన అనంతరం జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను అనసూయేశ్వరాలయంలో దర్శించుకున్నాడాయన.

# మిస్టర్ టెరెన్స్

అమ్మ విదేశీ భక్తులలో తరువాతి వ్యక్తి మిస్టర్ టెరేన్స్. ఆయన ఇంగ్లాండు దేశస్థుడు. ఆయన తన ఇరవై సంవత్సరముల పిన్నవయసులోనే అంటే 1974వ సంవత్సరం నవంబరు నెలలో మనదేశానికి వచ్చి రిచర్డ్ షిఫ్‌మన్ వలె మనదేశంలో గల ఆధ్యాత్మిక క్షేత్రాలను దర్శించుకుంటూ అమ్మను గురించి విని, జిల్లెళ్ళమూడికి వచ్చి, అమ్మను చూసి తరువాత ఈ క్షేత్రమునే తన ఆధ్యాత్మిక జీవనపు చివరి మజిలీగా చేసుకున్నారు. ఆయన్ను ఇక్కడ అందరూ "టెర్రీసార్" అని పిలుస్తారు.

మన హిందూదేశపు ఔన్నత్యాన్ని, సంస్కృతినీ ఇష్టపడిన ఆయన హిందూమతాన్ని స్వీకరించగా, అమ్మ ఆయనకు 'ప్రేమ్' అని పేరుపెట్టి, 1984వ సంవత్సరములో ఆయనకు స్వయంగా ఉపనయనం చేసింది. 1985వ సంవత్సరములో కృష్ణాజిల్లాకు చెందిన మన తెలుగు బ్రాహ్మణ యువతినే ఆయన వివాహం చేసుకున్నారు.



మిస్టర్ టెరెన్స్‌కి హిందూత్వ పద్ధతిలో అమ్మ చేసిన ఉపనయనం

అమ్మ దేహధారిణిగా వున్నప్పుడు ఆయన జిల్లెళ్ళమూడి 'అందరింటి" ఆవరణలో ఒక చిన్న కాటేజ్‌ని కట్టుకుని వుండి, అతి కొద్దికాలంలోనే తెలుగును వ్రాయటం నేర్చుకుని

ప్రతిదినం ఉదయంపూట అమ్మకు సుప్రభాతం, సాయంత్రం సంధ్యావందనం, తరువాత పూరింటిముందు అమ్మనామం మిగతా భక్తులతో కలిసి చెప్పేవారు. మిగిలిన ఖాళీ సమయాల్లో మాతృశ్రీ మెడికల్ సెంటర్‌లోనూ, సంస్థ ఆఫీసులోను పనిచేసేవారు.

ఆయన ఇంగ్లీష్ యాసలోనయినా స్వచ్ఛమైన తెలుగును మాట్లాడతారు. సంస్థ ఆఫీసులో తెలుగులోకూడా ఉత్తర ప్రత్యుత్తరాలు నెరిపేవారు.

శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణునివలె నుదుట కుంకుమబొట్టును పెట్టుకుని, మెడలో జంధ్యాన్ని ధరించి పంచాంగంలో తిథి, వార, నక్షత్రాలను కూడా చెబుతారు.

ఇటీవలెనే ఇక్కడ, జిల్లెళ్ళమూడిలో క్రొత్తగా కట్టిన శ్రీహైమా నిలయం అపార్ట్ మెంటులో ఒక సింగిల్ బెడ్‌రూమ్ ఫ్లాట్‌ను కొనుక్కున్నారు.

అమ్మ దేహత్యాగం చేసిన తరువాత ఆయన బాపట్లకు మకాం మార్చి, అక్కడ ఒక స్కూలును, హాస్పిటల్‌ను నడుపుతూ, మధ్య మధ్యలో జిల్లెళ్ళమూడికి వచ్చి ఆలయస్థిత అయిన అమ్మను దర్శించుకుని వెడుతున్నారు.

ఒక విధంగా చెప్పాలంటే- అమ్మ సమకూర్చిన ప్రాక్ పశ్చిమ సంధానానికి, సంబంధానికి నిలువెత్తు సాక్షీభూతుడు ఆయన! ఆయన ఆకారం యూరోపియన్‌దే నైనా, ఆయన హృదయం మాత్రం నూటికి నూరుపాళ్ళు హిందువుదే. అందులోనూ సనాతన హిందువు! రాజయోగాది యోగశాస్త్రాలను క్షుణ్ణంగా పఠించి సాధన చేసినవారు.

అదంతా అమ్మ సంకల్పం! కాదు కాదు... సంకల్పమే తానుగా రూపుదిద్దుకున్న అమ్మ మహిమాన్విత కార్యం అది!

మరి, "భగవత్సంకల్పం కాదు, సంకల్పమే భగవంతుడు" అని అన్నది గదా అమ్మ! అంతే మరి...



# దేహత్యాగానంతరం అమ్మ చూపుతున్న లీలలు

1. నా అనుభవాలు. (వడ్డాది సత్యనారాయణమూర్తి, జిల్లెళ్ళమూడి)

నేను 15.8.2012న హైదరాబాద్‌నుండి జిల్లెళ్ళమూడికి మకాం మార్చినపుడు మా సన్నిహితుల్లో ఒకరు "ఇప్పుడు అమ్మ అక్కడ లేదుకదా, ఇప్పుడెందుకు జిల్లెళ్ళమూడికి వెళ్ళటం?" అని అడిగారు.

నిజానికి వారు అమ్మను, ఆమె దేహధారణలో నుండగా ఆమెను చూసి, ఆమె చేతి ప్రసాదాన్ని తిన్నవారే.

కాని, నాకు అటువంటి అదృష్టం కలుగలేదు. నేను మొట్టమొదటగా మహిమాన్వితమైన ఈ గడ్డపై అడుగుపెట్టడమే 2010 సంవత్సరం ఫిబ్రవరి 15వ తేదీన. అంటే, ధాన్యాభిషేకానికి ముందు. అదీ మహానంది క్షేత్రానికి వెళ్ళబోయి, ఆరోజు అటు వెళ్ళే రైలు రద్దవటం వలన ఇక్కడికి రావటం జరిగింది.

అమ్మ అంటే అంతకుముందు నాకు వున్న అభిప్రాయమేమంటే, జిల్లెళ్ళమూడికి వచ్చిన భక్తులకు ఆమె ఆదరంగా ఇంత అన్నం పెడుతుందనే. అంతకుమించి అమ్మను గురించి నాకు ఏమీ తెలియదు.

అయితే 2010 సంవత్సరంలో జిల్లెళ్ళమూడికి వచ్చినపుడు ఆమెను గురించి నేను తెలుసుకున్నదేమంటే... ఆమె నిత్యవర్తమాన. అంటే, జరుగుతున్న ఆ క్షణంలో జీవిస్తూ, ఆ క్షణాన్ని ఆస్వాదిస్తూ అదే క్షణంలో తనపై ధ్యాసను కలిగివున్న 'ధ్యానయోగిని' అని.

దానినే రమణ మహర్షి "సహజస్థితి" అని పేర్కొన్నారు. రమణ మహర్షి వలెనే అమ్మకూడా ఎల్లప్పుడూ అటువంటి 'సహజస్థితి'లోనే వుండి, ఆయన వలెనే అంతర్ముఖంగా వుండేదని తెలిసింది.

నేను అప్పటికే రమణ మహర్షి యొక్క అంతర్ముఖ సాధన చేస్తూండటం వలన సహజంగానే అమ్మపట్ల ఆవిధంగా ఆకర్షితుడనైనాను.

అదే సందర్భంలో నేను అమ్మ అనుయాయి, ప్రియభక్తుడు, పైగా రమణ మహర్షి యొక్క అంతర్ముఖ సాధనను, తత్త్వమును ఆకళింపు చేసుకున్న ధ్యానసాధకుడు, డా॥శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అమ్మ, రమణుల మధ్యగల సారూప్యములను, సాధర్మములను వివరిస్తూ వ్రాసిన "అమ్మ-మహర్షి" గ్రంథాన్ని సంపాదించి చదవటం జరిగింది.

అంతర్ముఖ సాధనలోనైతేనేమి, బహిర్ముఖ సాధనలోనైతేనేమి, అంతరంగ భావ వ్యక్తీకరణలోనేమి వారిరువురూ ఒకటేనని ఆ గ్రంథంలో ఆయన నిరూపించడం జరిగింది. ఆ నిరూపించిన విధానం నన్నాకట్టుకున్నది. వారిరువురి మధ్యన గల సారూప్యతను, సామీప్యతను ఆ గ్రంథ పఠనం ద్వారా నేను చక్కగా ఆకళింపు జేసుకున్నాను.

ఇది అంతా నేను ఆరోజులలో ప్రసిద్ధ పుణ్యక్షేత్రం అమరావతిలో నుండగా జరిగింది.

ఆ తరువాత నేను, నా శ్రీమతి హైదరాబాదులో మా పిల్లల వద్దకు చేరిన పిమ్మట అమ్మపట్ల నా తపన, ఆరాధన మరీ ఎక్కువ అయి, 2012 సంవత్సరం మే నెలలో సుమారు ఒక నెలరోజులపాటు నేను ధ్యానసాధన చేసుకునేందుకు జిల్లెళ్ళమూడికి రావటం జరిగింది.

సరిగ్గా అప్పుడే నాకు అమ్మను గురించి అసలైన అవగాహన కలిగింది.

అమ్మతో చిరకాల అనుబంధం కలిగివున్న కొందరి పెద్దలతో కలిగిన పరిచయం, వారి తోడి సత్సంగం, అమ్మను గురించి వ్రాసిన కొన్ని ఉద్గ్రంథాల పఠనం... వాటిల్లో ముఖ్యంగా అమ్మ భాస్కరరావు అన్నయ్యతో స్వయంగా చెప్పి వ్రాయించిన "అమ్మ జీవిత మహోదధి" నాకు అమ్మను గురించిన మంచి అవగాహనను కలిగించినవి.

పైన పేర్కొన్న గ్రంథపఠనం, సత్సంగాల వలన అమ్మ సాక్షాత్తూ ఆదిపరాశక్తి యని, అపరబ్రహ్మ యనే భావం నాలో నాటుకుపోయింది.

ముఖ్యంగా అమ్మ నడయాడిన ఈ నేల, గాలి, వాతావరణం నన్నెంతగానో ఆకట్టుకున్నవి.

అసలు వీటన్నిటి కన్నా నేను ధ్యానసాధనకు వచ్చిన రెండవ రోజునే అమ్మ నాకొక దివ్యానుభవాన్ని ప్రసాదించింది.

ఆ రోజు రాత్రి నేను "ఇప్పుడు అమ్మ వుంటే ఎంత బాగుండును! కనులారా ఆమెను చూసి, ఆ మాతృవీక్షణలో తరించిపోయేవాడిని" అనుకుంటూ మేడమీద వున్న నా గదిలో మంచంమ్మీద ఇటూ అటూ దొర్లుతూ వుంటే... నా మంచానికీ గోడకూ మధ్యన గల ఖాళీస్థలంలో ఎవరో వచ్చి నుంచున్న అలికిడి అయింది. ఎవరా? అని ఇటు తిరిగిచూస్తే ఆకుపచ్చని రంగు చిన్నపువ్వులు గల తెల్లని చీరలో ఒక నడివయసు స్త్రీమూర్తి వచ్చి ప్రక్కన నుంచున్నది. అయితే ఆమెముఖం కాక పొట్టభాగం వరకూ మాత్రమే చూడగలిగాను.

అంతే... ఏమైందో నాకే తెలియకుండా అసంకల్పిత చర్యగా గబుక్కున అటుతిరిగి పోయాను. అయితే అలాఎందుకు జరిగిందో నాకిప్పటికీ తెలియదు. భయమా అంటే అదీకాదు. మళ్ళా తలత్రిప్పి వెనక్కు చూస్తే ఆ ఆకారం అక్కడ లేదు.

మరునాడు ఉదయం లేవగానే రాత్రి జరిగిన నా అనుభవాన్ని క్రింద ఫ్లోర్‌లో వున్న ఒక భక్తునికి చెబితే "అమ్మే అప్పుడప్పుడు క్రొత్తగా వచ్చినవారికి ఇటువంటి దర్శనాలు ఇస్తూ వుంటుంది" అని చెప్పారు.

అప్పుడనిపించింది "అయ్యో! ఎంతపని చేశాను! మరికాస్త తలెత్తి పైకి చూస్తే అమ్మముఖం కనిపించేది కదా" అని. అంతే... అప్పటినుంచి ఇప్పటివరకూ అమ్మ నాకు కనిపించనేలేదు.

అసలు నేను గమనించలేదుగానీ ఆ ముందురోజునే (నేను వచ్చిన మొదటిరోజునే) అమ్మ మొదట్లో నివసించిన పూరింటి గదిలోకి అడుగుపెట్టగానే, ముందు హాల్లో అమ్మ కూచుని అందరికీ దర్శనాలు ఇచ్చే మంచం వెనుకగల గోడకు తగిలింపబడిన నిలువెత్తు ఫోటోలో వున్న అమ్మముఖాన్ని చూడగానే శరీరం పులకించిపోయింది.

ఎందుకంటే, ఏ చిత్రపటంలోనైనా చిత్రింపబడిన దేవత చిత్తరువు మందస్మిత వదనంతో వుంటుంది.

కాని, అమ్మ ప్రౌఢ వయసులో నుండగా తీసిన ఈ తెలుపు, నలుపు ఛాయాచిత్రంలో అమ్మముఖం మాత్రం-

కళ్ళలో కరుణను కురిపిస్తూ, పెదవులలో చిరు దరహాసాన్ని చిందిస్తూ చాలాకాలం తరువాత దూరప్రదేశం నుండి తిరిగి వచ్చిన కన్నబిడ్డను చూచినప్పటి సంభ్రమాశ్చర్యాలను ప్రదర్శిస్తూ "వచ్చావా కన్నా!!" అనే వాత్సల్యామృతాన్ని వర్షిస్తున్నట్టుగా వుంటుంది. (పే. 4లో వేసిన ఫోటో చూడండి)

అలా అమ్మ ముఖాన్ని ఆ ఫోటోలో చూడగానే, ఎన్నో జన్మల క్రితం, ఆ మాతృమూర్తినుండి విడిపోయి, ఆ వాత్సల్యం కోసం తపించిపోయి, తిరిగి ఈ జన్మలో ఇక్కడ హఠాత్తుగా కలసినప్పుడు కలిగే భావోద్వేగంతో, ఆనందాతిరేకంతో వివశుడనై, వెక్కి వెక్కి రోదిస్తూ అమ్మ మంచంమీద వ్రాలిపోయాను.

"అయ్యో! ఇంతటి మాతృప్రేమను కురిపించే స్త్రీమూర్తిని ఇంతవరకూ చూడలేకపోయానే!" అనే బాధ ఒకవైపున, ఆ చూపులో అమ్మ కురిపించిన సుధామృత ధారల ఆస్వాదన వలన కలిగిన ఆనందాతిశయం మరొకవైపు నన్ను ఉక్కిరిబిక్కిరి చేసినవి.

అవి దుఃఖాశ్రువులో, ఆనందాశ్రువులో తెలియదు. కాని, అంతవరకూ నాకు తెలియకుండానే నా గుండె నిండా పేరుకుని వున్న మలినభావాలు, వాటి వలన కలిగిన ఆందోళన, ఆ అశ్రువులలో కరిగి, వాటితో కలిసి బయటకు వచ్చి, మనసు తేలిక అయి హృదయం నిర్మలమైంది.

ఎన్నో సంవత్సరాలనుండి గుండెలలో వున్న పాపభారాలు, పాపభావాలు తొలగిపోయినట్లయింది.

బయటకు వచ్చాక నా యీ దివ్యానుభవాన్ని అమ్మతో చిరకాల పరిచయం గల భక్తులు, ఆమె తత్త్వాన్ని ఆకళింపు చేసుకున్న సోదరులు శ్రీ టి.టి.అప్పారావుగారితో చెప్పగా, వారు–

"ఇక్కడకు మొదటిసారిగా అమ్మను వెదుక్కుంటూ వచ్చిన చాలామందికి ఇటువంటి అనుభవమే కలుగుతుంది. ఇప్పుడే కాదు, అమ్మ దేహధారిణిగా వున్నప్పుడు కూడా ఇలాగే చాలామంది మొదటిసారిగా ఆమెను చూచినపుడు భావోద్వేగం పట్టలేక వెక్కివెక్కి ఏడ్చేసేవారు" అని చెబుతూ,

"అమ్మా! నీ దగ్గరకు వచ్చినపుడు ఎందుకు అలా ఏడుస్తారు? అని అమ్మని అడిగినప్పుడు 'పుట్టినప్పుడు అందరూ ఎందుకు ఏడుస్తారు?' అని అన్నది అమ్మ. అంటే, జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మను దర్శించడమే 'పునర్జన్మ' అన్నమాట. మరి, పుట్టిన అందరూ ఏడుస్తూనే పుడతారు కదా!

అదే అనుభవం నాకూ జరిగింది. నిజంగా జిల్లెళ్ళమూడికి వచ్చి అమ్మను దర్శించడం నా మట్టుకు నాకు పునర్జన్మయే ననిపించింది.

అంటే, అమ్మ ఇప్పుడు భౌతిక శరీరంతో లేకపోయినా, తన నిర్గుణ శరీరంతో తిరుగుతూ మనలను అహర్నిశలూ కనిపెట్టుకుని వుంటుందన్నమాట!

అయినా అమ్మను మూర్తిత్వంతో వున్నప్పుడు చూడలేకపోయానే నన్న ఆవేదన ఇప్పటికీ నన్ను వెంటాడుతూనే వున్నది.

అయితే "ఆవేదనే ఆరాధన" అన్న అమ్మ సూక్తిని పూరింటి గోడమీద చూచి కొంచెం వూరట చెందుతున్నాను.

సరే... నెలరోజుల నా సాధన తరువాత తిరిగి హైదరాబాద్ వెళ్ళిపోయాను.

వెళ్ళానే గాని నా మనసు అక్కడ నిలువలేదు. ఎప్పుడు జిల్లెళ్ళమూడికి వెళ్ళిపోదామా అని తెగ ఆరాటపడిపోయాను.

అందుకే పిల్లలకు నచ్చచెప్పి మూటాముల్లే సర్దుకుని 15-8-2 012న నా శ్రీమతితో కలిసి జిల్లెళ్ళమూడికి మకాం మార్చాను. దానికి శ్రీ చిలుకూరి బాలాజీవారి దివ్య దీవెనలు కూడా వున్నవి.

అదుగో అప్పటినుంచే అమ్మతో నా అనుభవ పరంపర మళ్ళీ మొదలైంది.

బాపట్లకు 13 కి.మీ. దూరంలో వున్న జిల్లెళ్ళమూడికి చేరుకోవాలంటే బాపట్లలో బస్సుగాని, రైలుకాని దిగి అద్దె ఆటోగాని, షేర్ ఆటోగాని ఎక్కి రావాలి. లేదా, బాపట్ల నుండి పెదనందిపాడు పోయే బస్సు ఎక్కి ఏడవ మైలు (11వ కిలోమీటరు) వద్ద దిగి, రెండు కి.మీ. వాగు వెంటే చిన్నరోడ్డుపై జిల్లెళ్ళమూడి వూళ్ళోకి నడిచిరావాలి.

ఒకరోజు నేను విజయవాడ నుంచి బాపట్ల వచ్చి బస్సు ఎక్కి ఏడవ మైలు వద్ద దిగేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. చిమ్మ చీకటి. చేతిలో లగేజి వుంది. పైగా పైన ఆకాశం మేఘావృతమై ఉరుములు మెరుపులతో వర్షం పడేట్టు వుంది.

అదే నాకు మొదటిసారి కావటంతో ఆ చీకటిలో నడక ఎలానా అని ఆలోచిస్తుంటే నా వెనుకనే మా వూరివారు ముగ్గురు అదే బస్సు దిగి వచ్చి నా చేతిలో లగేజిని కూడా అందుకుని నన్ను క్షేమంగా జిల్లెళ్ళమూడికి చేర్చారు. నిజానికి వారికి ఆరవ మైలు వద్ద ఆటో దొరికినా ఆ ముగ్గురి కోసం ఆటో కట్టనన్నాడట. అందుకని వారు తప్పనిసరిగా నేను ఎక్కిన బస్సే ఎక్కారు. వారికి ఆరవ మైలులో ఆటో అతను రానని చెప్పటం కేవలం నా కోసమే 'అమ్మ' చేసిన ఏర్పాటని నాకనిపించింది.

ఇంకోసారి రాత్రి అదే సమయంలో నేను ఏడవ మైలు వద్ద ఒక్కడినే బస్సు దిగేసరికి అటు రేటూరు నుంచి ఒక ట్రాక్టరు వచ్చి నాముందు ఆగింది. అది జిల్లెళ్ళ మూడికే వెడుతోందిట. ఆయన నన్ను ఎక్కించుకుని క్షేమంగా జిల్లెళ్ళమూడికి చేర్చాడు.

అతను చెప్పిన దానినిబట్టి నిజానికి ఆ రాత్రి సమయంలో అతనికి జిల్లెళ్ళమూడి వెళ్ళవలసిన అవసరం లేదట. ఎందుకనో ఆయన రాత్రిభోజనం చేసిన తరువాత, వూరకనే జిల్లెళ్ళమూడిలో వున్న అతని స్నేహితునితో మాట్లాడాలనిపించిందట. అదికూడా అంత ముఖ్యమైనది కాదట. అయినా జిల్లెళ్ళమూడిలో తన స్నేహితుని చూడాలనిపించి ట్రాక్టరు తీసుకుని బయలుదేరాడట. అంతేకాక దారిలో ఇంకొకరితో అరగంటసేపు మాట్లాడి ఏడవ మైలు దగ్గరకు సరిగ్గా నేను బస్సుదిగి, దిక్కులు చూస్తున్న సమయానికే వచ్చాడు.

సరిగ్గా అతడు దారిలో తన స్నేహితునితో మాట్లాడేందుకు ఆగిన సమయంలోనే నేను బాపట్లలో బస్సు ఎక్కాను.

ఇదంతా చూస్తుంటే, ఆ రాత్రి సమయంలో అతనికి జిల్లెళ్ళమూడికి వెళ్ళాలనిపించేలా చేయటం, పైగా వచ్చేదారిలో అరగంటసేపు అతని స్నేహితునితో మాట్లాడేందుకు ఆపటం ఇదంతా అమ్మ నాకోసం కలిగించిన ఏర్పాటులాగే నాకనిపించింది.

ఆ విషయమే అతనితో అంటే "అవునండి! అమ్మ ఎప్పుడు ఎవరిచేత ఏమి చేయిస్తుందో ఎవరికీ తెలీదు" అన్నాడు.

అమ్మ అన్నది కూడా అదే-

"తోచింది నీకే అయినా అలా తోపింపజేసేవాడు వాడేననుకో!" అని.

"ఇదేమిటి? 'వాడేననుకో' అంది. అయితే అలా తోపించేది అమ్మకాదా!' అని మీరడగవచ్చు. ఇక్కడ 'వాడు' అంటే అమ్మే! 'అమ్మ'కీ 'వాడి'కీ తేడా లేదు. అమ్మే వాడు, వాడే అమ్మ. అందుకే 'అమ్మే బ్రహ్మ' అనుకున్నాం. 'స్త్రీ పురుష బేధం మనుషులకే గాని, భగవంతునికి కాదు' అని మనవెనుక చెప్పుకొన్నాం. ఆయన సచ్చిదానంద స్వరూపుడు!

ఇలా అమ్మ నన్ను అహర్నిశలూ కనిపెట్టుకుని నాకెన్నెన్నో అనుభవాలనిస్తోంది.

ఇంకొక సమయంలో నేనొక్కడినే అనసూయేశ్వరాలయంలో అమ్మ నామం చెబుతూ గర్భగుడి చుట్టూ ప్రదక్షిణం చేస్తూంటే, నాకొక ఆలోచన వచ్చింది. అమ్మకి నాన్నగారంటే చాలా ఇష్టం, గౌరవం. పైగా అమ్మ సమాధి ప్రక్కనే నాన్నగారి సమాధి కూడా వున్నది. అటువంటప్పుడు నామంలో అమ్మ పేరు ప్రక్కనే నాన్నగారి నామాన్ని కూడా చేర్చి చెబితే బాగుంటుందనిపించి వెంటనే-

"జయహో మాతా! శ్రీ అనసూయా!

అనసూయేశ్వర! శ్రీ నాగేశ్వర!"

అని నామం చెబుతూ రెండవ రౌండ్ ప్రదక్షిణ మొదలుపెట్టాను.

దాని ఫలితం వెంటనే కనిపించింది! అలా అమ్మ, నాన్నగార్ల నామం చెబుతూ రెండడుగులు వేశానో లేదో నా వెనుకనే అదే నామం చెబుతూ ఒక స్త్రీ గొంతు కూడా వినబడింది. వెంటనే నేను ఆగి చుట్టూ చూశాను. అక్కడ గుడిలో స్త్రీ కాదుగదా, చిన్నపిల్లలు కూడా ఎవరూ లేరు. పూజార్లకు విశ్రాంతి సమయం అవటం వల్ల వాళ్ళు కూడా అక్కడ లేరు. మొత్తం అనసూయేశ్వరాలయంలో నేనొక్కడినే వున్నాను. ఒకవేళ బయట వరండాలో గాని, ప్రక్కనున్న హైమాలయంలో గాని ఎవరైనా వున్నారేమోనని వెళ్ళి చూశాను. అక్కడకూడా ఎవరూ లేరు.

అది నాభ్రమయేమోనని మళ్ళా అనసూయేశ్వరాయంలోకి వచ్చి అమ్మ నాన్నగార్ల నామాన్ని చెబుతూంటే మళ్ళీ నా వెనుకనే స్త్రీ గొంతు, అదే నామం చెబుతూ వినిపించింది.

అప్పుడనిపించింది, తన నామం ప్రక్కన నాన్నగారి నామం కూడా చేర్చినందుకు సంతోషించి అమ్మకూడా నాతోబాటు గొంతు కలిపిందేమోనని.

ఆ భావం కలుగగానే, నా శరీరం ఆనంద పారవశ్యంతో రోమాంచితమై రెండు చేతులూ జోడించి "అమ్మా! నా ఆలోచనను చర్యను సమర్థిస్తూ, సంతోషంతో నా వెంటనే వున్నావా తల్లీ!" అని నమస్కరించుకున్నాను.

అదుగో, ఆనాటినుంచీ ఈనాటి వరకూ అనసూయేశ్వరాలయంలో ప్రదక్షిణం చేస్తున్నప్పుడు అమ్మ నాన్నగార్ల పై నామాలను కలిపి చెబుతూనే తిరుగుతున్నాను.

అయితే నాకొక్కటే చింత. దేహ విరమణానంతరం భక్తులెందరికో కలలో కనబడిన అమ్మ, నాకు మాత్రం ఇంతవరకూ స్వప్న దర్శనం కలుగజేయలేదు, ఆ రోజు నా వసతి గృహంలో ఇచ్చిన అర్ధశరీరం దర్శనం తప్ప. ఒకటి రెండుసార్లు హైమ కనబడింది కాని, అమ్మ వాత్సల్య వదనాన్నింత వరకూ ఫోటోల్లో తప్ప కలలో కూడా చూడలేదు. ఇలలో ఆ అదృష్టం ఎలాగూ లేదనుకోండి.

అందుకే, నాలో ఆవేదనను గమనించే కాబోలు పూరింటి ముందు కూచుని నేను నామం చెబుతున్నప్పుడు పూరింటి గోడల మీద అమ్మ ముఖం, హైమ ముఖం ఛాయామాత్రంగా కనబడతాయి.

అదే నాకు పదివేల పెన్నిధి!

వేలు, పెన్నిధి అంటే గుర్తుకువచ్చింది. మా విషయంలో ఎంతో కాలంనుండీ అపరిష్కృతంగా వున్న ఒక ఆర్థిక సమస్యను అమ్మ పరిష్కరించి మమ్మాదుకున్నది.

ఇక్కడ మమ్మల్నే కాకుండా హైదరాబాదులో వుండే నా బిడ్డలను వారి కుటుంబాలను కూడా చల్లగా చూస్తూ కాసి, కాపాడుతున్నదీ చల్లని తల్లీ, ఆమె బిడ్డ! ఇలా చెబుతూ పోతే కరుణాంతరంగ అయిన అమ్మ, మాపై చూపిన కరుణాతరంగాలు చాలానే వున్నవి.

అన్నిటికీ మించి అర్కపురిగా నామాంతరం చెందబడిన ఈ జిల్లెళ్ళమూడి నేల అతి పవిత్రమైనది. అమ్మ పాదస్పర్శతో పావనమైన ఈ నేల, ఈ గాలి, ఇక్కడి నీరు అతి మహిమాన్వితమైనవి. ఈ నేలపై నడిచి, ఇక్కడి గాలిని పీల్చి, ఇక్కడి నీటిని త్రాగితే చాలు మనకు గల అన్ని శారీరక మానసిక రుగ్మతలూ పటాపంచలౌతాయి.

అందుకే ఇక్కడ మా వంటి భక్తులు హాయిగా సుఖంగా జీవించేందుకు శ్రీ చక్కా శ్రీమన్నారాయణ అనే తన భక్తునిచే అమ్మయే, సకల సదుపాయాలతో, సింగిల్‌రూములు, సింగిల్ బెడ్రూములు, డబుల్ బెడ్రూములతో అలరారే అపార్ట్‌మెంట్‌లను నిర్మింపజేసింది. వాటిల్లో ఎవరికి తగ్గ ఆర్థిక స్థోమతతో వారు స్వంతంగానో లేదా అద్దె ఇస్తూనో హాయిగా జీవిస్తున్నాము.

## 2. సంస్థ నైట్‌వాచ్‌మెన్ 'రెడ్డి సుధా' అనుభవాలు

మా వంటి వారినే కాదు. ఈ జిల్లెళ్ళమూడి గ్రామస్థులను, ముఖ్యంగా తనను నిజాయితీగా, భక్తిగా సేవిస్తూ, 'నా సర్వస్వము నువ్వే అమ్మా! నీవు వినా నాకు దిక్కెవరూ లేరు' అని సర్వస్వ శరణాగతిని వేడిన వారిని అమ్మ అన్నిటికీ తానై, వారిని కంటికి రెప్పలా కాపాడుతున్నది.

అటువంటి వారిలో 'రెడ్డి సుధా' అని పిలువబడే రెడ్డి సుధాకరరావు ఒకరు.

ఇక్కడ అతని డ్యూటీ రాత్రిపూట ఆలయ సముదాయానికీ, సంస్థకూ కాపలా కాయటం. పగటిపూట సంస్థకు సంబంధించిన చిన్న చిన్న పనులు చేసిపెట్టడం.

మొదటినుండీ అంటే, ఆయన తండ్రి చినసుబ్బయ్య తరం నుంచీ వారి కుటుంబం అంతా అమ్మసేవలోనే వున్నది. ముఖ్యంగా రెడ్డి సుధా తనను తాను అమ్మసేవకు అంకితం చేసుకున్నాడు.

అందుకు అమ్మ తన దేహ విరమణానంతరం కూడా తన సంస్థకు కావలిగాచే ఆయనకు తానే కావలిగా వుండి అతనిని కంటికి రెప్పలా కాపాడుతున్నది.

విచిత్రంగా వుందికదూ! భగవంతుడంతే... తనకు దాసులైన వారికి తాను దాసుడౌతాడు! వారితో మాట్లాడుతాడు. వారికి తరచుగా మంచి నిదర్శనాలిస్తాడు.

ఆ విధంగా అమ్మ అతనికి చాలా నిదర్శనాలు ఇచ్చింది.

వాటిల్లో కొన్ని. అతడు చెప్పిన దానిని బట్టి...

కొంత కాలంక్రితం అనసూయేశ్వరాలయం ఉత్తరపు గోడను కడుతున్న సమయంలో బయట గ్రామం నుంచి వచ్చిన కూలీలు కొందరు కడుతున్న గోడప్రక్కన ఆలయం వరండాలో రాత్రిపూట పడుకుని వున్నారట.

సరిగ్గా రాత్రి ఒంటిగంట దాటిన తరువాత మొదటగా ఒక స్త్రీ ఘల్లుఘల్లుమనే గజ్జల చప్పుడుతో ప్రక్కనే వున్న అనసూయేశ్వరాలయం లోంచి వచ్చి నేలపై పడుకుని వున్న వారిని దాటుకుంటూ వెనుక నున్న పూరింటివైపు నడుచుకుని వెళ్ళినదట. ఆ తరువాత వెంటనే ఇంకొకరి గజ్జెల చప్పుడు అలాగే వినవచ్చిందట. ఎవరో స్త్రీలు తమను దాటుకుని వెడుతున్నారనుకుని వారు కళ్ళు తెరచి చూస్తే ఎవరూ కనబడలేదట. కానీ, ఆ చప్పుళ్ళు వినవస్తూనే వున్నవట. దానితో వారు అది ఏ గాలి పనో అనుకుని భయంతో కేకలు వేయగా ఆ ప్రక్కనే వున్న సుధా వెళ్ళి ఏమిటని అడగ్గా వారు విషయాన్ని చెప్పారట.

దానికతడు ఏమీ లేదని వారికి సర్దిచెప్పి వెళ్ళి పూరింటి ముందు వున్న బల్లమీద నడుం వాల్చాడట.

అయితే, తెల్లవారుఝామున సుమారు నాలుగు గంటల సమయంలో ఈసారి సుధాకి ఆ కాలి అందెల సవ్వడి వినబడిందట. ఆ ధ్వని బయట తోటలోనుంచి వచ్చి పూరింట నున్న 'అలంకారహైమ' ఆలయం గదిలోకి వెళ్ళిపోయి అక్కడ ఇద్దరు స్త్రీలు మాట్లాడుకుంటున్నట్టుగా గుసగుస ధ్వని వినబడినదట.

అప్పుడతనికి అనిపించిందట, ఆ చప్పుళ్ళు, మాటలు ఎవరివో కావు... అమ్మ, హైమల వని.

ఆ మరునాడు అతడు సంస్థలో వారికి ఆ విషయం చెబితే ఆ సంస్థలోని ఒక వ్యక్తి దానిని తేలిగ్గా తీసిపారేసి పరీక్షగా ఆ రాత్రి వచ్చి పూరింటి ముందు ఆ బల్లపైనే పడుకున్నారట. అయితే ఆయన కటువంటివేమీ వినబడలేదు, కనబడలేదట.

దీనినిబట్టి మనం అర్థం చేసుకోవలసిందేమిటంటే తనపైన విశ్వాసం వున్నవారికే భగవంతుడు తన ఉనికిని తెలియజేస్తాడని.

అందుకే– "విశ్వాసమే భగవంతుడు" అని అన్నది అమ్మ. అంటే, విశ్వాసం గలవారికి భగవంతుడు ఎంత దూరంలో వున్నా తన ఉనికిని తెలియబరుస్తాడు. దానికి అమెరికా నివాసి గార్డన్ వెస్టర్‌లండ్ ఉదంతమే కొండంత నిదర్శనం!

ఆ విశ్వాసం లేనివారికి భగవంతుడు తన ప్రక్కనే వచ్చినుంచున్నా ఆ విషయం వారికి తెలియదు.

అతనిదే ఇంకొక నిదర్శనం.

కొంతకాలం క్రితం పూరింటినానుకుని పెద్ద పూలతోట వుండేది. దానిని సగం తొలగించి వేరే విధంగా ఉపయోగించుకునేందుకు చదును చేశారు.

అక్కడ పూలతోట వున్నప్పుడు రెడ్డి సుధా తెల్లవారుఝామున డ్యూటీ ముగించుకుని వెళ్ళిపోయేముందు తోటలో పూలు కోసి గుళ్ళో పూజాదికాలకై ఇచ్చేవాడు. ఇప్పుడా తోట లేకపోయేసరికి అతనికి వెలితిగా అనిపించి "అయ్యో! అమ్మకు, హైమకు ఇచ్చేందుకు పూలు లేవే" అని బాధపడుతూ వుంటే ఒకరోజు అతనికి అమ్మ కలలో కనిపించి, మిగిలిన తోటవేపు తీసుకువెళ్ళి "ఏంరా! ఇదంతా తోటకాదా? ఇక్కడి పూలు తీసుకువెళ్ళి ఇవ్వవచ్చును కదా" అని చెప్పిందట.

ఇంకొకసారి అతడు రాత్రి పదకొండు గంటలవరకు 'అందరింటి' ఆవరణ అంతా తిరిగివచ్చి అలసిపోవటం వల్ల కాస్సేపు విశ్రాంతి తీసుకుందామని పూరింటి ముందు బల్లపై కూర్చున్నాడు. అలా కూర్చుండగానే ఎప్పుడు నిద్రపట్టిందో గాఢంగా గుర్రు పెట్టి మరీ నిద్రపోయాడట. సుమారు రాత్రి ఒంటిగంటకు ఎవరో స్త్రీ వచ్చి చెంపమీద ఛెళ్ళున చరిచి,

"ఏరా! పడుకుని నిద్రపోవటానికి వచ్చావా ఇక్కడికి?" అని గదమాయింపుగా అడిగిందట.

అంతే... ఆ దెబ్బకు అతడు వులిక్కిపడి లేచిచూడగా అక్కడ ఎవరూ లేరట. అది అచ్చంగా అమ్మగొంతులానే వుందనిపించడంతో "అమ్మో! అమ్మ అంతా కనిపెడుతూనే వుంది కామోసు" ననుకుని వెంటనే డ్యూటీలో చేరిపోయాడు.

అంతేమరి... భగవంతునికి మనం కాపలా ఏమిటి? భగవంతుడే ఎల్లప్పుడూ మనలను కనిపెడుతూ వుంటాడు.

అది నిజమే ననడానికి ఇదే నిదర్శనం!

ఇప్పుడు చెప్పబోయేది ఈ మధ్యనే అతనికి అనుభవమయిన విషయం.

అతని అమ్మాయి వివాహం కొద్దికాలం క్రితం చేశాడతను. ఆ పెళ్ళి సమయంలో ఒక ఖర్చుకోసం అతనికి ఐదువేల రూపాయలు కావలసి వచ్చాయి. అతని దగ్గర ఆ సమయంలో అంత డబ్బు లేదు. ఎంత ప్రయత్నించినా ఎక్కడా అది సర్దుబాటు కాలేదు. అది లేకపోతే చాలా ఇబ్బంది అవుతుంది.

ఏంచేయాలా అని బాధపడుతూ అతడు తన ఇంటిలోగల పూజగదిలో వున్న అమ్మ ఫోటో వద్దకు వెళ్ళి,

"అమ్మా! ఎలాగైనా ఈ గండం గట్టెక్కించు" అని కన్నీరు నింపుకొని వేడుకున్నాడు.

అంతే... ఆ సాయంత్రానికల్లా సంస్థలో నుండి ఒక ప్రముఖవ్యక్తి అతనిని ఇంటికి పిలిచి "మీ పిల్ల పెళ్ళి అంటున్నావుగా. ఈ డబ్బు వుంచు" అంటూ సరిగ్గా అతనికి ఐదువేల రూపాయలు అందించాడట.

అమ్మ అంటే అదే మరి. అయినా అమ్మ ఆశ్రిత పక్షపాతి కదా!

అంతేకాదు. అమ్మ అభీష్టవరప్రదాయిని కూడా. ఇదికూడా ఈ మధ్యనే అతనికి అనుభవమయింది.

తన కూతురు వివాహానంతరం సుధా కొడుకుపెళ్ళి చేయడానికి సంకల్పించాడు. అతడు సామాన్య వ్యవసాయదారుడైనా కొడుకుని, కూతుర్ని పి.జి. వరకూ చదివించాడు.

కొడుక్కు తగిన పిల్లకోసం చూస్తున్నాడు.

ఇలా వుండగా పూర్వం జిల్లెళ్ళమూడిలోనే వుండి తర్వాత పాతగుంటూరుకు వలసబోయిన గండికోట నాగయ్య కుమారుడు శింగయ్య అనే రైతు, తన కుటుంబంతో సహా వచ్చి అమ్మను దర్శించుకున్న తరువాత పాత పరిచయం కొద్దీ తన కుటుంబాన్ని తీసుకుని రెడ్డి సుధా ఇంటికి వచ్చాడు. ఇదివరకు రెడ్డి సుధా తండ్రి చినసుబ్బయ్య ఈ

శింగయ్య తండ్రి నాగయ్య అమ్మకు చిరకాలం సేవచేసినవారే. కాస్సేపు కబుర్లు చెప్పుకొన్న తరువాత శింగయ్య కుటుంబం గుంటూరు వెళ్ళిపోయారు.

అందులో ఏమీ విశేషం లేదు. అయితే అసలు కథ అప్పుడే మొదలైంది.

తలిదండ్రులతో కలసి వచ్చిన శింగయ్య కూతురిని చూసిన తరువాత రెడ్డి సుధాకు ఎందుకో ఆ అమ్మాయిని తన కొడుక్కి చేసుకుంటే బాగుండుననిపించింది. చక్కనిపిల్ల. తన కొడుక్కు చక్కని జోడీ అనుకుని తన మనసులోని మాట భార్యకు చెప్పగా ఆమెకూడా సరేనంది. కొడుక్కు కూడా ఇష్టమైనట్టుంది.

అందుకే ఏంచేయాలో తోచక అలవాటు ప్రకారం అమ్మదగ్గరకు వెళ్ళి తన మనసులోని కోరిక అమ్మకు చెప్పి, "అమ్మా! ఎలాగైనా ఈ అమ్మాయిని మాయింటి కోడలిగా చెయ్యమ్మా!" అని వేడుకున్నాడట.

వేడుకున్నాడేగాని పాత గుంటూరులో శింగయ్య ఇంటిఅడ్రసుగాని, మిగతా వివరాలు గాని సుధాకు తెలియవు. అసలు ఈ ఆలోచన వాళ్ళు వచ్చి వెళ్ళిపోయాకనే ఇతనికి కలిగింది. అయినా అంతా అమ్మకు చెప్పుకొన్నాగా, చాలు. ఆవిడదే భారం అని వూరుకున్నాడు.

ఇలా వుండగా, ఒకరోజు ఉదయాన్నే అతనికి గుంటూరులోనే వున్న స్నేహితుడొకరి నుంచి ఒక ఫోన్‌కాల్ వచ్చింది.

దాని సారాంశం ఏమిటంటే... "గుంటూరులోనే వీరి అబ్బాయికి మంచి సంబంధం వుంది. పిల్ల చాలా బాగుంటుంది. పైగా వాళ్ళు అబ్బాయికి మంచి ఉద్యోగం వేయించి మరీ పిల్లనిస్తామంటున్నారు" అని.

అయితే దానికి సుధా ఒప్పుకోలేదట. జరిగిందంతా తన స్నేహితునికి చెప్పి,

"వాళ్ళెంత గొప్పవాళ్ళయినా, పిల్ల ఎంత బాగున్నా మా అబ్బాయికి ఎంత మంచి ఉద్యోగం వేయిస్తానన్నా మాకు అనవసరం. మాకు ఈ పిల్లనే చేసుకోవాలని వుంది. అయినా అంతా అమ్మకు చెప్పుకొన్న తరువాత, ధనవంతులు కదా అని మళ్ళా ఈ సంబంధం చేసుకోవడం బాగుండదు. అసలు అమ్మే ఒప్పుకోదు"అని తన మిత్రునికి ఖరాఖండీగా చెప్పి-

"నీకు వీలయితే ఈ గండికోట శింగయ్య వివరాలు ఏమిటో తెలుసుకో" అన్నాడు.

దానికా స్నేహితుడు వెంటనే "అరె! విచిత్రంగా వుందే! నేను చెబుతున్నదీ ఆ సంబంధమేనయ్యా!" అని అనటంతో రెడ్డి సుధా ఎగిరి గంతేసి, వెంటనే గుంటూరు వెళ్ళి తన స్నేహితుని సహాయంతో వారిని కలసి మాట్లాడి ఆ సంబంధమే నిశ్చయం చేసుకోవటం, ఆ మరుసటి నెలలోనే అమ్మ సన్నిధిలో తన కుమారుని వివాహం వైభవంగా చేసి ఆ పిల్లను తన యింటి కోడలిగా తెచ్చుకోవడం జరిగింది.

"హమ్మయ్య! చివరికి అమ్మ నా సంకల్పం నెరవేర్చింది" అని రెడ్డి సుధా హాయిగా వూపిరి పీల్చుకున్నాడు.

అయితే అలా అనుకోవడం రెడ్డి సుధా భ్రమయేనని మనం అనుకోవాలి.

ఎందుకంటే అది రెడ్డి సుధా సంకల్పం కాదు. అమ్మ సంకల్పమే! అది ఇప్పటిది కాదు.

రెడ్డి సుధా తండ్రి చినసుబ్బయ్య, అతని వియ్యంకుడు గండికోట శింగయ్య తండ్రి నాగయ్యల హయాంలోనే అమ్మ సంకల్పించినది. ఎందుకంటే వారిద్దరూ అమ్మ భక్తులే కాదు. నమ్మిన సేవకులు కూడా.

సుధా చెప్పిన దాని ప్రకారం... ఆ రోజుల్లో ఇప్పటిలా జిల్లెళ్ళమూడి నుంచి ఏడోమైలుదాకా రోడ్డు లేదు. అక్కడనుంచి బాపట్లకు బస్సులు కూడా లేవు. జట్కా బళ్ళూ, ఒంటెద్దు బళ్ళే గతి. అదికూడా బాపట్లకు చుట్టు దారి.

అందువల్ల జిల్లెళ్ళమూడి నుంచి దగ్గర దారిలో బాపట్ల వెళ్ళాలంటే ఊరి ప్రక్కనుంచే ప్రవహిస్తున్న నల్లమడ వాగును (అమ్మ దానికి ఓంకార నది అని పేరు పెట్టింది) దాటి, అడ్డంబడి పొలాల్లోంచి నడిచి బాపట్ల పోయేవారు.

నాన్నగారు జమాబందీ లెక్కల కోసం బాపట్లలోనే రోజుల తరబడి వుండిపోతే అమ్మ ఆయన అవసరాలను చూడడానికి బాపట్ల వెళ్ళి వచ్చేది. అటువంటి సమయాల్లోనే రెడ్డి చినసుబ్బయ్య, గండికోట నాగయ్య కలిసి అమ్మవెంట వెళ్లి నిండుగా ప్రవహిస్తున్న వాగును దాటించి వచ్చేవారు. మళ్ళీ సాయంత్రం అమ్మ బాపట్లనుంచి తిరిగి వచ్చే సమయానికి వాగు దగ్గరకు వెళ్ళి, అమ్మను క్షేమంగా వాగు దాటించి తీసుకువచ్చేవారు.

అంతేనా? అమ్మ రోజూ అయిదారుసార్లు గుండిగల కొద్దీ స్నానం చేసేదట. ఆ నీళ్ళన్నీ వీరిద్దరూ వాగునుంచి కావిళ్ళు వేసుకుని అమ్మ యింట్లో పోసేవారట. తరువాత పొలం పనులు, పాడి పశువుల చాకిరీ అంతా వుండనే వుంది.

అందుకే అమ్మ ఆ రోజుల్లోనే వీరిద్దరి కుటుంబాలనూ కలపాలని నిశ్చయించుకుని వుంటుంది. దానిని యీనాటికి ఇలా నెరవేర్చింది. కాబట్టి అది కేవలం రెడ్డి సుధా సంకల్పం కాదు అమ్మ సంకల్పమే!

ఆ విషయమే సుధాతో అంటే "అవునండోయ్! పిచ్చోడ్ని. నేనేదో కోరితేనే అమ్మ నెరవేర్చిందనుకున్నాను" అంటూ ముక్కున వేలేసుకున్నాడు.

అందుకనే పెద్దలన్నారు "వివాహము దైవ నిర్ణయం" అని.



**కొసమెరుపు:**

## ఆది మధ్యాంత రహిత-అమ్మ

సరే... ఇంతవరకూ మనం అమ్మ దేహధారణ చేసి భూమిపైన అవతరించిన దగ్గరనుండి తాను దేహ పరిత్యాగం చేసేవరకూ చూపిన లీలలను, అలాగే దేహ పరిత్యాగానంతరం మన మధ్యే వుంటూ మనలను కనిపెట్టుకుంటూ వుండి చూపిన, ఇంకా ఇప్పటికీ చూపుతున్న నిదర్శనాలను గురించి ముచ్చటించుకున్నాం.

అంటే, దేహధారణ చేసి, సృష్టిమధ్యలో మన నుద్ధరించడానికై మనమధ్యకు వచ్చిన అమ్మ తన దేహ విరమణానంతరం కూడా మనమధ్యనే రూపరహితమై సంచరిస్తూ, తన ప్రేమతత్త్వాన్ని మనకు నిరంతరాయంగా పంచుతున్నదన్న సత్యాన్ని గురించి కూడా మనం తెలుసుకున్నాం.

అయితే అంతకుముందు? అంటే తన దేహధారణకు ముందుగల ఆదికాలంలో?

శ్రీకృష్ణుడు తన ముందు అవతారంలో రామునిగా, రామునికి ముందు నారాయణునిగా, ఆది నారాయణనిగా లోక కళ్యాణార్థం మొత్తం పది అవతారాలను ఎత్తాడని మనకు తెలుసు.

అయితే అమ్మ మాత్రం తన ఈ అవతారానికి ముందు కూడా అధిదేవతగా, ప్రత్యధిదేవతగా మనమధ్యనే సంచరిస్తూ, మనలను గమనిస్తూ వుండేదన్న విషయాన్ని కొసమెరుపుగా ఇప్పుడు ముచ్చటించుకుందాం.

గోవిందరాజుల దత్తు అనబడే దత్తాత్రేయశర్మ తన వృద్ధాప్యంలో గుంటూరునుండి అమ్మ దగ్గరకు వస్తూ వుండేవారు. అమ్మ ఆయనతో ఒకసారి ఏమందో ఈ క్రిందను చూడండి. (పే.241- లోకబాంధవి)

"నాన్నా! నీవు మంగళగిరిలో బాలాంబగారి సత్రంలో వడ్డన చేశావు కదూ!" అని అడిగారు అమ్మ. ఇంటికి వెళ్ళి వారు ఆ సంఘటన ఎప్పుడు జరిగిందో విచారిస్తే అది క్రీ.శ.1918లో జరిగిందని గుర్తుకు వచ్చింది. అమ్మ పుట్టింది 1923లో. అమ్మ అడిగిన విషయం 1918లో జరిగింది. అమ్మ అనంతజ్ఞానాన్ని మన స్థాయికి తగ్గట్టు గుర్తించడానికి ఇది ఒక చిన్నసంఘటన మాత్రమే.

అలాగే అమ్మ పినతాతగారైన చిదంబరరావుగార్ని, తాను అమ్మగా భూమిపైకి రాకముందే అంతకు పన్నెండు సంవత్సరాల నాటి సంగతిని గురించి అడుగుతుంది. అది వారిపై ఆ రోజులలో వచ్చిన నేరారోపణ. తరువాత వారికి ఇచ్చిన దివ్యదర్శనాలతో

బాటు పొన్నూరులో జరిగిన సంఘటన సంగతి, అది ఎవరు చేసిందీ అంతా సినిమా తెరపై కనబడినట్లు వారికి కనబడుతుంది. ఈ విధంగా అమ్మ తన జననానికి ముందు జరిగిన సంఘటనలను తాతగారికి చూపించటం సహితం జరుగుతుంది.”

భక్త పాఠకులారా! తెలిసింది గదా... అమ్మ పుట్టుకకు పూర్వమే వారి వారి జీవితాలలో జరిగిన సంఘటనలను, అటు దత్తుగారికి, ఇటు తన పినతాతగారైన చిదంబరరావుగార్కి తెలిపి, తన సర్వజ్ఞత్వాన్ని, ఆదిమధ్యాంత రహితమైన తన త్రికాలజ్ఞత్వాన్ని నిరూపించుకున్నది!

ఇంతకన్నా ఏంకావాలి? అమ్మ ‘మున్నుంది, ఇపుడుంది, ముందుండగలదు. అంతటికన్నింట ఆవల గలదు. అంతెరుంగగరాని ఆదిని గలదు’ అని తెలియడానికి!

అంతమూ ఆదీ లేని పరాపరబ్రహ్మ అమ్మే! ఇంకా... లోకంబులన్నిటా లోకాలకావల, త్రిజగంబులందునా త్రిజగాలకావల, ఈవల అంతటా, అన్నిటా నిండి వున్న ఆ బ్రహ్మ పదార్థమే ‘అమ్మ’ అని గుర్తించడానికి ఏం కావాలి?

అందుకే, అమ్మను ఒకసారి తన కళ్ళతో చూడనుకూడా చూడని, ఖండాంతరాల కావల నున్న అమెరికా నివాసి గార్డన్ వెస్టర్‌లండ్ కేవలం అమ్మ తనకు యిచ్చిన దివ్యానుభూతుల, దివ్యానుభవాలను ఆధారంగా చేసుకుని-

“అమ్మ బ్రహ్మయే కాదు- బ్రహ్మము కూడా” అని చెప్పాడు.





## వడ్డాది సత్యనారాయణమూర్తి

# అమ్మే బ్రహ్మ

నా జన్మస్థలం విజయనగరం. పుట్టుక, పెరుగుదల, విద్యాభ్యాసం అన్నీ అక్కడే.

రాష్ట్రప్రభుత్వ ఇరిగేషన్ శాఖలో సుమారు 34 సంవత్సరములు పనిచేసి 1997 జూలై నెలలో పదవీ విరమణ చేసి సుమారు 10 సంవత్సరములు గుంటూరు జిల్లా అమరావతిలో నివసించి, ప్రస్తుతం అదే జిల్లా జిల్లెళ్ళమూడిలో 'అమ్మ' సన్నిధిన విశ్రాంత జీవితం గడుపుతున్నాను.

**నా ఇతర ఆధ్యాత్మిక రచనలు :**

1. ధ్యాన సాగరం 1,2 భాగాలు
2. మరో ఆదిశంకరులు రావాలి
3. శ్రీ శ్రీపాద గీతామృతం (విశ్లేషణ)

పుస్తక పఠనం, గ్రంథరచన, యోగాభ్యాసం నా అలవాట్లు. కోరిన వారికి యోగాసనాలు, ధ్యాన సాధనలో శిక్షణ యిస్తున్నాను. వాటిని గురించి విపులంగా నా 'ధ్యాన సాగరం' (1,2 భాగాలు)లో తెలియజేసియున్నాను.


₹ 90/-

SPO019


